# రామాభ్యుదయము

## పర్యాలోకనము



రచన:

బాదూరు కుసుమాంబ

# అంకితము

నా

తల్లిదండ్రులు

శ్రీమతి సక్కుబాయమ్మ,

శ్రీ బూదూరు నరసింహులు రెడ్డిగార్లకు-

*This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme " Aid to Publish Religious books ".*

# పండితాభిప్రాయములు

**Prof. G. N. REDDY,** M.A. M.Litt., Ph.D.,
*Principal,*
S. V. University College, Tirupati.

ప్రబంధయుగంలో వెలసిన అయ్యలరాజు రామభద్రుడు ప్రబంధలక్షణాలను కొంత పోషించి చేసిన రామాయణాను వాదమే రామాభ్యుదయము. 'అభ్యుదయ' శబ్దానికి సూర్యచంద్రాదుల 'ఉదయము', 'మంగళాభివృద్ధి', 'ప్రగతి' మొదలైన అర్థాలున్నాయి. తెలుగు కావ్యాల్లో – ముఖ్యంగా తంజావూరు నాయక రాజుల కాలంలో వెలసిన అచ్యుతాభ్యుదయము, రఘునాథనాయకాభ్యుదయము ఇత్యాది కావ్యాల్లో అభ్యుదయశబ్దం కొన్ని కావ్యాల పేర్లలో సమసించింది. ఇట్టి అభ్యుదయ కావ్యాలను ఒక ప్రత్యేక ప్రక్రియకు చెందినట్లు చెప్పలేము కాని తెలుగు కావ్యాల నామకరణంలో ఇట్టినామకరణ మొక ముఖ్యలక్షణమని భావించవచ్చు. ఇట్టి అభ్యుదయ నామమున్న కావ్యాల్లో రామాభ్యుదయము మొదటిది.

రామాభ్యుదయ ప్రబంధ వైశిష్ట్యాన్ని పాఠకలోకానికి చాటి చెప్పడానికి శ్రీమతి కుసుమాంబ చేసిన ప్రయత్నం ప్రశంసనీయం. ఆ ప్రయత్నఫలమే ఈ విమర్శ గ్రంథం. శ్రీమతి కుసుమాంబ తండ్రి సుప్రసిద్ధ తెలుగు పండితులు శ్రీ బూదూరు నరసింహులు రెడ్డిగారు. పెత్తండ్రి కీర్తిశేషులు శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారు. ఈయన చిత్తూరు జిల్లాలో ఉన్నత పాఠశాలల్లో తెలుగు పండిత పదవిని సర్వజనామోదంగా నిర్వహించి శిష్యకోటిని సృష్టించుకొన్న ధన్యజీవి – తండ్రి, పెత్తండ్రిగార్ల ప్రతిభా పాండిత్యాలను కొంత సంక్రమింపజేసుకొని ఉపాధ్యాయినిగా వృత్తిధర్మాన్ని నిర్వహిస్తూ

ఉత్సాహంతో ఈ విమర్శ గ్రంథాన్ని రచించి, ప్రచురిస్తున్నందుకు శ్రీమతి కుసుమాంబ ప్రశంసనీయురాలు.

రామాభ్యుదయంలోని వివిధాంశాలను - ఇతివృత్త పోషణ, అమూలకాంశాల ప్రసక్తి, వర్ణనావైచిత్రి, రచనాశైలి మొదలైన అంశాలను రచయిత్రి శ్రీమతి కుసుమాంబ సోదాహరణంగా ఇందులో ఉల్లేఖించడం మెచ్చదగింది. ముఖ్యంగా వాల్మీకిరామాయణానికి పోల్చి చెప్పిన కొన్ని విశేషాలు పండితాదరణీయాలు. ప్రాచీన కావ్య విమర్శకు తగిన సాహిత్య సంస్కారం, విమర్శనాదృష్టి, రచనోత్సాహం ఈ రచయిత్రికున్నవి. ముందు ముందుకూడా ఇట్టి విమర్శనాత్మక రచనలు శ్రీమతి కుసుమాంబ కలం నుండి వెలువడగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,
జి. యన్. రెడ్డి.

తిరుపతి,
5-8-81.

**Dr. J. CHENNA REDDY, M.A., Ph.D.,**
*Retired Professor, (S. V. U.),*

533, Balaji Colony,
Tirupati-517 502.

ఈ గ్రంథమును వ్రాతప్రతిగానున్నప్పుడే శ్రీమతి బి. కుసుమాంబ నాచేతనిడి 'దీనిని చదివి మీ యభిప్రాయమును క్లుప్తముగా వ్రాసి యీయగోరెదను' అని ప్రార్థించెను. గ్రంథము సాంతముగా చదివితిని. ఇది ఒక రామాభ్యుదయ పర్యాలోకనము మాత్రమే కాదనిపించినది. ఇది వాల్మీకిరామాయణము మొదటి షట్కాండముల సమగ్ర పరిశీలనము కూడ అని నాకు తోచినది. వాల్మీకమున కథ పురాణేతిహాసముల పద్ధతిలో నడచినను రచన మాత్రము కావ్యముగనే సాగినది. అందుననే దానికి ఆది కావ్యమని పేరు వచ్చినది. అందు రామకథకే ప్రాధాన్యము. తక్కిన గాథలు కేవల మానుషంగికములై ప్రధాన కథకు పోషకములుగా మాత్రమే మలచబడినవి. వనపర్వము, శాంత్యానుశాసనిక పర్వములను వదలిన మహాభారతకథయు కౌరవ పాండవ కుటుంబముల కథయే. కాని వనపర్వ శాంత్యాను శాసనిక పర్వములందలి గాథలు ప్రధానకథకు పోషకములుకావు. ప్రత్యేక గ్రంథములుగా నుండదగిన, నీతిశాస్త్ర విషయములు, ధర్మశాస్త్ర రహస్యములు వేదాంతశాస్త్రసారము మహాభారత గాథలో చోటుచేసికొని ఉద్దేశపూర్వకముగా ప్రధాన కథకొఱకు కాక, సమకాలము వారి యభిరుచులను, అవసరములను పురస్కరించుకొని వారి సంస్కరణార్థము వ్రాసిన వానివలె భాసించినవి.

రామభద్రయ్య రామాయణకథను గైకొని కేవల మొక ప్రబంధము వ్రాయవలెనను సంకల్పముతో ప్రారంభించినట్లున్నది.

ఒక్క బాలకాండ కథమాత్రమే గ్రంథములో అర్ధభాగ మాక్రమించుకొనినది. అయోధ్యా, అరణ్య, కిష్కింధా, సుందర కాండముల కథ మిక్కిలి సంక్షేపింపబడినది. వీర రసపోషణమునకై యుద్ధకాండమున కవి ప్రయత్నించినట్లున్నది. ఈ గ్రంథము శ్రీకృష్ణదేవరాయల సమకాలముననే రచింపబడినను సంపూర్ణ ప్రబంధలక్షణములు కొంటవడినట్లు కాన్పించును. ప్రధాన రసమేదియో స్పష్టముగా లేదు రచయిత్రి ఆ విషయమును గ్రంథమున సమగ్రముగా చర్చించియే యున్నది.

రామభద్రయ్య రామాభ్యుదయమును గూర్చి ఇతఃపూర్వము సమగ్ర పరిశీలనము జరుగలేదు. గ్రంథవిషయము ప్రసిద్ధముకాదని కాదు, కవి సమర్థుడు కాడని కాదు. కాళిదాసు చెప్పినట్లు "భిన్న రుచిర్హి లోకః" అని సరిపెట్టుకోవలసినదే. ఈ రచయిత్రి ప్రాయశః రామభద్రయ్య అభిమాన సంఘములోనిదిగ కావచ్చును. రచనను, పాత్రపోషణమును ఎంతగా భూషించినను వాల్మీకములోని గొప్ప గుణములెన్నియో ఈ గ్రంథములోనికి రాలేదని బాహాటముగా చాటొనుట రచయిత్రి నిష్పక్షపాత వైఖరికి ప్రథమోదాహరణము. ఇది ఈనాటి Ph. D. పరిశోధక వ్యాసము పరిధిలో నడచినది కాని అంతకు తక్కువది కాదు.

ఇట్లు,

తిరుపతి
31-7-81

సుధీవిధేయ
జీరెడ్డి. చెన్నారెడ్డి.

**Prof. P. V. ARUNACHALAM, M.A., Ph.D., Dip. in German**
***Head, Department of Mathematics,***
**S. V. University College, Tirupati (A.P.).**

"రామాభ్యుదయ పర్యాలోకన" చక్కగా సాగినది. చిరంజీవి శ్రీమతి బూదూరు కుసుమాంబ పండితవంశమునబుట్టిన రైతుబిడ్డ. తండ్రి, పెదతండ్రి, తాతలు అందరూ పండితులు. వంగరపు పన్నెను నిలబెట్టినందులకు శ్రీమతి కుసుమాంబకు ధన్యవాదములు.

రచన ఆసక్తికరముగా సాగినది. కమ్మని ఘట్టాలనెన్నిటినో వాల్మీకమునుండి వదలివేయడమునల్ల అయ్యలరాజు ఎంతో నష్టపడినాడనుట నిర్వివాదము. కవిగోత్రాదులను నిర్ణయించడములో, రెట్టమత శాస్త్ర రచనా కాలనిర్ణయములో, విజయనగర సామ్రాజ్య చరిత్రలోని కావలసిన అంశములపై పరిశీలన, కవికాలచర్చ. ఇవన్నీ శాస్త్రీయముగా, తార్కికముగా సాగినవి. సాహిత్య చరిత్రలో నెలకొన్న కొన్ని కట్టుకథలను, ఊహా ప్రవేశికలను కాళశక్కి అని బహు తేలికగా, ఎవరినీ నొప్పించక చెప్పే మేల్మి గుణము శ్రీమతి కుసుమాంబ రచనలో కొట్టవచ్చినట్లు కనబడుచున్నది.

వాల్మీకి రామాయణమును, రామాభ్యుదయమును యుద్ధకాండమువరకు సర్గానుక్రమముగా పోల్చి చూపించిన రచన యిది. ఈమెను ఇతోధికముగా రచనలు చేయువలెనని ఆశిస్తూ, అభినందిస్తున్నాను.

తిరుపతి,
ఆగస్టు 6, 81.

విశ్వనాథ అరుణాచలం.

# ఆమోదము

నేటి యువతరమువారికి మిగిలిన విషయములయందును వలె ఆంధ్రభాషా వాఙ్మయములయెడలను పరిశీలనాసక్తి అధికముగా ఉన్నది. పెక్కుమంది వేర్వేరు గ్రంథములను తీసికొని పరిశోధన నొనరించి, సిద్ధాంతవ్యాసములను వ్రాసి డాక్టర్ పట్టములను పొందుటయు కలదు. అట్టి ప్రక్రియకు చెందినదే ఈ "రామాభ్యుదయ" పర్యాలోకనము.

రాయలవారి ఆస్థానమునందలి అష్టదిగ్గజములలో ఒకడుగా ప్రసిద్ధిగాంచిన అయ్యలరాజు-రామభద్రకవి రామాభ్యుదయ ప్రబంధ కర్త. రామాయణకథను ప్రబంధముగా రచించి మన కందించిన వారిలో ఈతడు అగ్రగణ్యుడు. ఏ యిద్దరు ముగ్గురికోతప్ప రామాభ్యుదయ పరిశీలనపై దృష్టి ప్రసరించినట్లు కానరాదు. అట్టి వారిలో శ్రీమతి బూదూరు కుసుమాంబగారు ఎన్నదగినవారు. బూదూరు వారి కుటుంబము పాండిత్య కవిత్వములకు పేరు పడినది. ఈ గ్రంథమునుబట్టి ఈ మహిళామణి పాండితీప్రకర్ష, సునిశిత పరిశీలనము వ్యక్తములగుచున్నవి. ముఖపత్రములో చెప్పబడినట్లిది సమగ్ర పర్యాలోకనమే.

కొన్ని పరిశీలన గ్రంథములలో రచనా పద్ధతిలో నవ్యత కానవచ్చును. పరిశోధనలో సమగ్రత కానరాదు. శ్రీమతి కుసుమాంబ గ్రంథమున రచనా పద్ధతిలో నవ్యత, వాక్యములలో స్పష్టత, పరిశీలనమున సమగ్రత కానవచ్చుచున్నవి. ఇందలి పందొమ్మిది శీర్షికలలో తొలినాల్గును రామభద్రయ్య వ్యక్తిత్వమునకును, రచనలకును సంబంధించినవి. తర్వాతిది రచనా ప్రణాళికకు చెందినది. తదుపరి కాండక్రమమున తులనాత్మక పరిశీలన,

భాస్కరరామాయణముతోడి పోలికలు, అష్టాదశవర్ణనలు, విశే షార్థ చమత్కారములు సంస్కృత సమాసములు, అచ్చ తెలుగు పద్యములు, లోకోక్తులు, దుష్కరప్రాసము చూపబడినవి. చివర, ఈ పరిశీలనలో ఉపయోగపడిన సంస్కృతాంధ్ర కావ్యనాటకాలంకార గ్రంథములు తెలుపబడినవి. ఈ పట్టికను బట్టియే యీమె ఎంత శ్రమపడి వివిధ విషయములను గ్రహించి యీ రచన సాగించినదియు స్పష్టమగుచున్నది.

విశేష మేమనగా శ్రీమతి కుసుమాంబగారు వ్యాకరణము జోలికి పోలేదు. పదప్రయోగచర్చ సాగించ లేదు. నిత్యము మార్పు చెందుచు, జనుల వ్యవహారమున ఉన్న భాషలో ఏ పదములు దుష్టములో, ఏ విశిష్టములో, వేనికి ప్రామాణ్యమున్నదో, వేనికి ఉండదో నిర్ణయించుట సాధ్యము కానిపని. ప్రయోజనము మృగ్యము. ఈ యభిప్రాయముతోనే ఈమె ఆ విషయమును విడిచిపెట్టినది. ఇది సముచితమనియే సహృదయులకు తోచకపోదు.

ఇది సమగ్రమగు పరిశీలన గ్రంథము. ఏ ప్రబంధమును పరిశీలింపదలచినను, ఈ గ్రంథములోని పద్ధతి ననుసరించినచో, పరిశీలకుల పరిశ్రమ సార్థకము కాగలదు.

34, పురుషోత్తమనగరు,
క్రోంపేట, మద్రాసు-44.

బులుసు వేంకటరమణయ్య.

# కృతజ్ఞతలు

ప్రబంధయుగమునకు చెందిన గ్రంథములలో నా అభిమానమునకు పాత్రమైనది రామాభ్యుదయ కావ్యము. దానిని వాల్మీకి రామాయణముతో పోల్చి పరిశీలింపవలెననెడి నా చిరకాల వాంఛితము పూజ్యులు డాక్టర్. జీ రెడ్డి చెన్నారెడ్డి, డి. నాగసిద్ధారెడ్డి గార్ల ఆదరాభిమానముల వలన ఇన్నాళ్ళకు నెరవేరినది. నా శ్రేయోభిలాషులగు వీరు అడుగడుగున నొసగిన ప్రోత్సాహము ప్రాతఃస్మరణీయము.

నాపైగల అవ్యాజ వాత్సల్యముచే గ్రంథము నా మూలాగ్రముగ చదివి బహుకార్య నిమగ్నులయ్యును లెక్కగొనక తమ అమూల్యాభిప్రాయముల నొసగిన సహృదయ పండితశ్రేష్ఠులు శ్రీ బులుసు వేంకటరమణయ్య, డాక్టర్ జి. యన్. రెడ్డి, డాక్టర్ జీరెడ్డి చెన్నారెడ్డి, డాక్టర్ విశ్వనాథ అరుణాచలంగార్ల సౌజన్యము సదా వందనీయము.

హిందూ ధర్మోద్ధరణమే తన జీవితధ్యేయముగ భావించి అందుకై అవిరళకృషిసల్పు తి. తి. దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ P. V. R. K. ప్రసాద్ I. A. S. గారు ఈ గ్రంథ ముద్రణమునకు ఆర్థిక సహాయము చేయకున్నచో ఇది వెలుగు చూచుట అసంభవము. వీరి విశాలహృదయము పూజనీయము. తి. తి. దేవస్థానముల పౌర సంబంధాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, సప్తగిరి పత్రికా సంపాదకులు శ్రీ కాట్రగడ్డ సుబ్బారావుగార్లు గ్రంథ ముద్రణమునకు కావించిన దోహదము ప్రశంసార్హము.

కుటుంబ వ్యవహారములను ప్రక్కకునెట్టి రచనా వ్యాసంగ

మున మునిగిన నాకు సమధికోత్సాహము నిచ్చిన నా భర్త శ్రీ N. కృష్ణారెడ్డిగారి అనురాగము నమస్కారార్హము.

గ్రంథాలయమునందలి గ్రంథములను అవసరమైన వాటిని అడిగినప్పుడంతయు విసుగు గొనక యిప్పించిన S. P. బాలికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని శ్రీమతి ప్రఫుల్లాబాయి, ఇచ్చిన గ్రంథాలయాధికారిణి శ్రీమతి A. యువరాజేశ్వరిగార్ల ప్రోత్సాహము స్తుత్యర్హము.

ఈ గ్రంథ ముద్రణమునకు అవసరమైనంత కాగితమునిచ్చి అనేక రీతుల సాహాయ్యపడిన మహాలక్ష్మీ అండ్ కో, యజమాని శ్రీ R. భక్తవత్సలంరెడ్డి, గ్రంథమును సర్వాంగ సుందరముగ ముద్రించి యిచ్చిన 'వెల్డన్ ప్రెస్' యజమానులు శ్రీ గుత్తి భావ నారాయణ, శ్రీ మీరాప్రభు గార్ల సౌహార్ద్రము ప్రశంసనీయము.

ఇట్లన్ని రీతుల నాకు చేయూతనిచ్చిన ఈ పూజ్యపాదు లందరకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలుల నర్పించుచున్నాను.

తిరుపతి,
8-8-81.

ఇట్లు,
బుధజన విధేయురాలు,
**బూదూరు కుసుమాంబ.**

# పరిచయము

అయ్యలరాజు రామభద్రయ్య రచించిన రామాభ్యుదయము ప్రబంధ శైలిలో రచింపబడిన రామాయణమే కాని అన్యము కాదు. పురాణ క్రమ కలుగకుండుటకై బాలకాండము నందలి యుపాఖ్యానముల నన్నింటిని అతడు వదలివేసినాడు. వాల్మీకి రామాయణములో అయోధ్య కాండమున సూచింపబడిన దశరథుని వేట - తత్కారణముగా నతనికి శాపప్రాప్తి రామాభ్యుదయమునందు గ్రంథాదినే ప్రవేశపెట్టుటయే కాక మిక్కిలిగా పెంచబడినవి. అలంకార శాస్త్రములో జెప్పబడిన మృగయా వ్యాపారము కూడ నిట కలసివచ్చి యుండవచ్చును. అంతకుముందే శృంగార రస పోషణమునకై దశరథుడు భార్యలతో వనవిహార, జలక్రీడ లొనర్చినట్లు కూడ కల్పించి యున్నాడు. కాని శాస్త్రదృష్టితో జూచిన నది సక్రమ మార్గము కాదు. ఆ శృంగారముతో కథానాయకుడైన శ్రీరామునకు సంబంధము లేదు. పైగా అది శ్రీరామ జననమునకు కారణభూతమైన పూర్వ రంగము కాదు. అట్టి శృంగార రస కల్పనము తరువాత, కొన్ని వేల ఏండ్లకు అందునను పుత్రకామేష్టి ఫలితముగా శ్రీరామాదులు జన్మించిరి. చదివి యానందించుటకు బాగున్నను కథ కది పోషకము కాదు. శాస్త్రీయము కాదు. వాల్మీకమున చిమ్మచీకటిలో శబ్దభేది బాణముచే దశరథుడు ముని బాలకుని జంపినట్లుండ, నిచ్చట పట్టపగలు - ధావన్మృగ సంహార సమయమున ముని బాలకుని జంపినట్లు కల్పించుట అంత సహజముగా లేదు. అసంభావ్యమేమో కూడ.

కాకాసుర వృత్తాంతము, యుద్ధ మధ్యమున నారదాగమనము కూడ అనవసరములే. మొదటిది ఉత్తర కథకు ఎట్టును పోషకము కాలేదు. అవాల్మీకమైన రెండవది కల్పింప వలసినంత ప్రయోజనము సాధింపలేదు. ఈ విషయములు గ్రంథభాగముననే చర్చించుట జరిగినది.

వాల్మీకి రామాయణమున పాత్రముల శీలపోషణమునకై కవి కల్పించిన సన్నివేశములు మిక్కిలి సహజములు. వానిలో నొక్కటియు రామాభ్యుదయమున లేదు. ఉదాహరణమునకు కొన్నింటిని ఈ క్రింద పేర్కొందును.

1. సీతాదేవి శ్రీరామునితో నరణ్యమునకు పోవుటకై భర్త సమ్మతి సంపాదింప జేసిన ప్రయత్నము.

2. భరతుడు చిత్రకూటమునకు వచ్చినప్పుడు భరతుని శీలమును శంకించి కోపావిష్టుడైన లక్ష్మణునితో శ్రీరాముడు "నీకు రాజ్య మిమ్మని భరతునితో నే నొక్క మాట యన్నంత మాత్రమున అతడట్లు చేయును" అనుట.

3. ఖరునితోడి యుద్ధమున శ్రీరాముడు కొంచెము వెనుకకు జరుగుటకు పేర్కొనిన కారణములు.

4. సీతాదేవి యాభరణముల నన్నింటిని లక్ష్మణుడు గుర్తింప లేనందుకు, నూపురములు మాత్రమే గుర్తించుటకు అతడు చెప్పిన కారణములు.

5. తన మనస్సులో నెంత కోపమున్నను సుగ్రీవు నొద్దకు (కిష్కింధా నగరమునకు) వెడలు లక్ష్మణునకు తొందర పడరాదని శ్రీరాముడు హితము బోధించుట.

6. హనుమంతుడు సీతాదేవినుండి చూడామణిని గ్రహించిన పిదప, వెంటనే సముద్రమును దాటక అశోకవన భంజనమునకు ముందు ఏకాంతమున ఆలోచించిన అమూల్య విషయములు.

7. కడపట శ్రీరాముడు పుష్పకముపై వెళ్ళి భరద్వాజాశ్రమమున విడిసినప్పుడు శ్రీరాముడు హనుమంతుని భరతు నొద్దకు పంపుచు – పదునాల్గేండ్ల తరువాత భరతునకు రాజ్య కాంక్ష కలిగెనేమో – అతని యింగితముల వలన తెలిసికొనుమనియు, అట్లయిన తాను మరల అరణ్యములకే పోవుదుననియు చెప్పుట, మున్నగునవి. అట్టి అమూల్య సన్నివేశములను రామభద్రయ్య వదలుకొనుట చింత్యము.

రామభద్రయ్య భాషా వ్యాకరణము ను గూర్చి, ప్రయోగములను గూర్చి నేను చర్చింప దలచుకోలేదు. భాష నిత్యము ప్రవహించు నది వంటిది, మార్పు సహజము. కొందరకు సమ్మతములగు ప్రయోగములు సమకాలముననే మరికొందరకు సమ్మతములు కాకపోవచ్చును. ఒకప్పుడు గ్రాహ్యములు కానివి కాలాంతరమున ఉపాదేయములు కావచ్చును. ఇప్పుడు గ్రాంథిక భాషా ప్రయోగములపై మోజు తగ్గి విశ్వవిద్యాలయములలోకూడ

వ్యావహారిక భాషకే ప్రోత్సాహము లభించు కాలము వచ్చినది. గొప్ప పండితులు వ్యాకరణవేత్తలు కూడ వ్యవహార భాషయందే వ్రాయుచున్నారు. గ్రాంథిక భాషలో నొక నాటకమును నేడు ప్రయోగించినచో సామాజికులందరును లేచి పారిపోవువరకు వచ్చినది. కావున భాషా ప్రయోగముల సాధుత్వా సాధుత్వ చర్చ నేడు అప్రస్తుతమని నేను విరమించితిని.

"రామభద్రుడు" అనియే వ్యవహరింపబడు రామభద్రయ్య బహుశాస్త్రవేది యనుటకు గ్రంథముననే పెక్కు నిదర్శనములను చూపవచ్చును. తాను స్వయముగా ధ్వని ప్రధానవాది యని చెప్పుకొన్నను రామాభ్యుదయమున ధ్వనికంటె అలంకారమునకు, శబ్ద చిత్రమునకే ప్రాధాన్య మిచ్చినట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఈయన శబ్ద చిత్రమున పాండిత్యమునకంటె చమత్కారమే ఎక్కువగా కాన్పించును.

నే నీ పరిశీలనమున వాల్మీకి రామాయణమును యుద్ధకాండాంతము వరకు సర్గానుక్రమముగా రామాభ్యుదయముతో పోల్చియున్నాను. వాల్మీకమున ఏ సర్గమున ఏ విషయము చెప్పబడినదో పఠితలకు స్పష్టముగ తెలియుటకు నా పరిశ్రమ సహాయపడునని నా విశ్వాసము.

తిరుపతి
29-8-80

ఇట్లు,
బుధజన విధేయురాలు,
బూదూరు కుసుమాంబ.

# విషయసూచిక

పుట

1

# రామభద్రయ్య అభిజనము



రామాభ్యుదయ కావ్యమును రచించిన కవి అయ్యలరాజు రామభద్రయ్య. ఇతడు ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. ఒంటిమిట్ట రఘువీర శతక కర్తయగు తిప్పయ మనీషికి మునిమనుమడు. (ప్రపౌత్రుడు). పర్వతన్నకు మనుమడు (పౌత్రుడు). అక్కయామాత్యునకు పుత్రుడు. ఈ విషయము లన్నియు రామాభ్యుదయ ప్రబంధము ఆశ్వాసాంత గద్యములందు కానగును. అతని విద్యాగురువు పరవస్తు వంశమణి ముమ్మడి వరదాచార్యులని

> "పరవస్తు వంశరత్నా
> కర కౌస్తుభమణి ప్రభావఖనియయి నాకుం
> బరమ గురువయిన ముమ్మడి
> వరదాచార్యాంఘ్రి పనజ వందారుడనై"

—పీఠిక -11 వ పద్యము

అను పద్యము వలన తెలియుచున్నది. గురువును "పరిశీలిత రామానుజ మత సిద్ధాంతమర్ము" డని కీర్తించియున్నాడు. అయ్యలరాజు అనునది వంశనామము. కాని అదియే గృహ నామముగా కూడ పెక్కుచోట్ల వ్యవహరింపబడినది. రెట్ట మత కర్తలు అయ్యల భాస్కర కవులును, హంసవింశతి కర్త అయ్యల

రాజు నారాయణామాత్యుడును రామభద్రయ్యను తన అయ్యల రాజు వంశము వానిగనే కీర్తించియున్నారు, చూడుడు—

"రాయకవియైన యయ్యలరాజవంశ్యు
ననఘు పిన్నక్కవిభు పుత్రునయ్యలాఖ్యు
నాగఘనుసూను భాస్కర నామధేయు
గరుణ దళుకొత్త రావించి గారవించి"

—రెట్టమతము

"అయ్యలరాజు తిప్పసచి
వాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ, బ్ర
ధానవరుండగు కొండధీరునిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని
సత్కవితా రచనాఢ్యులైన మా
యయ్యలరాజ వంశజుల
నాది కవీంద్రుల సన్నుతించెదన్"

—హంసవింశతి

రెట్టమతమునందలి 'రాయకవి' శబ్దము అయ్యల రాజు వంశీయుల బిరుదనామము కానోపు. రామభద్రయ్య ప్రపితామహుడైన తిప్పయ మనీషి తన యొంటిమిట్ట రఘువీర శతకము నందలి

"అతుల ప్రౌఢిమ మీఱు రాయకవి య
య్యల్రాజు సత్పుత్రుఁ డం
చిత భక్తిం ద్రిపురాంతకుండు రచియిం
చెం దెల్గు పద్యంబులన్

శతకం బొక్కటి దీని నీకు వినుమా
చంద్రార్కమై నిల్చుఁ బ
ర్వత కన్యానుత! యొంటిమిట్ట రఘువీ
రా! జానకీ నాయకా!"

అను పద్యమున తన తండ్రిని 'రాయకవి యయ్యలరాజు' అనియే పేర్కొనినాడు.

రామభద్రయ్య గ్రంథమున నెచ్చటను తన గోత్రనామమును చెప్పియుండలేదు. రెట్టమత కర్తలలో నొక్కడగు అయ్యలాఖ్యుడు తన్ను

"రాయకవి యైన యయ్యల రాజవంశ్యు
ననఘు పిన్నక్క విభుపుత్రు నయ్యలాఖ్యు"

అని స్పష్టముగా చెప్పుకొన్నాడు. రెట్టమత గ్రంథ కృతి భర్త వేంకటక్ష్మాపతి ఈ యయ్యలాఖ్యుని, జంట కవులలో మఱి యొకడైన భాస్కర కవిని కలిపి యిరువురను "రఘువీరశతక నిర్మాణ కర్మఠ రాయకవి తిప్ప నార్యపాలకులును" అని వర్ణించి యున్నాడు. హంసవింశతి కర్తయగు అయ్యలరాజు నారాయణామాత్యుడు పైజంట కవులలోని అయ్యలాఖ్యుని పేర్కొనక పోయినను భాస్కరకవిని మాత్రము (భాస్కరాగ్రణి యని) రామభద్రయ్యతోపాటు అయ్యలరాజు వంశజులలో చేర్చి పై పద్యమున కీర్తించి యున్నాడు. దీనినిబట్టి మన రామభద్రయ్య, అయ్యలాఖ్యుడు, భాస్కరాగ్రణి, నారాయణామాత్యుడు - వీరందరును అయ్యలరాజు సత్పుత్రుడైన తిప్పయ మనీషి వంశమువారే యనుట స్పష్టము. నారాయణామాత్యుడు తన హంసవింశతి ఆశ్వాసాంత గద్యమున

"ఇది శ్రీమత్కౌండిన్య సగోత్ర పవిత్రాయ్యల రాజాన్వయ సుధావార్థి పూర్ణిమాచంద్ర నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణా మాత్యప్రణీతంబైన హంసవింశతి యను మహా ప్రబంధంబునందు............ఆశ్వాసము"

అని తాను కౌండిన్య సగోత్రుడైనట్లు చెప్పుటచే పైవారందరితోపాటు మన రామభద్రయ్యకూడ కౌండిన్యస గోత్రుడే నిర్ణయింప వచ్చును.

తిప్పయ (త్రిపురాంతకుడు) మనీషి తన తండ్రికి 'రాయకవి' యను బిరుదమున్నట్లు చెప్పుట, రెట్టమత కర్తలు 'రాయకవిమైన యయ్యల రాజువంశ్యు'ల మని తమ్ముగూర్చి చెప్పుకొనుట, ఈ రాయకవి యను పదము బిరుదముగాక యింటిపేరేమో అను భ్రమను కలిగింపకపోదు. శ్రీ చాగంటి శేషయ్య తిప్పయ మనీషి చరిత్రమున 'రాయకవి' అనునది మొదటినుండియు ఆ వంశీయులకు ఇంటిపేరే యనియు, అయ్యలరాజు (తిప్పయ మనీషి తండ్రి కాబోలు) ఆ వంశీయులలో ప్రముఖుడైనందున అతని పేరనే ఆ వంశము తరువాత వ్యవహరింపబడెననియు వ్రాసియున్నారు. కాని ఆ తరువాతకూడ రాయకవి పదము వారిని వదలలేదు. మన రామభద్రయ్య తన ప్రపితామహుడైన తిప్పయ మనీషి తండ్రిని "రాయకవి అయ్యలరాజు" అని పేర్కొనియున్నాడు. అది సరిగనే యున్నది. రెట్టమత గ్రంథము నంకితముగాగొన్న యజ్జమ పాళెమునకు ప్రభువైన వేంకటపత్మాపతి గ్రంథకర్తలైన అయ్యలకవి భాస్కరకవులను సంబోధించుచు "... మీరలు ... రఘువీర శతక నిర్మాణ కర్మఠ రాయకవి తిప్పనార్య పాలకులును మదీయాశ్రితులు నగుటంజేసి ..." యని తిప్పయ మనీషికికూడ రాయ

కవి బిరుద మున్నట్లే చెప్పియున్నాడు. ఈ యయ్యలకవి తన్ను 'పిన్నక్క విభుపుత్రు' అని చెప్పుకొనుటచే రామభద్రయ్య తండ్రి యైన అక్కయామాత్యునకీ పిన్నక్క విభుడు అనుజుడేమో యని తలంపవలసి వచ్చును.

అట్లూహించుటకు కారణము అయ్యలరాజ భాస్కర కవుల చరిత్రమున శ్రీ చాగంటి శేషయ్య ఆ కవుల కాలమును క్రీ. శ. 1600 ప్రాంతముగను, దానికి బలముగ కృతిభర్తయగు వేంకటరాజు క్రీ. శ. 1584 వ సం॥న సజీవుడై యున్నట్లు గను దిగువ అహోబలములోని యొక శాసనము ఆధారమున నిర్ణయించి యున్నాడు. దీనినిబట్టి రామాభ్యుదయ రచనానంత రము దాదాపు ముప్పది సంవత్సరములకు దగ్గరలో రెట్ట మత శాస్త్రము రచింపబడి యుండవలెను. కాని అయ్యన తన్ను అయ్యలరాజు వంశజుడుగా చెప్పుకొన్నాడే కాని, రామభద్రయ్య పేరుకాని, ఆయనకు తనకు గల సంబంధ బాంధవ్య విశేషములు గాని చెప్పలేదు. అప్పటి కింకను రామాభ్యుదయమునకు రావలసి నంత ప్రచారముగాని, కీర్తిగాని లభించియుండదని సరిపెట్టుకొన వలయును.

కాని చాగంటివారు చేసిన కాలనిర్ణయము సరియైనదని తోచదు. రెట్టమత శాస్త్ర గ్రంథాంతమున ఈ క్రింది పద్య మున్నది.

"కలియుగ ప్రథమ భాగము నాల్గువేల యె
 న్మిది నూర్లపైని డెబ్బదియు నొకటి
శాలివాహన శకాబ్దంబులు వేయునా
 ర్నూట తొంబదిరెండు రూఢిగాగ

ప్రభవాది గతములు బరగు నిర్వది మూడు
నేండ్లయ్యె నెంతయు నెన్నబుధులు
అట్టి కాలంబున నయ్యన భాస్కర
కవివర్యు లలరాజు కమలహితుని
యాజ్ఞ పూర్వోక్త రెట్టమతంబు కావ్య
ముగ నొనర్చి యాచంద్రముగను గీర్తి
వక్తృ శ్రోతలకును గల్గ వసుధ మీద
నలయహోబల నృహరికి నర్పణముగ''

శాలివాహన శకము 1692 క్రీ. శ. 1769 - 70 కి సమా నము. అది సరిగా ప్రభవాది 23 వ గతాబ్దమునకు అనగా విరో ధికి సరిపోవును. కావున రెట్టమత శాస్త్ర రచనాకాలము క్రీ. శ. 1770 ప్రాంతమగును. స్పష్టముగా అది రచనా కాలమని పద్యము నందే కలదు. శ్రీ శేషయ్యగారు ఆ కాలము లేఖకుని కాలమే కాని కవులకాలము కాదని వ్రాయుచున్నారు. దిగువ అహోబల ములో క్రీ. శ. 1584 లో శాసనము వేయించిన వేంకటరాజు రెట్టమత శాస్త్రమును కృతిగొన్న వేంకటరాజగునో, మఱి యొకరో తేల్చవలసి యున్నది. మఱియొక డగుచో ఆ పద్యము లోని కాలమే అనగా క్రీ. శ. 1770 యే గ్రంథ రచనాకాల మగును.

ఐనను ఇట్లు పరంపరగా వచ్చుచున్న రాయకవి బిరుద మును మన రామభద్రయ్య తన పితామహుడైన పర్వతయ్యకు గాని, తండ్రియైన అక్కయామాత్యునకు గాని, కడకు తనకుగాని చేర్చి చెప్పుకొనలేదు. కావున అప్పటికి వారి గృహనామము అయ్యలరాజు వారనియే స్థిరపడియుండనోపును.

శ్రీయుతులు కాకర్ల వేంకటరామ నరసింహముగారు తన రామాభ్యుదయము ఉపోద్ఘాతములో రామభద్రకవి గృహనామము పుత్తేటివారని కొందరు వ్యవహరించినట్లు తెలిపి, దానినిగూర్చి కొంతవరకు చర్చించిరి. గణపవరపు వేంకటకవి యొక్కడే తన లక్షణ గ్రంథమున రామభద్రయ్యను పుత్తేటి రామభద్రయ్య యనియు, తిప్పయ మనీషిని పుత్తేటి అయ్యలరాజుతిప్పరాజు అనియు పేర్కొని యున్నాడు. ఇంక వేరొకచో ప్రయోగింపబడని ఈ పుత్తేటి గృహనామమును పూర్తిగా కొట్టివేయుట న్యాయము కాకపోయినను దానికి మరెచ్చటను ప్రయోగము లేనందున అది తనంతటనే మాసిపోయి, 'అయ్యలరాజు' అను పేరే నిలచిన దని నిశ్చయింపవచ్చును. రాయకవి శబ్దము కేవలము బిరుదనామముగా తిప్పయ మనీషి వరకే వచ్చినది. రామభద్రయ్య తండ్రి తాతలైన అక్కయామాత్య, పర్వతయ్యలు కవులు కానందున వారికా బిరుదము రాలేదు. నడుమ రెండుతరముల వారికి లేని బిరుదము తన కెందుకని కాబోలు మన రామభద్రయ్య కూడ రామాభ్యుదయ కావ్యమున నెచ్చటను తన పేరునకు ముందు ఆ బిరుదము చేర్చుకొనలేదు.

# 2

## రామభద్రయ్య కాలము

అయ్యలరాజు రామభద్రయ్య కాలనిర్ణయము చేయుట కొంత కష్టమే. రామాభ్యుదయ కావ్యమును కృతినందిన గొబ్బూరి నరసరాజు వయస్సు కృతి ప్రదానకాలమున ఎంతయుండునో నిర్ణయించుట సులభము. కాని రామభద్రయ్య కానాటికి ఎన్నేండ్ల వయస్సుండునో నిర్ణయించుట సుకరము కాదు. మన రామభద్రయ్యయే "సకల కథాసార సంగ్రహము"ను రచించెననియు, అతడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున ఉండెననియు నిర్ణయించుట ఇదమిత్థముగా తేలినచో కృతిప్రదాన కాలము నాటికి రామభద్రయ్య వయస్సును ఊహింపవచ్చును. చారిత్రకాధారములను బట్టి కృతిప్రదానము క్రీ. శ. 1550 - 55 నడుమ జరిగినదని నిశ్చయింపవచ్చును. అప్పటికి కృతిభర్త గొబ్బూరి నరసరాజు ఆరుగురి కుమారులలో ఇద్దరు - పెదతిమ్మరాజు, పినతిమ్మరాజు - క్రమముగా కందనవోలు దుర్గమునకును, కొండవీటి దుర్గమునకును అధిపతులుగా నుండిరి. మూడవ వాడగు కృష్ణభూపతికూడ కొన్ని యుద్ధములలో పాల్గొన్నట్లు రామాభ్యుదయ పీఠిక మూలమున తెలియుచున్నది. కావున గొబ్బూరి నరసరాజు వయస్సు ఆ నాటికి దాదాపు 60 సం॥లుండునని ఊహింపవచ్చును.

ఈ విషయము ఈ క్రింది పద్యములో వర్ణింపబడినది.

"కోనేటితిమ్మ భూవిభుని కూతురు రంగమ బుణ్య గొబ్బురీ
శ్రీనరసింహుడా హరిసిరింబలె ప్రేమవరించి కాంచె స
త్సూనుల బెద్దతిమ్మ విభు శూరమణిం బినతిమ్మరాజు సం
ధానిధిఁ గృష్ణధీరు రఘునాథుని బాపనృపాలు రంగపన్"

—పీఠిక-93

నరసరాజు ఈ యారుగురిలో మొదటి యిద్దరు

"ఆ పెదతిమ్మ భూవరకులాగ్రణి కందనహోలి భర్త సం
తాపిత శాత్రవుండు తన తమ్ముడు ధర్మయుతుండు కొండవీ
టీపుర దుర్గరక్షణ పటిష్ఠ మతిం జినతిమ్మ శౌరి యా
జ్ఞా పరిపాలనా ప్రథిమసంధిల రాజ్యము చేయరంజిలున్"

— పీఠిక-96

అని వర్ణించి తృప్తిచెందక పినతిమ్మ నృపాలుని పరాక్రమ విశేషములను మరి రెండు పద్యములలో కీర్తించెను. అట్లే మూడవ కుమారుడైన కృష్ణవిభుని ప్రతాప విశేషములను గూడ రెండు పద్యములలో పొగడియున్నాడు. ఈ వివరములను బట్టి కడపటి కుమారుడైన రంగన వయస్సు కృతిప్రదాన కాలము నాటికి పదునైదు సంవత్సరములైన నైయుండును.

ఆ నాటికి ఇంకను తళ్ళికోట యుద్ధప్రసక్తి రాలేదు. విజయనగర సామ్రాజ్య భానుడు అళియరామరాయల కృపాణధారలో దేదీప్యమానముగా వెలుగుచున్న దినములవి. ఆ విషయమే—

ఆ పటుకీర్తి రామ వసు
ధాధిప చంద్రుడు కృష్ణరాయ ధా
త్రీపతి సార్వభౌము దుహి
తృప్రియుడై వితత ప్రతాప సం
తాపిత శత్రుడై యల స
దాశివరాయ నిరంతరాయ వి

ద్యాపుర రాజ్యలక్ష్మికి ని
దానము దానయి మించె నెంతయున్"

—పీఠిక-55

అను పద్యమున వివరింపబడినది. అళియరామరాయలే సలకము తిమ్మయను జయించి సదాశివరాయలను క్రీ. శ. 1543 ప్రాంతములలో విజయనగర సింహాసనముపై కూర్చుండజేసెను. ఆ తరువాత క్రీ. శ. 1565 వరకు దాదాపు ఇరువది రెండు సంవత్సరములు రాజ్యపాలనమున ప్రధాన స్థానము రామరాయలదే కాని, సదాశివరాయలు నామమాత్రాధిపతియే. పై పద్యమున వివరించిన స్థితి రామాభ్యుదయ కృతి రచనా కాలము నాటిదైనా పై యిరువది రెండు సంవత్సరముల కాలములో అది పూర్వార్థభాగమునకు చెందునా? ఉత్తరార్థమునకు చెందునా? నిశ్చయింపవలయును కదా! ఈ విషయమును నిర్ధరించుటకు కూడ కొన్ని చారిత్రకాధారములు, గ్రంథస్థ సాక్ష్యములు సాయపడుచున్నవి.

శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయయాత్ర చేయు కాలమున క్రీ. శ. 1515 ప్రాంతములలో గోల్కొండ నవాబుతో జరిగిన సంఘర్షణలో ఒక్క దుర్గము మాత్రము రాయల వశమయ్యెను. అప్పటికా దుర్గాధ్యక్షుడు మన ఆరవీటి రామరాయలు. దానినిబట్టి ఆ సమయమును గోల్కొండ నవాబు కొలువున రామరాయలుండెనని నిశ్చయింపవలసియున్నది. అతడు బుద్ధిపూర్వకముగనే రాయలకు దుర్గము స్వాధీనము చేసెనో లేక నిజముగనే యోడెనో తెలియదు. దుర్గాధ్యక్ష పదవిలోనున్న రామరాజు వయస్సు ఎంత తక్కువ లెక్కవేసినను 25-30 సంవత్సరములకు దగ్గరగా నుండును కదా! కృష్ణరాయ లాతని బలపరాక్రమములకు మురిసిపోయి తన కుమార్తె తిరుమలాంబ

నిచ్చి వివాహము చేసెనట. తిరుమలాంబ రామరాజునకు మొదటి భార్యయే యని విశ్వసింపవలెను. "కృష్ణరాయ ధాత్రీపతి సార్వభౌమ దుహితృప్రియుడై..." అని వర్ణించిన పద్యమునకు వెనువెంటనే గల

"రామక్షోణి విభుండు కృష్ణమను జేంద్ర
గ్రామణిన్ భీమ సం
గ్రామేంద్రాత్మజుఁ బెద్ద తిమ్మవిభునిన్
రాచూర్గి తిమ్మాధిపున్
శ్రీమంతుం బినకొండ భూవరవరున్
శ్రీరంగ రాజన్య సు
త్రామంగాం చెఁ గుమారరత్నముల మం
దారోప మోదారులన్"

—పీఠిక-56

అను పద్యము ననుసరించి అళియరామరాయలకు (తిరుమలాంబ వలననియే తలంపవలయును) ఐదుగురు కుమారులు జన్మించిరనియు, వారిలో మూడవవాడగు చినతిమ్మరాజు క్రీ.శ. 1551 (రామాభ్యుదయ పీఠికలో ఆచార్య కే.వి.ఆర్. నరసింహముగారు క్రీ.శ. 1544 అని వ్రాసియున్నారు)లో రాయచూరు దగ్గర మహమ్మదీయులతో జరిగిన యుద్ధములో విశేష పరాక్రమము చూపి హిందువులకు జయము సంపాదించిపెట్టెననియు, ఆ కారణముగా చినతిమ్మరాజునకు రాచూరి దుర్గాధ్యక్ష పదవి లభించుటచే ఆ నాటి నుండి యతడు రాచూరి తిమ్మరాజని పిలువబడెననియు చరిత్రకారుల కథనము. రామభద్రయ్య ఈ తిమ్మ విభుని గూర్చి వ్రాసిన

"రాచూరి తిమ్మవిభునిక
రాచూరిం దెగి నిరంతరము సమరమ్మృగీ

లోచనల మదన శాస్త్రి
లోచనలం దవిలి వర్తిలు దురభియాతుల్''

పీఠిక - 61

అను పద్యమున ఆ యుద్ధానంతర్యమును సూచించుచు చినతిమ్మరాజును "రాచూరి తిమ్మవిభు" ననియే వ్యవహరించినాడు. దీనినిబట్టి రామాభ్యుదయము క్రీ. శ. 1551 కి తరువాతనే రచింపబడినదని నిశ్చయింప వచ్చును. అప్పటికి తళ్ళికోట యుద్ధము జరుగలేదు గావున రామరాయల తమ్ములైన తిరుమల రాయం వేంకటాద్రిరాయ లిరువురు సజీవులే యనుటనుగూర్చి సందేహింప నక్కరలేదు. కృతిపతియైన గొబ్బూరి నరసరాజు శా. శ. 1478 అనగా క్రీ. శ. 1556 నల సంవత్సరమున కడప మండల మందలి పుల్లంపేట తాలూకా తుండూరు గ్రామములో నున్న ఆంజనేయస్వామికి కొంత భూమి సమర్పించి శాసనము వ్రాయించినట్లు శ్రీ చాగంటి శేషయ్య వ్రాసియున్నారు. కావున ఈ గ్రంథము క్రీ. శ. 1551 కి 1556 కు నడుమ రచింపబడియుండవలెను. ఇప్పటికి గ్రంథ రచనా కాలము తెలిసినది. అళియ రామరాయలు, గొబ్బూరి నరసరాజు ఇరువురు అరువదియేండ్ల వయస్సుకు మించినవారే అనియు నిర్ణయించుట సోపపత్తికముగా సాధ్యమైనది. కాని మన గ్రంథకర్త రామభద్రయ్య వయస్సు రామాభ్యుదయ రచనాకాలము నాటికి ఎంతయుండునో నిర్ణయించుటకు గ్రంథస్థ సాక్ష్యము లెవ్వియు లేవు. శ్రీ కృష్ణదేవరాయల కాలము నాటికి అతడు పుట్టియే యుండలేదన్నను కాదనుటకు వీలులేదు. కావున మరొకవిధముగా, వేరు సాక్ష్యముల యాధారమున రామభద్రయ్య వయస్సు దాదాపుగా నిర్ణయింప వచ్చునేమో చూతము—

రామభద్రయ్య ప్రపితామహుడగు తిప్పయ మనీషి తన ఒంటిమిట్ట రఘువీర శతకమున ఈ క్రింది పద్యము వ్రాసియున్నాడు.

"ఆ కర్ణాటక మండలాధిపతిచే
నాస్థాన మధ్యంబులో
నా కావ్యంబులు మెచ్చఁ జేసితివి నా
నా రాజులుం జూడగా
నీకుం బద్యము లిచ్చుచో నిపుడు వా
ణీదేవి నా జిహ్వకున్
రాకుండెట్లు వసించుగాక రఘువీ
రా! జానకీ నాయకా!"

దీనినిబట్టి తిప్పయ మనీషి కర్ణాటక మండలాధిపతికడ ఆస్థాన కవిగా నున్నట్లు ధ్రువపడుచున్నది. కర్ణాటక రాజ్య మనగా ఆనాటి విజయనగర సామ్రాజ్యమే. దాని పాలకులే కర్ణాటాధిపతులు. శ్రీనాథుడు కూడ—

"కర్ణాట క్షితిపాల మౌక్తిక సభా
గారాంత సంకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరా
ట్సంస్తుత్య చారిత్ర ..."

అను పద్యభాగమున తన్ను సత్కరించిన ప్రౌఢదేవరాయ లనే "కర్ణాటక్షితిపాలుడు" అని కీర్తించి యున్నాడు. కర్ణాట క్షితి పాలురలో (ఇమ్మడి) ప్రౌఢదేవరాయలు, శ్రీ కృష్ణదేవరాయలు మాత్రమే కవి పండితపోషకులుగా ప్రసిద్ధికెక్కి యున్నారు. తిప్పయ మనీషిని శ్రీకృష్ణదేవరాయల కాలమువరకు లాగుకొని వచ్చుట సాధ్యముకాదు. ఎందుకనగ మునిమనుమడైన రామభద్ర

య్యయే కృష్ణరాయల ఆస్థానముతో సంబంధము కలవాడుగ విశ్వసింపబడుచున్నాడు. ఆ విషయము ముందు చర్చించి నిర్ధారింపబడును. కాగా తిప్పయ మనీషి శ్రీనాథునకు సమకాలికుడైన ప్రౌఢదేవరాయల యాస్థాన కవిగా నుండియుండును. రాయకవి బిరుదము తిప్పయకుకూడా నున్నట్లు ముందే తెలిసికొన్నాము. పై పద్యములో తిప్పయ మనీషి పెక్కు కావ్యములను వ్రాసి రాయలను మెప్పించినట్లున్నది. కాని "లభించిన ఒంటిమిట్ట రఘువీర శతకములో అంత పాండిత్యము కానరాదు" అని ఆచార్య కే. వి. ఆర్. నరసింహముగారు వ్రాసియున్నారు. ఉత్తమ కవిత గల అతని గ్రంథములు దురదృష్ట వశమున నశించి యుండవచ్చును. ఎఱ్ఱన కృత రామాయణము, శ్రీనాథుని మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పింగళి సూరన గరుడపురాణము ఉత్తమ గ్రంథములు కావనగలమా? అవి నశింపలేదా?

ఇమ్మడి ప్రౌఢరాయల రాజ్యకాలము క్రీ. శ. 1423 నుండి 1447 వరకు అని చారిత్రకులు నిర్ణయించిరి. అనగా క్రీ. శ. 1440 ప్రాంతములో తిప్పయ మనీషి సమకాలిక కవి పండితుల మన్ననకెక్కిన కవిత్వము వ్రాయగలిగి యుండెను. అప్పటి కతడు నలువది యేండ్లవా డనుకొన్నను కుమారుడు పర్వతయ్య బాలుడుగ నుండును. సంప్రదాయమునుబట్టి తరమునకు ముప్పది సంవత్సరములు లెక్కించినను క్రీ. శ. 1465 ప్రాంతములలో అక్కయామాత్యుడును 1490 - 1495 ప్రాంతములలో రామభద్రయ్యాయ పుట్టియుండుట మిక్కిలి సంభావ్యమైన విషయము. అతని జన్మమును అంతకంటె ముందుకు అనగా 16 వ శతాబ్ద ప్రారంభమునకు లాగుకొని పోవుటకూడ న్యాయము కాదు,

రామభద్రయ్య కృష్ణదేవరాయల ఆస్థానకవి యనియు 'అష్టదిగ్గజము' లనబడు కవులలో నొకడనియు ఒక ప్రథ యున్నది. అవి నిజమే యని సోపపత్తికముగా నిరూపింప గల్గినచో, రామభద్రుని జన్మకాలము దాదాపుగా ముందు నిర్ణయించిన విధముగా క్రీ. శ. 1490 - 95 ప్రాంతమే యగును. అళియ రామరాయలతో బుట్టువులైన కోనమ, ఓబమ, లక్కమ అను మువ్వురు మన సాహిత్య చరిత్రలో ముఖ్యపాత్రము లైనవారు. కోనమ తనయుడు సిద్ధిరాజుతిమ్మరాజు పరమయోగి విలాసమను కావ్యమును వ్రాసెను. ఈకవి క్రీ.శ. 1500-60 మధ్యకాలములో నున్నట్లు సాహిత్య చరిత్రకారులు నిర్ణయించి యున్నారు. ఓబమ కుమారుడు మన గొబ్బూరి నరసరాజు. ఈతడు కూడ దాదాపు అళియ రామరాయలతో సమవయస్కుడో, కొంచెము చిన్న వాడో అయియుండునని సోపపత్తికముగా ఇదివరకే నిర్ణయించి యున్నాము. రామభద్రయ్యతో కృతినొందు నప్పటికి అనగా క్రీ. శ. 1556 ప్రాంతములలో అతని వయస్సు దాదాపు 60 సంవత్సరములై యుండును కదా! లక్కమ కుమారుడు పోచిరాజు నరసరాజు. ఇతడు రామరాజ భూషణ (మూర్తి) కవికృతమైన కావ్యాలంకార సంగ్రహమను నామాంతరముగల నరస భూపాలీయమునకు భర్త. ఈ కవియే అళియ రామరాయల ఆస్థానమున మన్నన లందుచు రామరాజ భూషణకవి యయ్యెనని వసుచరిత్రము నందలి—

"శ్రీరామ క్షితిపున్ మదగ్రజు జయ
శ్రీలోలు నానాకళా
పారీణున్ బహు సంస్కృతాంధ్ర కృతులం
బల్మారు మెప్పించి త

త్కారుణ్యంబున రత్నహార హయవే
దాండగ్రహారాది స
త్కారంబందితి రామభూషణ కవీ!
ధన్యుండ నీ వన్నిటన్."

అను పద్యమువలన తెలియుచున్నది. ఈ రామరాజ భూషణకవి వసుచరిత్రమును క్రీ. శ. 1573 ప్రాంతములలో తిరుమలరాయనికి పెనుగొండయం దంకిత మిచ్చినట్లు చారిత్రకులు సహేతుకముగ నిర్ణయించి యున్నారు. (చాగంటి శేషయ్యగారు వసుచరిత్ర కృతి ప్రదానకాలమును క్రీ. శ. 1580 అని వ్రాసి యున్నారు. కాని శ్రీ చిలుకూరి వీరభద్రరావు ప్రభృతులు ఆ కాలము క్రీ. శ. 1572 కు పూర్వమే యని నిర్ణయించిరి. హరిశ్చంద్ర నలోపాఖ్యానము ఆ తరువాత కొన్ని యేండ్లకు వ్రాయబడినది. రామరాజ భూషణుడు అప్పటికి 60 లేక 65 సంవత్సరముల వయసువాడైనచో అతని జన్మకాలము క్రీ. శ. 1515 లేక 1520 కావచ్చును. కావున అతడు కృష్ణదేవరాయల కాలమున చిన్నవాడై, విద్యార్థి దశలో ఉండియుండును. పెద్దనకు శిష్యుడై యుండినను అందసంభావ్య మేమియును లేదు. ఎట్లైనను రామభద్రయ్య రామరాజ భూషణుని కంటె పెద్దవాడని చెప్పుటకు ఏ యాక్షేపణయు ఉండదు.

3. రామభద్రయ్యకు రామరాజ భూషణునకు విద్యా విషయకస్పర్ధ యుండెననియు, ఒక సందర్భములో రామభద్రయ్య కవిత యెడ రామరాజ భూషణుడు చేసిన ఆక్షేపము సాగనందున సమయపాలనమునకై రామభద్రయ్య రామరాజభూషణుని తలయో, తలపాగయో తన్నెననియు అప్పకవి వ్రాసియున్నాడు. రామ

భద్రయ్య చాల పెద్దవాడై రామరాజభూషణునకు గురుతుల్యు డైనందున అట్టి శిక్షను అందుకొనుటలో రామరాజభూషణుడు తా నవమానింపబడినట్లు భావింపక పోవచ్చును. కాని పరిస్థితు లను సమీక్షించినచో ఆ విషయ మెవరో కల్పించినదే కాని నిజము కాదేమోనని అనిపించును. రామభద్రయ్య రామాభ్యుద యములోని—

''సింహనఖాంకురచ్ఛిన్న వారణకుంభ
జనిత ముక్తాఫల శర్కరిలము
సమద సూకర పరస్పర భీకరాఘాత
శిథిల దంష్ట్రాచూర్ణ సికతిలంబు
గంధ సింధుర ఘటా కటకటా హస్రవ
ద్బంధుర దానాంబు పంకిలంబు
దవ గంధవహబంధు దహ్యమానానేక
కౌశికాగురు ధూపగంధిలంబు

పృథుల షడ్జస్వరోద్గీత భిల్లపల్ల
వాధరా గీతికా కర్ణనాతి భీతి
పరవశాత్మ పటీర కోటర కుటీర
లీన ఫణియగు నక్కాన కాననమ్మొ'' ॥ -25

ఈ పద్యము దశరథుడు వేటకై వెడలిన కానను వర్ణించు నది. ఈ పద్యమునందు సంగీతము విన్న పాములు భయముతో పటీర కోటరములందు దాగెననియున్నది. సంగీతము పాముల కిష్టమైనది కదా! భయపడి పారిపోవుట యెట్లు? అని రామరాజ భూషణుడు ఆక్షేపించినట్లును, విన్నది షడ్జస్వరము కా ట్టి, అది మయూరకూజితము ననుకరించునది కాబట్టి పాములు భయపడుట

సహజమే యని రామభద్రయ్య వివరించి రామరాజభూషణుని నిరుత్తరుం జేసి యోడించినట్లును ఒక కథ లోకమున వ్యాపించినది.

రామాభ్యుదయ రచన క్రీ. శ. 1556 ప్రాంతములో జరిగినది. అప్పటికి 26 సంవత్సరములు దాటినది. విజయనగర రాజ్య వైభవము రామరాయలపై ఆధారపడియున్నది. రామరాజభూషణు డప్పటికి వసుచరిత్ర రచన ప్రారంభింపనే లేదు. ఐనను రామరాయల ఆస్థానమున అతడున్నా డనవచ్చును. రామభద్రయ్య గొబ్బూరి నరసరాజు నొద్దనున్నాడు. దాదాపు అదే సమయమున రామరాజభూషణుడు నిజముగా రాయల మేనల్లుడగు పోచిరాజునరసరాజు నాస్థానములో నుండెనని కావ్యాలంకారసంగ్రహము చెప్పుచున్నది. అట్టిచో ఆ యిరువురు కవులు ఏ యాస్థానమున కలిసికొన్నట్లు? ఎవరి సమక్షమున రామాభ్యుదయము చదువబడినట్లు? పైగా రామాభ్యుదయ రచనా కాలమునాటికి రామరాజభూషణుడు బాలుడు కాడు. మంచి ప్రౌఢ వయస్సున నున్నవాడు. 'సంగీత కళానిధి' యను సార్థకమగు బిరుదు కలవాడని తరువాత కొంతకాలమునకే అతనిచే రచింపబడిన వసుచరిత్రము ఋజువు చేయుచున్నది. "షడ్జస్వరము విని పాములు బెదరును" అను చిన్న విషయమును ఎరుగనంతటి అల్పజ్ఞుడని మనము విశ్వసింపగలమా?

ఇక అప్పకవి సాక్ష్యము నమ్మదగినంత బలవత్తరమైనది కాదు. నన్నయ వ్రాసిన ఆంధ్ర శబ్దచింతామణిని తరువాత కొన్ని వందల ఏండ్లకు నన్నయ పోషకుడైన రాజరాజనరేంద్రుని కుమారుడని చెప్పబడు సారంగధరుడు సిద్ధుడై తెచ్చి బాలసరస్వతికి అప్పజెప్పెననియు దానికప్పు డతడు వ్యాఖ్య వ్రాసెననియు, అప్పకవికి

కలలో తెలియవచ్చిన విషయము. ఇది యెంతవరకు నమ్మదగినది? రామరాజభూషణుడు భట్టు కులము వాడందురు. అప్పకవి

"ఉపమ గల్గిన శయ్యల నొప్పియున్న
అంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు"

అని శాసించినవాడు. అట్టి వానికి రామరాజభూషణుని కవిత్వము నెడ, వ్యక్తిత్వమునెడ, పాండిత్యమునెడ ఎంత గౌరవముండునో సులభముగా ఊహించుకోవచ్చును. అందువలన ఈ గాథ కల్పిత మని చెప్పవచ్చును.

ఇట్టిదే మరియొకటి. రామరాజభూషణుని శిష్యులు గురువు గారు సూచించిన ఒక భావమును పద్యమున ఇమిడింప చేతగాక బాధపడుచుండగా ఆ దారిన వెళ్ళుచుండిన రామభద్రయ్య వారి కా భావమును ఇట్లు పూరించి యిచ్చెనట.

"మోహాపదేశత మోముద్రితములైన
కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందు తారకాగమ భిన్న కుచ కోక
ముల చంద్రనామంబు తలపరాదు
శీర్య దాశా వృంత శిథిలతాసులతాంత
మసియాడ పీవనల్ విసరరాదు
పటుతాప పుటపాక పరిహీనతను హేమ
మింక పల్లవ పుటార్చిడగరాదు
లలన కానంగ కేలి కీలాకలాప
సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహ పూరంబు పొంగిపొరల
చల్లని పటీర సలిలంబు జల్లరాదు"

ఈ పద్యము రామభద్రుని గ్రంథములలో ఎచ్చటను కానరాదు. కాని రామరాజభూషణుని వసుచరిత్రమున నిది తృతీయాశ్వాసము 180 వ పద్యముగా నున్నది. శిష్యులు ఆ పద్యమును తీసికొని వెళ్ళి రామరాజభూషణున కీయగా అతడు దాని రచనా సౌంద ర్యమునకు ముగ్ధుడై దానిని తన వసుచరిత్రమున చేర్చుకొనెనని యొక వదంతి యున్నది. వసుచరిత్రమును పూర్తిగా చదివి అందలి రామరాజభూషణుని రచనా పాటవమును, పాండిత్య ప్రకర్షను తెలిసికొనునంత వైదుష్యము గల వాడెవ్వడును అట్టి పద్యమును అతడు వ్రాయలేక పరుల పద్యమని తెలిసి తన గ్రంథమున చేర్చు కొనెనని విశ్వసింపడు. ఆ పద్యమే రామాభ్యుదయ మందును ఉండియున్నచో రామరాజభూషణుని పద్యము దానికి ప్రతిబింబ రూపమైన సంవాదమని తలంచుటకు వీలున్నది. ఇట్టి కింవదంతులు మన పండితుల విషయమున ఎన్నియో పుట్టి యున్నవి. వానిలో ఇదియు నొకటి.

ఇట్టి కథలు గాథలు మనము నమ్మినను నమ్మకపోయినను ఇరువురు సమర్థులగు పండితుల నడుమ ఇట్టి స్పర్థలుండుట మన మనూచానముగా వినుచున్న విషయమే. దిఙ్నాగ కాళిదాసుల కథ యిట్టిదే గదా! ఈనాడు కూడ ఇట్టివి లేకపోలేదు. కావున రామభద్రయ్య రామరాజభూషణు లిరువురు శ్రీ కృష్ణరాయల రాజ్యకాలమున కొన్ని యేండ్లైన కలిసి యుండిరనియు, రామ భద్రయ్య వయస్సున పెద్దవాడైనందున శ్రీ రాయలవారి ఆస్థాన కవియై అష్టదిగ్గజ కవీంద్రులలో ఒకడుగా ఉండి యుండుననియు విశ్వసింపవచ్చును.

3

# సకల కథాసార సంగ్రహ కర్తృత్వ నిర్ణయము

రామభద్రయ్య కృతముగా మరియొక గ్రంథము కూడ మనకు నేడు లభించుచున్నది. అది సకల కథాసార సంగ్రహము. దానిని గూర్చి చాల చరిత్ర కలదు. ఈ గ్రంథము మొదట సంస్కృతమున శ్రీ కృష్ణదేవరాయల చేతనే రచింపబడెనని ఆముక్తమాల్యద యందలి—

''పలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క
రసికులానన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్య సేవధిగాగ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు
శ్రుతి పురాణోప సంహిత లేర్చి కూర్చితి
సకల కథాసార సంగ్రహంబు
శ్రోత్ర ఘుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణిజ్ఞాన చింతామణి కృతి

మరియు రసమంజరీ ముఖ్యమధుర కావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిక మాకుఁ బ్రియముగా



అను పద్యము వలన తెలియుచున్నది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తన ఆంధ్రకవుల చరిత్రములో అయ్యల రాజు రామభద్రయ్యను గూర్చి 'ఇతడు (రామభద్రుడు) మొట్టమొదట కృష్ణదేవరాయల అంతిమ దశయందు విజయనగరములో ప్రవేశించి రాయలచేత తద్విరచితమైన "సకల కథాసార సంగ్రహము"ను తెనిగింపగోరబడెను' అని వ్రాసియున్నారు. కాని ఇప్పుడు లభించు సకల కథాసార సంగ్రహము ప్రతుల ప్రారంభములో అట్లు లేదు. కృష్ణరాయల ఆనతి ననుసరించి తాను సకల కథాసార సంగ్రహము వ్రాసినట్లు చెప్పికొన్నాడే కాని, రాయలు సంస్కృతమున వ్రాసిన నామసాదృశ్యముగల గ్రంథమునకు తెలుగుసేత యని చెప్పలేదు. చూడుడు—

"ఇట్లు కీర్తి విస్తారధురంధరుండగు శ్రీకృష్ణరాయ నరపాలాఖండలుండు నన్ను బిలిచి "శ్రీమత్సీతారమణ చరణ కమల పరిచరణాయమాన మానసుండవు. బహువిధ కవితా చమత్కార ధుర్యుండవు, సకల పురాణేతిహాస ప్రబంధ రచనా దక్షుండవు. మన్మనోరథ కార్యనిర్వాహకుండవగుటం జేసి, పురాతన మహాకవి విరచిత ప్రబంధంబు లన్వేషించి, భగవద్భక్తి నిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తాంతంబులు ప్రసిద్ధంబులగునట్లుగా ప్రశస్త కథలు విన్యస్తంబుగా ఎలకూచి సాహిత్యలక్షణచిత్ర కవిత్వ ప్రభావంబు లొక్కొక్క చోటం గనుపడ...అతి మధుర రసాయన ద్రాక్షాపాకంబుగా, శృంగార సంయుక్తంబగు నట్లు సకల కథాసార సంగ్రహంబు...రచియింపుమని ఉపన్యసించిన..." అని యున్నది. ఇందులో అనువాద ప్రసక్తి లేదు. కాని నామకరణము రాయలే జేసినట్లున్నది.

ఈ సకల కథాసార సంగ్రహము అయ్యలరాజు రామభద్రయ్య రచింప లేదనియు, అదే పేరుగల మరొక కవి కొన్ని యేండ్లకు తరువాత రచించెననియు గ్రంథమునకు ప్రఖ్యాతియు, శీఘ్రప్రచారమును అభిలషించి యా కవి తాను శ్రీకృష్ణరాయల ప్రేరణచే రచించినట్లు చెప్పుకొనెననియు శ్రీ చాగంటి శేషయ్య గారి వాదము. పెద్దన పద్యములకు అనుకరణములు రామాభ్యుదయములోని దశరథ విలాప ఘట్టము నందలి

'కానక కన్న సంతానంబు గావున
కానక కన్న సంతానమయ్యె..."

అను సీసపద్యమున కనుకరణమును అందుండుటచే అట్టి గ్రంథ చౌర్యము రామభద్రయ్యవంటి లబ్ధప్రతిష్ఠుడు చేయడనియు ఆయన వాదము. కాని కవి జీవిత చరిత్రకారులలో ఎవ్వరును శేషయ్య గారి వాదమును బలపరుప లేదు.

ముందు సకల కథాసార సంగ్రహము నందలి పద్యములలో ఏవి చిరుమార్పులతో కూడిన ఇతర కవుల పద్యములకు అనుకరణములో, ఏవి రామాభ్యుదయము నందలి వానితో సంవదించుచున్నవో పరిశీలింతము. చాగంటి శేషయ్య ఇచ్చిన పద్యములివి -

"అటజని కాంచె భూమి సురు
డంబర చుంబి శిరస్సర ఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ ద
భంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరి
ఫుల్ల కలాప కలాపి జాలమున్

కటక చరత్కరేణు కర
కంపితసాలము శీత శైలమున్''

—మనుచరిత్రము

''అట జనికాంచె భూమి విభు
డంబర చుంబిత వింధ్య శైలవి
స్ఫుట ఘనమూర్ధ నిర్గత సు
శోభితపుణ్య శిరస్సర ఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ ద
భంగుర నూత్న తరంగ సంగతో
త్కట వరఫేన నిర్జిత సు
ధాంభ మహానది నర్మదానదిన్''

—సకల కథాసార సంగ్రహము

''అనిమేషత్వము మాన్చె బిత్తరపు చూ
పస్వేదతా వృత్తిమా
న్చె నవస్వేద సమృద్ధి బోధకల మా
న్చెనోన్మహా విభ్రాంతి తో
డనె గీర్వాణ వధూటికిన్ భ్రమర కీ
టన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం
జూపట్టెనానత్తరిన్

—మనుచరిత్రము

''అనిమేషత్వము మాన్చె చంచలపు చూ
పస్వేద భావంబు గ్ర
ద్దన వారించె వినూత్న ఘర్మజల వి
స్తార ప్రపూర్ణంబు తో

డన దేవాంగన కయ్యేడన్ భ్రమర కీ
టన్యాయమై యొప్పి య
మ్మనుజేంద్రుం భ్రమియించు నంత నెరపిన్
మర్త్యత్వమున్ సంధిలెన్''

—సకల కథాసార సంగ్రహము

ఇవి రెండును మనుచరిత్రములోని పద్యములకు చిరుమార్పులతో కూడిన అనుకరణములు.

''కానక కన్న సంతానంబు గావున
కానక కన్న సంతానమయ్యె
నరయ గోత్ర నిధానమై తోచుగావున
నరయ గోత్రనిధానమయ్యె నేడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణ వర్ధిష్ణుడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుడయ్యె
కటకటా దాశరథి సముత్కట కరీంద్ర
కటకలిత దాన ధారార్ద్ర కటకమార్గ
గామియెట్లు చరించు నుత్కట కరీంద్ర
కటకలిత దాన ధారార్ద్ర కటక తటుల''

—రామాభ్యుదయము V-12

''కానకకన్న సత్పూనుండు నేటికి
కానక కన్న సత్పూనుడయ్యె
పుణ్యాజనోత్కీర్ణ పురుషుండు నేటికి
పుణ్యాజనోత్కీర్ణ పురుషుడయ్యె

ద్విజముఖ్యులనుగూడి తిరుగు బాలుడు నేడు
ద్విజముఖ్యులనుగూడి తిరుగుటయ్యె
గోత్రపావనుడైన కొమరుండు నేటికి
గోత్రపావనుడైన కొమరుడయ్యె
మత్తగజదాన ధారార్ద్రి మార్గములను
తరుల నీడల నెప్పుడు తిరుగువాడు
మత్తగజదాన ధారార్ద్రి మార్గములను
తరుల నీడల నెప్పుడు తిరుగుటయ్యె''

— సకల కథాసార సంగ్రహము

ఈ పద్యము రామాభ్యుదయములోని పద్యమునకు అనుకరణము.

శ్రీ చాగంటి శేషయ్యగారి వాదము ననుసరించి రామభద్రుడను మరొక కవి తాను రచించిన సకలకథాసార సంగ్రహములో మను చరిత్రములోని పద్యముల ననుకరించుచు రెండింటిని, రామాభ్యుదయములోని పద్యము ననుకరించుచు పద్యము నొకదానిని వ్రాసెననుకొనవలెను. అట్టి పని మన అయ్యలరాజు రామభద్రయ్య వంటి లబ్ధ ప్రతిష్ఠుడగు కవి చేయజాలడట. ఈ వాదము తర్కమునకు నిలువదు.

ప్రాచీన కవులలో ఎందరో అట్టి పని చేసియున్నారు. కాళిదాసుని కుమారసంభవములోని శ్లోకములకెన్నింటికో నన్నెచోడుని కుమారసంభవమునను, శ్రీనాథుని హరవిలాసమునను, భావానువాదములు కన్పట్టుచున్నవి. బాణుని కాదంబరిలోని వాక్యములకెన్నింటికో అనువాదము శ్రీనాథుని (శివరాత్రి మాహాత్మ్యము వంటి) రచనలలో కాన్పించును. అందమైన సమాసమో, హృద

యావర్జకమైన భావమో ఇతర కవులనుండి గ్రహించుట దోషమన జాలము. "Great men think alike" అను సామెత ప్రకారము గూడ అట్టివి జరుగవచ్చును. అన్ని యెందుకు? రామాభ్యుదయ కావ్యమునసే అట్టివి చూడవచ్చును.

"పసిపాపడై తాను పవళించుకాలంబు
వటపత్ర శయను భావంబు దలచు
చెలువొందగా బోరగిల శయ్య తడవెడు
తరి కూర్మమూర్తి చిత్తమున నిలుపు
రెండు మూడడుగు లొందాండ తట్టాడు న
ప్పుడు త్రివిక్రములీల బట్టి చూచు
లోలత వెన్నలు పాలుగ్రోలెడు నాడు
గోపాల సంస్కృతి గూర్చు నాత్మ
పరమ పురుష భూత భావిక భవ్యావ
తార బోధ మహిమ తగనెరింగి
యొండెరుంగ డంబుజోదర ధ్యానత
త్పరత యొకటి గాని బాలకుండు"

— ఎఱ్ఱన నృసింహపురాణము III—147

"మీనంబు నైనాడ నేనని సూచించు
తెరగున ననిమిష దృష్టి జూచు
కమఠ రూపమునేన కైకొంటి ననెడి వై
ఖరిఁ బోరగిలు వీపు గానరాగ
పోత్రి వేషము నేన పూనిమించితినంచు
నెరిగించు క్రియ ధాత్రి యెత్తమరుగు
నృహరి భావంబును నేన తాల్చితినన్న
వీక ప్రహ్లాదాభివృద్ధి నలరు

నడుగు వైపులు గని చూపు వడుగుబాగు
కరము గొడ్డలి నెరపి భార్గవత దెలుపు
దాశరథ వంశ శరధి సుధాకరుండు
శైశవ విలాస భాగాత్మ శైశవమున"

రామాభ్యుదయము III—137

"హాయను ధర్మరాజ తన
యా యను నన్నడ బాయనీకుజ
న్నా యను దల్లి నేపజను
నే యను కృష్ణుడు వీడెవచ్చె రా
వే యను నొంటివోవ దగ
వేయను నేగతి బోవువాడ నే
నో యభిమన్యు డాయను బ్రి
యోక్తుల నుత్తర దేర్చవే యనున్"

— ద్రోణపర్వము II—242

"హా యను గాధినందన మ
ఖారి నిశాటమదాపహారి బా
హా యను గ్రావ ఓవదప
దాంబురుహా యను రాజలోక సిం
హా యను బోషితార్య నివ
హా యను గానల కేగితే నిరీ
హా యను నిర్వహింపగల
నా నిను బాసి రఘూద్వహాయనున్"

— రామాభ్యుదయము V—10

"కలగెంతోయధి సప్తకంబు గిరి వ
ర్గంబెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయమా
శాచక్ర మల్లాడెఁ గొం
దలమందెం ద్రిదశేంద్రు పట్టణము పా
తాళంబు ఘూర్ణిల్లెనా
కులమయ్యెన్ గ్రహతారకాకులము సం
క్షోభించె నవ్వేధయున్"

— విరాటపర్వము IV—172

"కలగుండు వడి కుందె కులమహీధరపంక్తి
లాకులపాటొందె నఖిల తరులు
కలగి భంగమునొందె జలరాసు లేడును
తలచూపడయ్యె నత్తమ్మి చూలి
పృథ్వీతలంబెల్లఁ బెల్లగిల గడంగె
నతి మలినంబయ్యె నంబరంబు
తలయేఉుదాల్చి గట్టులుపట్టె నగధ్వని
ఫణినాయకుడు గూఢపదమునొందె
దిక్కరులు మూలమూలల చిక్కి మ్రొక్కె
ధరణి చక్రము దిర్దిర దిరిగె నపుడు
వాలిని గురించి రాఘవేశ్వరుడ మోఘ
సాయకము వింట సంధించి వేయఁబూన"

— రామాభ్యుదయము V—212

"చంద్రిక పూవన్నె జిలుగు దువ్వలువను
దడియొత్తె నొక్క కాంతాలలామ

కొనగోళ్ళ నెరులు సిక్కులు వాపి మెలపున
        శిరసార్చె నొక్కతే జిగురుబోడి
వెన్నెల నిగ్గులు వెదజల్లెడు మడుంగు
        లందిచ్చె నొక్క పూర్ణేందువదన
నవరత్న మణి భూషణ వ్రజంబులు మేన
        గీలించె నొక రాజ కీరవాణి

విరుల సరులిచ్చె నొక యరవింద గంధి
అలదెఁ జందన మొక ధవళాయతాక్షి
సుదతి యొక్కతె కపురంపు సురటి విసరె
నిలువుటద్దంబు నొక యింతి నిలిపె నెదుట''

— పారిజాతాపహరణము 2-13

''కలికి యొక్కతె పెట్టె గందంపు టటకలి
        జలకంబమర్చె కోమలి యొకర్తు
తడి యొత్తె నొక్క లతాతన్వి గొబ్బున
        ధౌత వస్త్రంబిచ్చె నాతి యొకతె
గద్దియ యిడె నొక్క ముద్దియ కూర్చుండ
        శిరసార్చె నొక్క యోషిల్లలామ
వనిత యొక్కతె ధూపవాసన యొనగూర్చె
        నొక కొమ్మ విరిదండ సికకుజుట్టె

మకర కుండల మాణిక్య మండలంబు
లోఱపు వాటిల్లఁ గీలించె నొక్క యువిద
రత్న నీరాజనం బొక్క రమణి యిచ్చె
సకల సేవ్యున కారఘుస్వామి కపుడు''

— రామాభ్యుదయము IV—107

శరద్రాత్రియందు యమునాతీరమున తిరోహితుడైన శ్రీకృష్ణుని (పోతన భాగవతమున) గోపికలు వెదకు సందర్భమునందు గల పద్యములందలి భావముల ననుకరించు పద్యములు రావణాపహృతమైన సీతను వెదకుచు శ్రీరాముడు రురు, తరు, సరిద్విశేషంబుల సంబోధించుచు విలపించు ఘట్టమున గలవు.

— రామాభ్యుదయము V - ఆశ్వాసము

ఇక సంస్కృతకవుల పద్యముల అనువాదములో, భావానువాదములో, కూడ రామాభ్యుదయమున అచ్చటచ్చట కాన్పించును. చూడుడు.

"పరిణామ సుఖే గరీయసి
వ్యథకేస్మిన్ వచసిక్షతౌజసామ్।
అతివీర్యవతీవ భేషజే
బహు రల్పీయసి దృశ్యతేగుణః ॥"

—కిరాతార్జునీయము-2-4

రామభద్రుని తెలుగుసేత

"పరుషోక్తి బాధ చూడకు
పరిణామ సుఖంబు చూడ బ్రతికెద వసురే
శ్వర! మందు చేదుచూడకు
పెరిగిన తెవులణగ జూడు పెద్దతనానన్"

—రామాభ్యుదయము VII - 75

"అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవమనాస్వాదితరసమ్।
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘం
నజానే భోక్తారం కమిహసముపస్థాస్యతి విధిః ॥

—శాకుంతలము II - 10

దీనికి రామభద్రయ్య భావానువాదము.

కళ వెచ్చబోని నిర్మల చంద్ర బింబంబు
పరభృతం బంటని సరసకిసల
మినకర వ్యాప్తివాడని కమ్మపూదీవ
మరుడేర్చి దాచిన మార్గణంబు
లంటిచూడని మించు టద్దంపుపలకలు
కొదమ రాయంచ మూర్కొనని తూండ్లు
వలరాచ యాకబాటిలు మావిచిగురొంబండ్లు
కానంగరాని శృంగారసరసి

యనంబొడమి ముద్దరాలి నెయ్యంపుంజూలి
ముద్దు నెమ్మోము మించు కెమ్మోవి మేను
కలికి చూపులు తళుకుం జెక్కులు భుజంబు
లుదుటుంజనుగవయును నాభియును దనర్చు''

—రామాభ్యుదయము IV - 64

ఇట్టివి ఇంకెన్నియైనను చూపవచ్చును. వీనినన్నింటిని పరిశీలించి నచో రామభద్రయ్య గ్రంథచౌర్యము చేసెననగలమా?

ఇట్లు రామభద్రయ్య రచనలోనే - రామాభ్యుదయమున ఎఱ్ఱన, తిక్కన, ముక్కుతిమ్మన, పోతన మున్నగు ఆంధ్రకవుల రచనలలోని అనుకరణములే కాక, భారవి, కాళిదాసు మున్నగు సంస్కృత కవుల రచనలకు కేవలానువాదప్రాయములైన పద్యము లెన్నో యున్నవి. అంతమాత్రమున కవికెట్టి న్యూనతయు ఆపాదింప నవసరము లేదు. అట్టి అనుకరణములు సంవాదము లను పేర ప్రాచీనాలంకారికులు సక్రమమైనవే యని వివరించియున్నారు.

ఆనందవర్ధనుడు ఇట్టి సంవాదములను తన ధ్వన్యాలోకము చతుర్థోద్యోతమున—

"సంవాదోహ్యన్యసాదృశ్యం తత్పునః 1. ప్రతిబింబవత్
2 ఆలేఖ్యాకారవత్ 3. తుల్యదేహివత్ చ శరీరిణామ్॥"

(4-12)

అను శ్లోకమున అన్యసాదృశ్యములు మూడు విధములనియు, మొదటిది అద్దమునందలి ప్రతిబింబమువలె మూలమునకు యథాతథమైనదనియు, రెండవది మూలమునకు వర్ణచిత్రమువలె అతిశయముగా పోలిక కలదనియు, మూడవది మూలవస్త్వాకారములను బోలిన బిన్నరూపమనియు తెలుపుచు—

"తత్రపూర్వ మనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరమ్
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్య సామ్యత్య జేత్కవిః॥"

(4-13)

అను శ్లోకమున మొదటి రెండును పరిహరింపదగినవనియు మూడవది అందరకు ఉపాదేయమేయనియు తెలిపియున్నాడు.

ఇట్లు ఇతర కవుల పద్యములను స్వేచ్ఛగా రామభద్రయ్య తన రామాభ్యుదయమున ననుకరించినట్లు తగినంత సాక్ష్యముండగా తనదేయైన (పూర్వరచనలోనిది) 'కానక కన్న సంతానంబు' అను సకలకథాసారసంగ్రహములోని పద్యమును మఱింత మెఱుగుపెట్టి తన రామాభ్యుదయమున వేసికొనుట తప్పెట్లగును? తిక్కన మహాభారత పూర్వ పూర్వపద్యములలో కొన్నింటిని ఉత్తరోత్తరపద్యములలో యథాతథముగా గైకొనుటయే కాక తన పూర్వరచనమైన నిర్వచనోత్తర రామాయణములోని

కొన్నింటిని తరువాతి రచనయైన మహాభారత పర్వభాగములలో కొలది మార్పులతో కైకొనియున్నాడు. ఉదాహరణమునకు—

"గుణమున లస్తకంబునను
కోటి యుగంబున గేలదార భీ
షణముగ నుప్పతిల్ల రభ
సంబుగ రేగినమాడ్కి తీవ్రమా
ర్గణ నికరంబు లొక్కట న
రాతి బలంబుల గప్ప శార్ఙ్గని
క్వణనము రోదసీ కుహర
కర్పరముం బగిలింప నుగ్రతన్

— నిర్వచనోత్తర రామాయణము III—18

"గుణమున లస్తకంబునను
గోటి యుగంబున గేల దారభీ
షణముగ నుప్పతిల్లి రభ
సంబున రేగినమాడ్కి దీవ్రమా
ర్గణ నికరంబు లొక్కట న
రాతిబలంబుల గప్ప గాండివ
క్వణనము రోదసీ కుహర
కర్పరముం బగిలింప నుగ్రతన్"

— విరాటపర్వము V-30 పద్య

"కలగెంతోయధి సప్తకంబు గిరి వ
ర్గంబెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మా
శా చక్ర మల్లాడెఁ గొం

దలమందెం ద్రిదశేంద్రు పట్టణము పా
తాళంబు ఘూర్ణిల్లెనా
కులమయ్యెం గ్రహతారకా కులము సం
క్షోభించె నవ్వేధయున్''

— నిర్వచనోత్తర రామాయణము V-56

పైపద్యమే యథాతథముగా విరాటపర్వము చతుర్థాశ్వాసము 172 వ పద్యముగా గైకొనబడినది.

''పటు వేగంబున శాతభల్ల చయసం
పాతంబునన్ మింటమి
క్కుటమై పర్వ ధగద్ధగీయ మగుచుం
గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించు నట్లిరువురున్
శౌర్యోన్నతిం బోరిరు
త్కట దర్పోద్ధతులై పరస్పర జయా
కాంక్షా ప్రచండంబుగన్

— నిర్వచనోత్తర రామాయణము 6-98

ఈ పద్యమే ఒకటి రెండు చిరుమార్పులతో విరాటపర్వము తృతీయాశ్వాసము 188 వ పద్యముగా గైకొనబడినది.

''శ్రావ్యంబై చెలగెన్ గభీర మధుర
జ్యానాద ముద్దామ వీ
రవ్యాపార నిరూఢతం బ్రతిశరా
రంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతినా
శ్చర్యంబుగా నేయుచున్

దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దరును సా
దృశ్యం బదృశ్యంబుగాన్"

— నిర్వచనోత్తర రామాయణము 4-71

ఈ పద్యమే యథాతథముగా విరాటపర్వము పంచమాశ్వాసములో 132వ పద్యముగా గైకొనబడినది.

కావున సకలకథాసారసంగ్రహము అను గ్రంథమును రామభద్రయ్య శ్రీకృష్ణదేవరాయల దేహాంతకాలమునకు దగ్గరలో దాదాపు క్రీ. శ. 1528 ప్రాంతములలో మొదలిడియుండుటయు ఆయనజీవితకాలములో గ్రంథము పూర్తి కానందున ఎవరికి అంకిత మియ్యవలయునో తెలియక పెక్కుపోషకుల నాశ్రయించుచు పోయి కడకు గొబ్బూరి నరసరాజు నొద్ద స్థిరపడెననియు ఊహింపవలసియున్నది. అయినను ఆ గ్రంథమును గొబ్బూరి నరసరాజున కంకిత మీయలేదు. ఎందుకనగా—

"క్షితిపతి యెవ్వడైన నగు
కీర్తియ సొమ్ము నృపాలకోటికిన్
గృతిపతి యైన వాడె కృత
కృత్యుడు కాన నొనర్పు సప్తసం
తతులకు నెక్కుడంద్రు కృతి
దాశరథీద్ధ కథా సుధా చమ
త్కృతకృతి రామభద్ర! చెవి
కింజవి గొల్పు భవత్కవిత్వముల్"

—పీఠిక-13

అను రామాభ్యుదయమునందలి పద్యము ననుసరించి నరసరాజు రామభద్రయ్యను రామకథయే వ్రాయుమని ఆదేశించినట్లున్నది.

కాబట్టియే అతడు సకల కథాసార సంగ్రహము నటుంచి క్రొత్తగా రామాభ్యుదయ రచనకు పూనుకొన్నాడు.

సకల కథాసార సంగ్రహము నందలి కృత్యవతారికలో గల స్వప్న వృత్తాంతము - అది విని రాయ లానతిచ్చిన.

"నీవును బాలకృష్ణ పద
నీరజ భక్తుడ వార్యచిత్త మో
దావహ సద్గుణుండవు ర
మాధిపునిం గలలోనగాంచి య
ద్దేవు హితోపదేశమున
తేజము నొందిన వాడవన్నిటం
గావున నీ ప్రబంధము ప్ర
కాశముగా హరికిమ్ము నావుడున్"

అను పద్యమునందలి విషయము కొంత కృతకముగనే కాన్పించును. రాయల కాలమున రామరాజ భూషణ పింగళి సూరనాదులు బాలురై యుండగా రామభద్రయ్యయే ప్రౌఢ వయస్సున నుండుటయు, శ్రీనాథాదుల వలె నా వయస్సున ఉత్కృష్ట కావ్య రచన చేయజాలియుండుటయు సంధిగ్ధ విషయములు కానక్కర లేదు.

సకల కథాసార సంగ్రహము నందలి గద్యమును రామాభ్యుదయము నందలి గద్యముతో పోల్చిన మిక్కిలి భిన్నముగా నున్నదనియు, మొదటిదాని యందు రామభద్రయ్య తండ్రి తాతల పేర్లు లేకపోవుటయేగాక, గోత్రభేదము కూడ కలదనియు శ్రీ చాగంటి వారి వాదము. ఆ గద్యము ఈ క్రిందిది.

"ఇది శ్రీరామభద్ర ప్రసాదలబ్ధ కవిత్వ మహత్త్వ విశారద శారద సత్కవి మిత్రాపస్తంబ సూత్రపౌత్ర కాశ్యపసగోత్ర

పవిత్ర రామభద్ర ధీముద్రాభద్ర రామభద్ర ప్రణీతంబైన సకల కథాసార సంగ్రహము...'' ఈ విషయము కూడ శ్రీ నరసింహము గారు చర్చించి ఈ క్రింది యభిప్రాయము నిచ్చి యున్నారు. ''సకల కథాసార సంగ్రహ గద్యమున రామభద్రయ్య తన తాన తండ్రుల పేర్లు పేర్కొనలేదే కాని, రామాభ్యుదయ గద్యములో నున్న రామభద్రయ్య తాత తండ్రుల కంటె భిన్నులైన వారి పేర్లు ఈయలేదు కదా! అట్టిచో నిక ఆ విషయమైన చర్చయే పుట్టదు. ఇక గోత్రమా! మూడు పుటల కృత్యవతారిక అంతయు తప్పనుటకంటె మూడక్షరముల 'కౌండిన్య' శబ్దమునకు బదులు వ్రాయసకాడు పొరపాటున 'కాస్యప' యని వ్రాసి యుండుననుకొనుట మిక్కిలి యుక్తియుక్తము కదా!

ప్రబంధమునకు ఆయువుపట్టైన ఆలంకారిక రచనము రామాభ్యుదయమునం దెల్లయెడల కాన్పించును గదా! అచ్చ తెనుగు పదముల కూర్పు, ముక్తపదగ్రస్తాలంకారముల యునికి మున్నగునవి ఈ గ్రంథమున అడుగడుగున కన్పించును. ఒకసారి యీ దృష్టితో రామాభ్యుదయమును, సకల కథా సార సంగ్రహమును పరిశీలించి చూచినచో ఈ రెండు గ్రంథములును ఏక కవి కృతములే యనుట స్పష్టమగును. సకల కథాసార సంగ్రహము ప్రారంభమున కవి యొనర్చిన కృష్ణదేవరాయ స్తుతి గల సీసపద్యమును శ్రీ కురుగంటి సీతారామయ్యగారిచ్చి యున్నారు. చూడుడు:

''చినుకు పూసల నొనర్చిన బిత్తరపుదండ
దండాలు గల వేల్పు తపసి కొండ
కొండాటములను జక్కులు పన్ను జడదారి
దారిగట్టులరాయు చీరుటలుగు

అలుగు నింతికి వెన్ను డిలకు తెచ్చినచెట్టు
చెట్టుగట్టుగ జేయు చెలువతోడు
తోడు చేడెలనేలు దొరకును దోబుట్టు
పుట్టు విబ్బుల తేని పొందుకాడు
గాడు పూరినిగాంచిన కన్నతల్లి
తల్లి బిడ్డల బెండ్లాడు గొల్ల మనికి
మనికితము దీర్చు విలుకాని జెనకువిందు
విందు నీ కీర్తి నరసింహ విభుని కృష్ణ''

ఈ పద్యమునందలి అచ్చ తెనుగు పదములు, ముక్తపదగ్రస్తాలంకారము, ఈ గ్రంథము రామభద్రుని రచన యని నొక్కి చెప్పుటలేదా!

అయిన రామభద్రయ్య తన మొదటి రచనలో ఇతరుల పద్యముల కేల యనుకరణములు వ్రాయవలయునను ప్రశ్నకు మరియొక విధముగా శ్రీ కాకర్ల వేంకటరామనరసింహంగారు తన పీఠిక 37వ పుటలో సమాధానము నిచ్చియున్నారు. దానికి శ్రీకృష్ణదేవరాయల యాజ్ఞ కారణమట. కృత్యవతారికలో ''పురాతన మహాకవి విరచిత ప్రబంధముల నన్వేషించి గ్రంథ రచనము సేయుమని'' రాయల యాజ్ఞ కావున రామభద్రయ్య రాయల యాజ్ఞను మన్నించి అట్లే చేసియున్నాడు, అనియు సరిపెట్టుకొనవచ్చును.

పై చర్చల సారాంశ మేమనగా అయ్యలరాజు రామభద్రయ్య క్రీ.శ. 1495 ప్రాంతములో పుట్టి క్రీ.శ. 1575 ప్రాంతము వరకు జీవించియుండెననియు, సకల కథాసార సంగ్రహము, రామాభ్యుదయము నను నీ రెండు గ్రంథములును రామభద్రయ్య కృతములైనవే యనియు నిర్ణయించుట.

4

## రామాభ్యుదయము — ప్రబంధము



తెలుగున రామాభ్యుదయ మను గ్రంథము కేవల స్వతంత్ర గ్రంథము కాదు. ఇది వాల్మీకిరామాయణ మాధార ముగా తెలుగులోనికి పరివర్తింపబడినది. కేవలానువాదముగూడ కాదు. సంస్కృతమున ఒక ప్రక్రియలో వ్రాయబడిన గ్రంథము, తెలుగులోనికి మరొక ప్రక్రియ రూపమున అవతరింపవచ్చును. భారత రామాయణాదు లిట్టివే. పురాణేతిహాస రూపములతో నున్నవి తెలుగులోనికి ప్రబంధరూపమున అవతరించిన వానిని మన మెఱుగుదుము. నన్నయ మహాభారతానువాదము చేయుచు తన గ్రంథము కవులకు కావ్యముగను, ధర్మతత్త్వజ్ఞులకు ధర్మ శాస్త్రముగను, వేదాంతులకు వేదాంత గ్రంథముగను, ఇంక ఎవరికి కావలసిన రూపముతో వారికి కన్పించునని సెలవిచ్చి యున్నాడు. ఇప్పుడు మన రామాభ్యుదయము ఎట్టి ప్రక్రియకు చెందిన గ్రంథమో మొదట చర్చింతము.

మొదట మూలగ్రంథమైన వాల్మీకి రచిత సంస్కృత రామాయణము ఏ ప్రక్రియకు చెందునో తెలిసికొందము. విశ్వా మిత్రుడు శ్రీరామ లక్ష్మణులను మిథిలానగరమునకు కొంపోవుచు దారిలో వారికి చెప్పిన విషయములను మిథిలానగరమున శతా నందుడు రామలక్ష్మణులకు చెప్పిన విశ్వామిత్ర చరిత్రాది విషయ

ములను పురస్కరించుకొని దానిని పురాణముగా భావించుటకు వీలున్నది. అమరసింహుడు 'పురాణమ్ పంచలక్షణమ్' అని దాని లక్షణమును

"సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వాంతరాణి చ।
వంశాను చరితం చేతి లక్షణానాంతు పంచకమ్॥"

అని నిర్వచించియున్నాడు.

'సర్గము (ప్రపంచోత్పత్తి), ప్రతిసర్గము (మన్వాదిసృష్టి), వంశము (దేవాసురాది విభేదోత్పత్తి), మన్వంతరము (వేరు వేరు మనువులతరములు), వంశానుచరితము (సూర్య చంద్ర వంశముల చరిత్రము) అను ఐదు లక్షణములు గలది పురాణము' —

రాజశేఖరుడు తన కావ్య మీమాంస ద్వితీయాధ్యాయము నందు

"సర్గః ప్రతిసంహారః కల్పోమన్వంతరాణి వంశ విధిః
జగతో యత్ర నిబద్ధం తద్విజ్ఞేయం పురాణమితి"

అను శ్లోకమున పురాణశబ్దమును నిర్వచించినాడు. ఇదియు పై "సర్గశ్చ, ప్రతిసర్గశ్చ..." అను శ్లోకార్థమునే బోధించును. రాజశేఖరుడు అంతతో నాగక "పురాణ ప్రవిభేద ఏవ ఇతిహాసః" అనియు "సచద్విధాపర(రి) క్రియాపురాకల్పాభ్యాం అనియు నిర్వచించి మరల వివరించుచు

"పర(రి) క్రియా పురా కల్ప ఇతిహాస గతిర్ద్విధా।
స్యా దేకనాయకా పూర్వా ద్వితీయా బహునాయకా॥

— ద్వితీయాధ్యాయము

అని ఏకనాయకాధికృతమైన పురాణము పర(రి) క్రియ పేరి ఇతిహాస మనియు, బహునాయకాధికృతమైనది పురాకల్ప మను

పేరి ఇతిహాసమనియు చెప్పి, వానికి ఉదాహరణములుగా "తత్ర రామాయణం భారతం చోదాహరణే" అని క్రమముగా చెప్పెను. వానికి వేదములలో చెప్పబడిన నాలుగు అర్థవాదములలో అనగా నింద, ప్రశంస, పరకృతి, పురాకల్ప అను వానిలో క్రమముగా కడపటి రెండింటిని ఉదాహరణముగా వర్ణించెను. దీనివలన తేలిన సారాంశ మేమనగా సంస్కృత రామాయణము పురాణ ప్రభేదమైన పరకృతి యను పేర బరగు ఇతిహాసమనియే.

"పురాఅపినవమ్ - పురాణమ్" అని వ్యుత్పత్తి చెప్పుదురు. కాలము గడువగా పై జెప్పిన లక్షణ పంచకమే కాక, ఇంకను కొన్ని లక్షణములు పురాణమునకు కల్పింపబడినవి. పురాణ ప్రభేదమైన ఇతిహాసమును రాజశేఖరుడు ఒక ఉపవేదముగా గ్రహించినాడు. కావ్యమీమాంస ద్వితీయాధ్యాయమున—

"ఇతిహాసవేద ధనుర్వేదౌ గాంధర్వాయుర్వేదా
వపి చోపవేదాః"

అని వర్ణించియున్నాడు. అమరకోశమున "ఇతిహాసః పురావృత్తమ్" అని నిర్వచించి, వ్యాఖ్యానమున "ఇతిహాపారంపర్యోపదేశః ఆస్తే అస్మిన్ ఇతి ఇతిహాసః" అని వివరించి యున్నాడు. మరల ఇంకొకచోట "ఇతిహా" అను అవ్యయమును నిర్వచించుచు "పారంపర్యోపదేశేస్యా దైతిహ్య మితిహావ్యయమ్" అని విపులీకరించియున్నాడు. వ్యాఖ్యలో "ఇత్యేవంకిము పారంపర్యమస్తీతి ఇతిహా" - అనగా "ఇట్లని గదా పారంపర్యము గలదనుట ఇతిహాశబ్దార్థము" అనుటచే ఇతిహాసము అని పిలువబడు గ్రంథములోని విషయము గ్రంథకర్త సమకాలములో జరిగినది కాక, అంతకుముం దెప్పుడో జరిగి పారంపర్యముగా వ్యాప్తికి వచ్చియుండగా, అట్టి

దానిని గ్రంథకర్త గ్రంథస్థ మొనర్చెనని అర్థము. దీనికై నే నింత చర్చచేయుటలో ఒక ప్రయోజన మున్నది. రామాయణ కథ వాల్మీకి జీవిత కాలములోనే జరిగినదనియు, దానికి సాక్ష్యము గ్రంథమునందే ఉన్నదనియు వాల్మీకి ఆశ్రమముననే సీతాదేవి పురుడు పోసికొని ఇద్దరు బిడ్డలను కన్నదనియు కొందరు విమర్శకులు గట్టిగా వాదించుచున్నారు. అటువంటి సందర్భమున రామ కథ పారంపర్యోపదేశము కాదు. రామాయణము ఇతిహాసమూ కాదు అని అనవలసి వచ్చును. సుప్రసిద్ధ పండితులు, పరమాస్తికులు ప్రాచీన సంప్రదాయములందు మిక్కిలి గౌరవముగల వారు అగు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ "సంస్కృత వాఙ్మయ చరిత్ర - లౌకిక వాఙ్మయము" అను గ్రంథము ద్వితీయ ముద్రణము 42వ పుట యందు వ్రాసిన విషయము గమనింపుడు. వారు రామాయణోత్తరకాండ కథను గూర్చి వ్రాయుచు "ఈ విధముగా పూర్వ రామాయణ కథా రచనముతో ఎట్టి పోలికయు లేని డొంక తిరుగుడు రచనయు, అందలి కవిత్వ ప్రౌఢ శైలి కేరీతి నీడుకాని సామాన్య శైలియు, అందలి మాధుర్యములో ఆవగింజంతైనా లేని వర్ణనలును కలిగిన యుత్తరకాండము వాల్మీకి మహర్షి కృత మని రెండును చక్కగా పఠించిన విమర్శ లెవ్వరును చెప్ప సాహసింపజాలరు. అట్లెవరైనను చెప్పిరా వారు చిరకాలముగా వచ్చు పురాణ ప్రసిద్ధికి అనుకూలముగా చెప్పుటయే అందుకు కారణమగును. కాని వేరుకాబోదు. కావున రామాయణ భారతకథలు దేశమున బాగుగా వ్యాపించిన పిదప వానిని చదివిన యొక విద్వాంసుడు భారత కథతో కృష్ణద్వైపాయనునికి గల సంబంధము గమనించి అట్లే రామకథతో వాల్మీకికి సంబం

ధము కల్గించుటకై ఉత్తరకాండ కథ కల్పించి వర్ణించియుండు ననియు, పూర్వరామాయణమును ఉత్తరకాండమును చదివిన తర్వాతి పండితుడొకడు ఉత్తరకాండ కథాప్రసక్తి కలుగునట్లు బాలకాండమున తృతీయ, చతుర్థ సర్గలు కల్పించి చేర్చియుండు ననియు నమ్మవచ్చును. ఈ విశ్వాసమును అక్కరలేని విషయ సూచికతోడి తృతీయ సర్గ తుదిశ్లోకములును, అసంగతముగానున్న చతుర్థ సర్గ ఉపక్రమోపసంహారములును బలపరచును.'' అని బల్ల గ్రుద్దినట్లు రామాయణ కథ వాల్మీకి పుట్టుటకు కొన్ని వందల యేండ్లకు ముందే జరిగినదనియు, అది పారంపర్యముగ ప్రజలలో వ్యాపించియుండ వాల్మీకి దానిని గ్రంథస్థ మొనర్చెననియు వివరించియున్నారు. ఈ భావమును బలపరచుటకు బాలకాండ ద్వితీయ సర్గములో వాల్మీకికి బ్రహ్మ ప్రత్యక్షమై ముందతడు నారదుని వలన వినిన కథను పేర్కొనుచు

> ''రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్యధీమతః ।
> రామస్య సహసౌమిత్రే రాక్షసానాం చ సర్వశః ॥
> వైదేహ్యాశ్చాపి యద్వృత్తం ప్రకాశం యదివారహః ।
> తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి ॥''
>
> — (32, 33 శ్లో)

అని రామాదుల బహిర్వృత్తమే కాక వారి మనస్సులలోని భావములు కూడ వాల్మీకికి ఎప్పుడో జరిగినవే ఐనను అప్పుడు జరిగినట్లుగా బోధపడునని వరమిచ్చియున్నాడు. కావుననే వాల్మీకి

> ''తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగమాస్థితః ।
> పురాయత్తత్ర నిర్వృత్తం పాణావామలకం యథా ॥''
>
> — (బాల 3-6)

అని ఎప్పుడో జరిగినవి చేతిలోని ఉసిరికాయవలె తెలిసికొన గలిగెను.

బాలకాండము తృతీయ చతుర్థ సర్గలను కల్పించిన ఆ పండితుడే అయోధ్యాకాండములోని

"ఇతి సీతాచ రామాశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః ।
అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి యభివాదయన్ ॥
తాన్ మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్ ।
ఆస్యతామితి చోవాచస్వాగతస్తునివేద్యచ ॥
—(56-16, 17)

అను రెండు శ్లోకములను కల్పించియుండవచ్చును. రామాదులు వాల్మీక్యాశ్రమమున ప్రవేశించుట ఇచ్చట మిక్కిలి కృతకము గానే కన్పించుచున్నది. వాల్మీకి కిచ్చట ఏ మాత్రము ప్రాధాన్యము లేదు.

వాల్మీకి రచితమైన రామాయణము స్వభావమున పురాణ భేదమైన పర(రి)క్రియ యను ఇతిహాస భేదము. కాని వాల్మీకి స్వయముగా తన సర్గాంతములందు (సర్గవిభజనము, సర్గాంత గద్యము వాల్మీకియే చేసియుండడు) "ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే...కాండే...సర్గః" అని సూచించియున్నాడు. రామాయణము ఋషిప్రోక్తమనియు, ఆదికావ్యమనియు దాని యర్థము.

సంస్కృతమున రామాయణమును ఆదికావ్యమనుట యెంత వరకు సమంజసము? ప్రక్రియాభేదములలో కావ్య మొకటి. లౌకిక వాఙ్మయములో పురాణేతిహాసాదులు వెలసిన వెనుక ఎప్పుడో సంస్కృతమున గూడ కావ్య ప్రక్రియ ప్రారంభమైనది. రఘు

వంశము, శిశుపాలవధ, కిరాతార్జునీయము, నైషధము వంటి సమగ్రలక్షణ యుతములగు మహాకావ్యములును వానికంటే పూర్వములైన సౌందరనందాది కావ్యములును పురాణాదులకు తరువాతివే. వీనిలో ఏదో నొకదానిని అన్నిటికంటె ముందు రచింపబడిన దానిని ఆదికావ్య మనవచ్చును. కాని పురాణాదుల కంటె కూడ చాల పూర్వమే వెలసిన రామాయణమే ఆది కావ్యముగా వ్యవహరింపబడుచున్నది. నామకరణ మెవరొనర్చినను వాల్మీకి రామాయణమున దానికంటె ఎంతో వెనుకటి కాలమున వెలసిన రఘువంశాది కావ్యములందు కాన్పించు విశేషలక్షణము లెన్నియో ఉన్నవి. ఆలక్షణముల వలననే వాల్మీకి రామాయణము రచనా పద్ధతియందును, ఆలంకారిక శైలియందును, వివిధ వర్ణనా వైవిధ్యమునందును, రసపోషణ, పాత్రపోషణ, ఔచిత్యపోషణము లందును, నాయక లక్షణ నిర్దేశమునందును వెనుకటి కావ్యములందు అనుసరింపబడిన లక్షణములను కలిగియున్నది. కావుననే పుట్టుకయందు చాల ప్రాచీనమైనను రచనా వైలక్షణ్యమునందును ప్రక్రియా వైఖరియందును రామాయణము కావ్యమేకాని పురాణము కాదు. పరిమాణముననను, అట్టివే మరికొన్ని లక్షణములనుబట్టి కొన్ని మహాకావ్యములనియు, మరికొన్ని లఘుకావ్యములనియు, వ్యవహరింపబడుచున్నవి. సంస్కృతమున విశ్వనాథ కవిరాజాదులు నిర్వచించిన మహాకావ్య లక్షణములనుబట్టి వాల్మీకి రామాయణము మహాకావ్యమే, ఆదికావ్యము కూడను. ఆ లక్షణముల నొకసారి పర్యాలోకింతము—

"సర్గబంధో మహాకావ్యం తత్రైకో నాయకస్సురః।
సద్వంశః క్షత్రియోవాపి ధీరోదాత్త గుణాన్వితః॥

ఏకవంశ భవా భూపాః కులజాబహవోఽపివా ।
శృంగార వీరశాంతానా మేకోఽంగీ రసయిష్యతే॥

ఇతిహాసోద్భవం వృత్తమన్య ద్వాసజ్జనాశ్రయమ్ ।
ఏకవృత్తమయైః పద్యైరవసానేఽన్య వృత్తకైః ॥

నాతి స్వల్పాః నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ ।
నానావృత్తమయః క్వాపిసర్గః కశ్చన దృశ్యతే ॥

సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంతవాసరాః ।
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః ॥

సంభోగ విప్రలంభౌచ మునిస్వర్గ పురాధ్వరాః ।
రణప్రయాణోపయమ మంత్రపుత్రో దయాదయః ॥

వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ ।
కవేర్వృత్త స్యవానామ్నా నాయకస్యే తరస్యవా ॥''

(సాహిత్యదర్పణము షష్ఠ పరిచ్ఛేద శ్లోకము 315 - 324)

ఈ వర్ణనము క్రింద ఉదాహరణములుగా రఘువంశ శిశుపాలవధ, నైషధాది మహాకావ్యములను పేర్కొన్నాడు. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు—

''మన కవులు నాటకవస్తువునందు చూపినంత శ్రద్ధను శ్రవ్యకావ్య వస్తువునందు చూపరైరి. భరతుని మతమున కావ్య మన దశరూపాత్మకమే. (కావ్యంహి - దశరూపాత్మకమేవ). కావుననే అతడు రూపకవస్తువును రూపక రసమును గురించియే చర్చించెను. కాని శ్రవ్యకావ్యవస్తువును, శ్రవ్యకావ్యరసమును గురించి చర్చింపడయ్యెను. ధ్వనికారుడే ప్రప్రథమమున రూపక

మునకు వలెనే శ్రవ్యకావ్యమునకును రసమే ప్రధానమనియు, దానననే రమణీయత్వము కలుగుననియు నిర్వచించెను.”

(కావ్యాలంకార సంగ్రహము-పుట 239)

అని వివరించి యున్నారు. ఉదాహరణమునకు రఘువంశమును తీసికొందము. దానియందు 19 సర్గలున్నవి. ఏకవంశ (సూర్యవంశ) భవులైన దిలీప, రఘు, అజ, దశరథ రామాది నాయకులు పెక్కు లున్నారు. పెక్కు రసములు అంగములు కాగా కడకు శాంతమున గ్రంథము పర్యవసించినది. ఇతివృత్తము ఇతిహాస (ఆదికావ్య) ఉద్భవము. సంధ్యాదికములైన వర్ణనలు ఆ యా సందర్భములలో కూర్పబడినవి. ఇతివృత్త (గ్రంథ) నామము రఘువంశము. అట్లే శిశుపాల వధ, కిరాతార్జునీయముల నన్వయించుకొనవచ్చును. వానియందు వీరమే ప్రధాన రసము. నైషధకావ్యమునందు మాత్రము ఏకనాయుకా శ్రయమైన ఇతివృత్తయు, రసము శృంగారము.

సంస్కృత రామాయణమున బాలకాండమునందును, మఱి కొన్ని చోట్లను పురాణమునకై చెప్పిన లక్షణ పంచకములోని కొన్ని నియమములు వర్తించుచున్నవి. కావున అది పురాణశబ్ద వాచ్యముగా కొంతవరకు చెప్పుకొనుటకు వీలున్నది. ఇక మన తెలుగు రామాభ్యుదయమున నున్న ఉపాఖ్యానముల వంటివి ఎన్నియో తెలుగుసేతయందు కానరావు. చాల ఘట్టములు పూర్తిగా తొలగించియు, కొన్ని భాగములు పూర్తిగ సంక్షేపించియు, మూలమున సూచన ప్రాయముగానున్న కొన్ని సందర్భములకు రసస్ఫూర్తికై సుదీర్ఘముగా పెంచియు మూలమున లేకున్నను కొన్నింటిని ఉత్తరోత్తర కథకు ఉత్కర్ష కలిగించుటకు కల్పించియు, మహారణ్యమును సంస్కరించి రమణీయోద్యాన

ముగా మార్చివేసిన ఆరామపాలకునివలె, మన అయ్యలరాజు రామభద్రయ్య తన రామాభ్యుదయకావ్యమునందు వాల్మీకి ప్రోక్తమైన శ్రీరామచంద్రుని కథను దశరూపకములోని

"యత్స్యాదనుచితం వస్తునాయకస్య రసస్యవా।
అవశ్యం తత్పరిత్యాజ్యం అన్యథా వా ప్రకల్పయేత్ ॥"
(3-24, 25)

అను ఆదేశమును పాటించి కావ్యోచితముగా తీర్చిదిద్దియున్నాడు. రామభద్రయ్య మనుచరిత్రాదులైన తెలుగు ప్రబంధములను చూచినవాడౌట ఆ ప్రబంధములందు పాటింపబడిన లక్షణములతో సంస్కృత కావ్యలక్షణములను జోడించి తన గ్రంథమును అటు పూర్తిగా సంస్కృతకావ్యము వంటిదికాక, ఇటు తెలుగు ప్రబంధము వంటిది కాక రెండింటి మేలుకలయికగ ఉత్పన్నమగునట్లు చేసియున్నాడు.

రామభద్రయ్యకు సమకాలములో వెలసిన తెలుగు ప్రబంధముల సామాన్య లక్షణములను తెలిసికొన్నచో రామాభ్యుదయ మెంతవరకు తెలుగు ప్రబంధములకు దగ్గరగా రాగలదో ఊహింపవచ్చును. తెలుగు ప్రబంధముల పుట్టుకను గూర్చియు, వాని స్వరూప స్వభావములను గూర్చియు కూలంకషముగా చర్చించి కొన్ని నియమములను రసిక ప్రపంచమున కందజేసినవారు కీ. శే. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారే. ప్రబంధ స్వరూపమును గూర్చి మరెవ్వరు చర్చించి యుండినను వారందరకు ఒరవడి శ్రీ లక్ష్మీకాంతముగారి రచనయే అనుటలో సందేహముండ నక్కరలేదు.

గ్రీకు నాటకములు ప్రాచీనములుకాగా, వాని ఆధారమున కొన్ని దేశకాల పాత్రానుగుణములైన మార్పులతో షేక్స్పియరు

మున్నగు కవులు ఆంగ్లమున నూతన నాటకములను సృష్టించినట్లు, సంస్కృతమున ఆదికావ్యమగు వాల్మీకి రామాయణము, భరత మహర్షి నాట్యశాస్త్రము 18-వ అధ్యాయమందలి దశరూపక నిర్వచనములు ఆధారములుగా సంస్కృతమున శ్రవ్యకావ్యము లైన రఘువంశాది మహాకావ్యములు, సృష్టింపబడినట్లు, తెలుగున పెద్దనార్యునిచే దేశీయమైన "ప్రబంధ" మను కావ్యజాతి సృష్టింప బడినది. భరతుడు శ్రవ్యకావ్యమును గూర్చి చెప్పకున్నను, అభి నవగుప్తపాదాచార్యులు తన నాట్యశాస్త్ర వ్యాఖ్యానమున దృశ్యకావ్యమునకు భరతుడు చెప్పిన లక్షణముల నన్నింటిని శ్రవ్య కావ్యమున కెట్లన్వయింపనగునో వివరించి యున్నాడు. తరువాతి ఆలంకారికు లందరును – (విశ్వనాథకవిరాజాదులు) శ్రవ్యకావ్య లక్షణములను తమతమ అలంకార గ్రంథములందు నిబంధించిరి. వానిని ఇదివరకే పేర్కొని యున్నాను.

పెద్దనాదులు సృష్టించిన కావ్యజాతిని ప్రబంధమని వ్యవహ రించుచున్నాము. దీనియందు వస్తువు (కథ) ఉనికియే కాక తద్దేహ బంధమున కావశ్యకమగు నితర సంధి సామగ్రియు, ఆ దేహము నకు సౌందర్యాపాదకములైన రసదవయవములు నున్నపుడది ప్రబంధమగును. కావ్యమునందలి ప్రత్యవయవమునకును, వస్తు వునకును తత్సౌందర్య సంపాదనమునకును, ప్రకృష్టమైన బంధ ముండును. కనుక ఈ శిల్పమూర్తికి ప్రబంధమను పేరుకలిగినది. ఇది కావ్యశిల్పములో శిఖరప్రాయమైన నిర్మాణము.

విశ్వనాథ కవిరాజ నిర్వచనము ననుసరించి కావ్యమను నది "అష్టాదశ వర్ణనాభూయిష్ఠమై యుదాత్త వృత్తముగల యొక మహానాయకుని చరిత్ర" మాత్రమే. వర్ణనాభూయిష్ఠమనుటచేత కేవల కథకు ఇతోధిక సౌందర్యాపాదనము, ఉదాత్త వృత్త

మనుటచేత వస్తు గాంభీర్యమును, మహానాయకుని చరిత్రమనుట చేత పాత్ర నిర్మాణ సౌందర్యమును, వారి ముఖ్యాశయములుగా ఊహింపవచ్చును. పురాణేతిహాసములను, ఈ కావ్య జాతినుండి వేరుపరచుచున్నదీ నిర్వచనమే. పురాణేతిహాసములలో ప్రత్యక్ష ధర్మోపదేశము, కవిత్వ నామార్హత లేని శాస్త్రప్రసంగములును, గ్రాహ్యములే యగును. శిల్పదృష్టి కవన్నియు నిస్సారపదార్థములు. పురాణేతిహాసములు మహారణ్యముల వంటివి. ఆ యరణ్యములలో కుసుమ ఫల భరితములైన, లతా గుల్మ వృక్షాదులే గాక, శరీరారోగ్యమునకును, మానసికారోగ్యమునకును, ఇతర జీవితావసరములకును అక్కరకు రాదగిన ఓషధులును, వనస్పతులును పెక్కు లుండవచ్చును. ప్రబంధము లుద్యానవనముల వంటివి. పై లతాగుల్మాదులు, ఓషధులు మున్నగునవి ఉద్యానవనమున అనావశ్యకములేకాక, అవి రసిక విహారమునకు భంజకములుగూడ నగును. ఉద్యానము మానవ నాగరకత సాధించిన కళలలో నొకటియై విహారయోగ్యముగ తీర్చిదిద్దబడిన ఒక సుందరమూర్తి.

ప్రబంధ లక్షణములు గల ఒకటి రెండు గ్రంథములు కృష్ణరాయ యుగమునకు పూర్వమే వెలసినను వానియందు సమగ్రములగు ప్రబంధ లక్షణములు లేవు. రాయల యుగముననే ఈ ప్రబంధవాణికి సమగ్ర లక్షణ సిద్ధియు, బహుళ ప్రచారమును కలిగినవనియు చెప్పవచ్చును. సంస్కృతమునను తెలుగునను, కూడ నైషధ కావ్యము సర్వాంగసుందరమైన, సమగ్ర లక్షణ సమన్వితమైన, అపూర్వ ప్రబంధము. కాని అది కేవలాంధ్ర ప్రబంధ మనలేము కదా! పురాణేతిహాసములనుండి ఆంధ్ర ప్రబం



ధము మూడు ముఖ్యవిషయములందు సర్వథా స్వతంత్రమైనది. అవియే ఈ ప్రబంధములను వానినుండి వేరుచేయునవి – అవి –

(1) ఆంధ్ర ప్రబంధము పూర్వపు రామాయణములలోని ఏదేనొక ఉపాఖ్యానమును నిమిత్తమాత్రముగ గైకొని ప్రపంచించిన సుందరమూర్తి. ఆ యుపాఖ్యానద్రవ్యము కేవలము అస్థిపంజరము వంటిది. ప్రబంధము మాంసలము, సర్వావయవ సౌష్ఠవమునగు జీవన్మూర్తి. ఆ పురాణగాథ పాత్రములనుబట్టి గాని, వస్తువును బట్టిగాని, లోపభూయిష్ఠమైనపుడు ఆ లోపమును సంస్కరించి ప్రబంధమున నా పాత్రమును నిర్దుష్టమొనర్చుట.

(2) పురాణాదులందు రసనియతి లేదు. కావ్యములందును శృంగార వీరములలో నేదేనొకటి అంగిరసముగా నుండవలెనని యున్నది. కాని ఆంధ్ర ప్రబంధము లన్నింటను శృంగారమే ప్రధానరసము

(3) పురాణేతిహాసములందు శైలి పురాణోచితమే. కాని ఆంధ్ర ప్రబంధములందు రసముతోపాటు ఆలంకారికమైన శైలి ప్రాణము.

ఈ లక్షణముల నన్నింటిని మేళగించి చూచిన ఈ ఆంధ్ర ప్రబంధమునకు లక్షణ మిట్లు నిర్వచింపవచ్చును.

"కథైక్యము, పాత్ర చిత్రణము కలిగి, అష్టాదశవర్ణనల వలన శోభజెంది శృంగార రసప్రధానమై అర్థాతిశాయియైన శబ్దరచనతోగూడి ఆలంకారిక, సాంకేతికములకు విధేయమయి, అనతి విస్తృతమైన ఇతివృత్తము గలిగి, భాషాంతరీకరణమునకు భిన్నమైన స్వతంత్ర రచన ఈ ప్రబంధము."

ఇదివరకే చెప్పినట్లు రామాభ్యుదయము సంస్కృతము నందలి మహాకావ్య లక్షణములను కొన్నింటిని నిలుపుకొని తెలుగు

ప్రబంధమునందలి పెక్కు లక్షణములను పూర్తిగ కలిగియున్న మిశ్రమ రచన. అయినను ఆ యుగమునందలి ముఖ్య కవుల రచనల వలెనే దీనినికూడ ప్రబంధ మనవచ్చును. ప్రబంధమున పురాణములలోనున్న ఏదే నొక ఇతివృత్తము నిమిత్త మాత్రముగ నుండును. మార్కండేయపురాణములోని ప్రవరుని గాథ మనుచరిత్రమునను, మహాభారతమునందలి ఉపరిచరవసువు కథ వసుచరిత్రమునందును, నిమిత్తమాత్రముగ గైకొనబడినవి. కాని రామాభ్యుదయమున వాల్మీకి రామాయణ గాథ నిమిత్త మాత్రముగా కాక పూర్ణకథా శరీరముగా గైకొనబడినది. కేవలము పైపై అలంకారములనే రామభద్రుడు సంతరించి పెట్టియున్నాడు. అట్లే రసవిషయము గూడ. ప్రబంధమున శృంగారమే ప్రధాన రసముగా నుండవలయును. కాని సంస్కృత కావ్యములలో వలె రామాభ్యుదయమందు వీరరసమునకే ప్రాధాన్యమీయబడినది. ప్రబంధము నిర్మించుచున్నాను అను స్మరణము కవికి బలవత్తరమగుటచే కాబోలు దివ్యదంపతులైన సీతారాముల సంయోగ శృంగారమును ప్రాకృత నాయికానాయకుల శృంగారము స్థాయికి తెచ్చి వర్ణించినాడు. దానికి అంగములుగా దశరథుని జీవితములో వనవిహార, సరోవరవిహార, పుష్పాపచయ, జలక్రీడాదులను, వసంతఋతువును వర్ణించినాడు. శ్రీరాముని వియోగ (విరహ) శృంగారమును తరువాత ఆశ్వాసములలో అచ్చటచ్చట వర్ణించినాడు. తక్కిన అష్టాదశ వర్ణనలు, ఆలంకారికశైలి, అర్థాతిశాయి శబ్దరచన కేవల తెలుగు ప్రబంధములలో నున్నట్లే ఉన్నది. కావున రామాభ్యుదయమును మనము ప్రబంధమనియే వ్యవహరింతము.

5

# రచనా ప్రణాళిక



వాల్మీకి రామాయణములో మొదటి ఆరుకాండములలోను సర్గముల సంఖ్య 537. వీనిలోని శ్లోకసంఖ్య 20, 855. అధిక పాఠ శ్లోకసంఖ్య 500 తో కలిపి మొత్తము శ్లోకసంఖ్య 21,355. ఇంత విస్తృతి గలిగిన ఈ గ్రంథమును రామభద్రయ్య ఎనిమిది ఆశ్వాసములలో 1686 పద్యములలో (ఇందు పీఠికలోని పద్యములు 117, ఆశ్వాసాంత పద్యములు 22 చేరలేదు) ముగించెను. అనగా శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు చెప్పినట్లు ఈ గ్రంథము సంక్షిప్త రామాయణము అనదగిన ప్రబంధము. పరిమాణమునందు అన్ని కాండములు సమానముగా సంక్షేపింపబడుట కాని, విస్తరింపబడుట కాని జరుగలేదు. తక్కిన కాండములందలి వస్తు విస్తృతితో పోల్చినప్పుడు బాలకాండ కథ మిక్కిలి పెంచబడినది. అయోధ్యకాండ కథ పూర్తిగా కుదింపబడినది. ఈ క్రింది వివరములు చూడుడు—

| వాల్మీకి రామాయణము | రామాభ్యుదయము | పద్య సంఖ్య |
|---|---|---|
| 1. బాలకాండము | | |
| 77 సర్గలు, 2280 శ్లోకములు | మొదటి నాలుగాశ్వాసములు | 566 |
| 2. అయోధ్యాకాండము | పంచమాశ్వాసము మొదటి నుండి | |
| 119 సర్గలు 4415 శ్లోకములు | 101 వ పద్యము వరకు | 101 |

| | | |
|---|---|---|
| 3. ఆరణ్యకాండము<br>75 సర్గలు 2732 శ్లోకములు | పంచమా శ్వాసము 102 పద్యము నుండి 253 పద్యము వరకు | 152 |
| 4. కిష్కింధాకాండము<br>67 సర్గలు, 2432 శ్లోకములు | పంచమా శ్వాసము కడపటి 74 పద్యములు, షష్ఠాశ్వాసము మొదటి 87 పద్యములు | 161 |
| 5. సుందరకాండము<br>68 సర్గలు, 3006 శ్లోకములు | షష్ఠా శ్వాసము 88 వ పద్యము నుండి 256 వ పద్యము వరకు. అనగా కడపటి 169. పద్యములు సప్తమా శ్వాసము మొదటి 20 పద్యములు | 189 |
| 6. యుద్ధకాండము<br>131 సర్గలు, 5990 శ్లోకములు | సప్తమా శ్వాసము 21 పద్యము మొదలు 289 వ పద్యము వరకు అనగా ఆశ్వాసాంతమునకు, అష్టమా శ్వాసము పూర్తిగ 248 పద్యములు. | 517 |
| | | 1686 |

అధిక శ్లోకములు 500 చేరినవి.

అయోధ్యాకాండ కథ కరుణరస ప్రధానమైనదని కాబోలును ఆ భాగమును రామభద్రయ్య మిక్కిలి సంక్షే పించినాడు.

బాలకాండ కథలో మూలమునందలి చాల భాగములను వదలివేసినాడు. అవి యన్నియును పురాణములలో ఉండదగినవే కాని ప్రబంధమున ఉండదగినవి కావు. నడుమ నడుమ ప్రాసంగి కముగా వచ్చిన కథలెన్నియో ఉత్తరోత్తర కథకు పోషకములు కానప్పుడు వానిని తొలగించుటయో రసస్ఫూర్తికై ఔచిత్య

పోషణమునకై అన్యథా ప్రకల్పనము చేయుటయో కవిచేయు ప్రయత్నములలో ముఖ్యమైనవి. అట్లయ్యును తక్కిన కాండము లన్నిటికంటె కూడ మూలముతో పోల్చినపుడు రామాభ్యుదయ మున బాలకాండ కథ బహువిస్తృతిగల్గియున్నది. మూలమున సూచనగా వున్న వానిని మిక్కిలిగా ప్రపంచించియో ఉత్తరోత్తర కథకు ఉత్కర్ష కలిగించుటకై కొన్నింటిని సృష్టించియో మన రామభద్రయ్య బాలకాండ పరిమాణమును గొప్పగ పెంచి యున్నాడు.

# 6

## బాలకాండము



రామభద్రయ్య వాల్మీకి రామాయణానుసారిగా రామాభ్యుదయమును రచించెనని తెలిసికొన్నాము. ప్రబంధత్వ సంపాదనమునకై ప్రతికాండమునందలి కథను కొంత వదలియో, కొంత సంస్కరించియో, కొంత మార్పు చేసియో, అందులేనిది కొంత చేర్చియో, తన ఆశయమును నెరవేర్చుకొన్నాడు. మొదట బాల కాండ కథను గైకొందము. ఇందు పెక్కు సర్గముల యందలి కథను వదలివేసి నడుమ నడుమ మూలమున లేని క్రొత్త విషయములను చేర్చియున్నాడు. వానినిప్పుడు వరుసగా పరిశీలింతము.

(1) మూలమునందలి మొదటి నాలుగు సర్గములలో వాల్మీకి నారదుల సంభాషణము, రామాయణ సంగ్రహము, బ్రహ్మ వాల్మీకికి ప్రత్యక్షమై రామాయణమును రచింప నాజ్ఞాపించి యతనికి కొన్ని దివ్యశక్తుల నొసగుట, నిషాదుడు క్రౌంచ పక్షిని వధించిన విధము, కుశలవులు రామాయణగానము గావించుట మున్నగు విషయము లున్నవి. అవి ఏవియు రామాభ్యుదయమున లేవు. అట్లు లేకపోపుట యొక లోపము కాదు.

(2) ఐదు, ఆరు సర్గలలో అయోధ్యానగర వర్ణనము కలదు. దశరథుని పాలనమునందున్న ప్రజలందరు సద్గుణ సంపన్నులు, ఆరోగ్యవంతులు, విద్యాభిరతులు, ఋజువర్తనులు,

అను విషయము మూలమున వర్ణింపబడినది. ఆ వివరములు అను వాదమున లేవు. నగరవర్ణనము నందలి తక్కిన విషయములు కూడ మూలానుసారిగా కాక, స్వకపోలకల్పనములతో రామభద్రయ్య ప్రబంధధోరణిలో వర్ణించినాడు. ఆ వర్ణనము ఆముక్తమాల్యద, వసుచరిత్రము మున్నగు ప్రబంధము లందలి నగర వర్ణనలను పోలినదే కాని, ఆర్షపద్ధతిని రచింపబడినది కాదు.

—రామాభ్యుదయము I 1 నుండి 37 పద్యములు

(3) ఏడవ సర్గలో దశరథుని ఎనిమిదిమంది మంత్రుల నామములే కాక, వారు ఏ ఏ పరిపాలన శాఖలు (Port folios) నిర్వహించుచుండిరో ఆ వివరమంతయు మూలమున నున్నది. అనువాదమున మంత్రుల నామములు మాత్రమున్నవి.

—రామాభ్యుదయము I 38-43 ప. వరకు

4. ఎనిమిదవ సర్గమునందు దశరథుడు పుత్రులు లేనందుకు చింతించుట మాత్రము రామాభ్యుదయమున ద్వితీయాశ్వాసము 62-70 పద్యములలో వర్ణింపబడినది. మూలమునందలి దశరథుడశ్వమేధ మొనర్ప ప్రయత్నించి వసిష్ఠాదులతో సంప్రదించుట, భార్యలతో సహా మఖ దీక్ష గైకొన నిశ్చయించుట రామాభ్యుదయమున వదలబడినవి.

5. తొమ్మిది, పది, పదునొకండు సర్గములలో సూతుడగు సుమంతుడు ఋష్యశృంగుని కథను మున్ను కృతయుగమున సనత్కుమారుడు ఋషులకు చెప్పినట్లును, భవిష్యత్తులో రోమపాదుడు తన దేశమునకు ఋష్యశృంగుని రప్పించుననియు, ఆ ఋష్యశృంగుని దశరథుడు అయోధ్య కాహ్వానించి పుత్రకామేష్టి అతనిచే చేయించుననియు తత్ఫలితముగా దశరథునకు నలువురు

కుమారులు కలుగుదురనియు కలదు. అనువాదమున వసిష్ఠాదులు ఋష్యశృంగునిచే పుత్రకామేష్టి జరిపిన పుత్రప్రాప్తి యగునని, దశరథునకు బోధించి, ఋష్యశృంగుని తెచ్చుటకు తగు ప్రయత్నము చేయ నతని ప్రేరేపించినట్లున్నది. రామాభ్యుదయమున దశరథుడే వేశ్యలను బంపి ఋష్యశృంగుని అయోధ్యకు రప్పించి నట్లును దారిలో రోమపాదుని రాజ్యమున కొంతకాలము నిలచి అచ్చట ఋష్యశృంగుడు శాంతను వివాహామాడినట్లును మార్చ బడినది. ఋష్యశృంగ ఆగమన ఘట్టమున వేశ్యల శృంగార చేష్టలు అతివేలముగ వర్ణింపబడినవి. ఇది మార్పేగాని చేర్పు కాదు.

— రామా ॥ 71 నుండి ॥। 12 ప. వరకు

6. పండ్రెండు, పదమూడు, పదునాలుగు సర్గములలో మూలమున అశ్వమేధయాగ వివరములు చాల విశదముగ ఈయ బడినవి. రామాభ్యుదయమున ఆ యాగప్రసక్తియే లేదు.

7. పదునైదు, పదునారవ సర్గములలో 10 వ శ్లోకము వరకు మూలమున దశరథుడు పుత్రకామేష్టి చేయుటయు, అచ్చటకి హావిర్భాగము పుచ్చుకొనుటకై బ్రహ్మాదులగు దేవతలు విచ్చేయుటయు, తత్కాలాగతుడైన విష్ణువుతో రావణుని బాధలు చెప్పుకొని, తన్నివారణోపాయమును ఘటింప ప్రార్థించుటయు, విష్ణువు తాను దశరథునకు పుత్రుడుగా పుట్టునట్లు వాగ్దాన మొనర్చుటయు కలదు. రామాభ్యుదయమున పుత్రికామేష్టి నిర్వహాణ మిక్కిలిగా పెంచబడినది. అలంకారిక రచనకు ప్రాధాన్య మీయబడినది. ఇచ్చట బ్రహ్మాదులు విష్ణువును కలిసికొనుటలో రంగము మార్చ బడినది. వీరందరు క్షీరసాగరశాయి యైన విష్ణువు నొద్దకు వెళ్ళి

విన్నవించుకొన్నట్లు కల్పింపబడినది. ఇదియు మార్పే కాని, చేర్పు కాదు.

—రామా III 13 నుండి 74 ప. వరకు

8. పదునారవ సర్గ 27 వ శ్లోకము నుండి మూలమున పాయస ప్రదాన గాథ ఈ క్రింది విధమున నున్నది.

"కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా
అర్ధా దర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః॥ (27)
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థ కారణాత్।
ప్రదదౌ చావశిష్టార్ధం పాయ సస్యామృతోపమమ్॥ (28)
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం
పృథక్ ......" (29)

అనగా కౌసల్యకు అర్ధమును, మిగిలిన అర్ధములో సగము (మొత్తమున నాల్గవపాలు) సుమిత్రకును, సుమిత్రకీయగా మిగిలిన పాయసములో సగము (మొత్తమున ఎనిమిదవపాలు) కైకేయికిని ఇచ్చి మిగిలినదంతయు మరల సుమిత్రకే యిచ్చినట్లు కలదు. అనగా కౌసల్యకు సగము సుమిత్రకు $\frac{3}{8}$ పాలును, కైకేయికి $\frac{1}{8}$ పాలును ఇచ్చినట్లగును. ఇక రామాభ్యుదయమున పాయస విభాగ మిట్లున్నది.

"అల కోసల కేకయ తన
యల కిడియెం బంచి పాయసాన్నము నీలో
త్పలినీ కుముద్వతీ క
న్యల కన్నెల కరసుధాంశమం దిచ్చుగతిన్ ॥

ఇచ్చిన గని యిరువురుఁ బోర
పొచ్చెము లేకపుడు సవతి పోలతి సుమిత్రన్
మచ్చిక పిలిచి కృపామతి
నిచ్చిరి చెరిసగము తమకు నిడి నందులలోన్''

(రామా-?-78,79)

అనగా కౌసల్యకు, కైకేయికి చెరిపాతికపాలు, సుమిత్రకుమాత్రము రెండు పాతికలు చేరినట్లైనది. ఈ పాయస విభాగ పద్ధతి ఆధ్యాత్మ రామాయణములో నున్నరీతిగ నున్నది. చూడుడు.

''వసిష్ఠ ఋష్యశృంగాభ్యాం అనుజ్ఞాతో దదౌహవిః
కౌసల్యాయైకైకేయ్యై అర్ధమర్ధం ప్రయత్నతః
తతః సుమిత్రా సంప్రాప్తా జగృధ్నుః పౌత్రికంచరుమ్
కౌసల్యాతు స్వభాగార్ధం దదౌ తస్యై ముదాన్వితా
కైకేయీ చ స్వభాగార్ధం దదౌప్రీతి సమన్వితా
ఉపభుజ్య చరుం సర్వాః స్త్రియోగర్భసమన్వితాః''

(బాల - 10,11,12)

దీనినిబట్టి రామభద్రుడు ఈ విధమును ఆధ్యాత్మరామాయణము నుండియే గ్రహించె ననుకొనవలెను. దశరథ కుమారులు నలువురలో సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులు పుత్రు లిరువురైనందున ఆమెకు రెండు పాతికలు పాయసము చెందుట సమంజసమే యని ఈ విషయమున రామభద్రు డాధ్యాత్మరామాయణమునే అనుసరించి యుండును. మిక్కిలి ప్రాచీనులైన కవులుకూడ వాల్మీకి రామాయణమునందలి క్రమమును విసర్జించి వారివారికి తోచిన విధముగ విభిన్న ప్రయోజనములు సాధించుటకై క్రొత్త పద్ధతు లవలంబించుట కలదు. వాల్మీకి రామాయణానుసారిగా శ్రీరామ

లక్ష్మణులు ఏకగర్భ జనితులు కాకున్నను మిక్కిలి సన్నిహితులుగ
కలిసియున్నారు. భరత శత్రుఘ్నులుకూడ ఏకోదరులు కాకున్న
వివాహానంతరము మేనమామయగు యుధాజిత్తు వెంట రా
గృహామునకు దశరథుని చేతనే పంపబడినారు. యుధాజిత్తు భర
శత్రుఘ్నులలో ఒకరికి మాత్రమే మేనమామ. కాని వారిరువు
దాదాపు పండ్రెండు సంవత్సరములు రాజగృహామున నివసించ
టకు సరియైన కారణములు కానరావు. అట్టి భరత శత్రుఘ్ను
సన్నిహితత్వమును సమర్థించుటకే కాబోలు ఆనంద రామాం
ణము సార కాండమున భరత శత్రుఘ్ను లిర్వురు విష్ణుని శం
చక్రముల యంశమున అమడలుగా కైకేయికే పుట్టినట్లు వర్ణింపబ
నది. సుమిత్రకు లక్ష్మణు డొక్కడే కొడుకు. చూడుడు. శ్రీరాము
కౌసల్యకు జనించిన వెంటనే

''తతస్సుమిత్రాపురతః శేషోఽభూద్బాల రూపధృక్
ఆవిర్భూతౌ ద్వాయమళౌ కైకేయ్యాః శంఖచక్రకే
జ్యేష్ఠంరామంతుకౌసల్యాతనయం ప్రాహవై గురుః
సుమిత్రానందనం నామ్నా లక్ష్మణం గురు రబ్రవీత్
తతో భరతశత్రుఘ్ననామనీ ప్రాహవై గురుః
అథవవృధిరే సర్వే లక్ష్మణో రాఘవేణహి
శత్రుఘ్నో భరతేనాపి చకార క్రీడనాదికమ్॥''

ఆనందరామాయణము - సారకాండ
ద్వితీయాధ్యాయము శ్లో - 6-

భరత శత్రుఘ్నులు ఏకగర్భ జనితులు కావుననే వారిరువు
మిక్కిలి సన్నిహితులై తలిదండ్రులను, రాజ్యమును కూడ వీ
చిరకాలము మామల గృహామున ఉండగల్గిరని ఆనంద రామ
యణ కర్త సమర్థనము.

కౌసల్యాదేవి దౌహృద లక్షణములను గూర్చిన వర్ణనము మూలమున లేనేలేదు. కేవలము ముగ్గురు రాణులు గర్భములు ధరించిరనియు, దశరథుడు మిక్కిలి సంతోషించెననియు మాత్రమే కలదు. కాని రామభద్రయ్య కౌసల్యాదేవి గర్భలక్షణములను 21 పద్యములలో వర్ణించెను కేవలము చనుమొనల నల్లదనమును ఆయన ఐదు పద్యములలో వర్ణించెను. ఇదియు ప్రబంధకవి పనియే. కైకేయీ సుమిత్రల వర్ణనము మాత్రము ఒక్కొక్క పద్యముతో సరిపెట్టెను. రామా - ||| 75 - 105 వరకు.

9. 17 వ సర్గము మూలమున శ్రీ విష్ణువు భూలోకములో మానవ రూపమున శ్రీరాముడై జన్మించునపుడు ఆయా దేవతలు తమతమ అంశములతో భూమిపై వానర ఋక్ష వీరులుగా పుట్టునట్లు బ్రహ్మ ఆదేశించెనని వర్ణింపబడినది. కాని, రామభద్రయ్య ఆ ఘట్టమును పూర్తిగా వదలివేసెను. కారణము కేవలము గ్రంథ విస్తరభీతియే కాబోలు!

10. పదునెనిమిదవ సర్గము మూలమున శ్రీరామాదుల జననము జ్యోతిశ్శాస్త్రానుసారులైన శుభముహూర్తములందు జరిగినట్లు—బాలకాండము 18 వ సర్గమున—

"తతశ్చ ద్వాదశేమాసే చైత్రే నావమికే తిథౌ 8

నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్చ సంస్థేషుపంచసు।
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిందునాసహ॥ 9

... ... ... ... ...

కౌసల్యా జనయద్రామం సర్వలక్షణ సంయుతమ్॥ 10

... ... ... ... ...

పుష్యేజాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః
సార్పేజాతౌతు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితేరవౌ॥ 1[illegible]

(8 నుండి 15 శ్లో.

అని శ్రీరాముడు చైత్రశుద్ధ నవమి పునర్వసు నక్షత్రమునంద[illegible]
ఐదు గ్రహములు వాటివాటి ఉచ్ఛస్థానములలో నున్నప్పుడ[illegible]
కర్కాట లగ్నమున బృహస్పతితోసహా చంద్రుడున్నప్పుడు
జన్మించెననియు. భరతుడు పుష్యమీ నక్షత్రమునందు మీన
లగ్నమునను, లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషా నక్షత్రమునంద[illegible]
కర్కాట లగ్నమున మధ్యాహ్న సమయమునందు జనియించి
రనియు వర్ణింపబడినది. కాని రామభద్రయ్య "అతి శుభవేళ

రామునభిరాము కోసలేంద్రజయు భరతు
నిద్ధనయలాభరతు కేకయీ పురంధ్రి
అతుల బుధమైత్రి సౌమిత్రి ననఘునిఘ్ను
డైన శత్రుఘ్ననా సుమిత్రయును గనిరి"

(3-115)

అని ఒక్క పద్యమున నలువుర జననమును చెప్పియున్నాడు. కాని
రామభద్రయ్య కుమారుల జనన తిధి నక్షత్ర లగ్నములలో నొక
దానినికూడ పేర్కొనలేదు. రాజపుత్రుల జాతకర్మాదులు, విద్యా
భ్యాసముమున్నగునవన్నియు మూలమున మిక్కిలి సంక్షేపములుగా
గలవు. రామభద్రయ్య ఈ వివరములను కొంచె మెక్కువగా నిచ్చి
యున్నాడు. (రామా III 106 నుండి IV 4. ప. వరకు)

11. పందొమ్మిదినుండి ఇరువది యొకటవ సర్గమువరకు
మూలమున శ్రీరామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంట పంపుటకు
వసిష్ఠుని హితపూర్వక ధైర్యవచనములే ప్రధానముగా వర్ణింప

బడినవి. కాని రామాభ్యుదయమున వశిష్ఠ పాత్ర ప్రవేశము లేకయే కేవల విశ్వామిత్ర ప్రార్థనయే ఆధారముగా దశరథుడు రామలక్ష్మణుల నతనివెంట పంపినట్లున్నది.

...... (రామా IV 5-15 ప.)

12. ఇరువది రెండవ సర్గము మూలమున దశరథుని వీడ్కొని రామలక్ష్మణులతో వెడలిపోవునపుడు దారిలో విశ్వామిత్రుడు శ్రీరామునకు ఆకలిదప్పులు మున్నగునవి లేకుండజేయు బల, అతిబల యను రెండు మంత్రములను బోధించినట్లున్నది.

13. ఇరువది మూడు, ఇరువది నాలుగు, ఇరువది యైదు సర్గములలో మన్మథుడనంగుడైన కథయు, ఆ ప్రదేశము అంగ దేశ నామమున ప్రసిద్ధమగుటయు, గంగా సరయూ నదుల సంగమ స్థాన మాహాత్మ్యమును వర్ణింపబడినవి. వెంటనే మలద, కరూశ దేశముల వృత్తాంతము తాటక జీవిత వృత్తముకూడ వివరింప బడినవి. ఇవి యెవ్వియును కడకు తాటక జీవితవృత్తమైనను రామాభ్యుదయమున లేవు.

14. ఇరువది యారవసర్గమునగల తాటకా సంహార ఘట్టము మూలమునకంటె రామాభ్యుదయమున పెంచబడినది.

(రామా IV 30-46 పద్యములు)

15. ఇరువది యేడవ, ఇరువది యెనిమిదవ సర్గములందు విశ్వామిత్రుడు అనేకములైన దివ్యాస్త్రములను ప్రయోగోప సంహారములతో శ్రీరామునకు బోధించినట్లున్నది. కాని రామాభ్యుదయమున 22వ సర్గమున చెప్పిన బల, అతిబలలతో సహా ఈదివ్యాస్త్రములన్నియు తాటకాసంహారమునకుమున్నే ఇచ్చి నట్లు ఈ క్రింది—

''గాసిల నీక రాసుతుల
కౌశికు డాకలి నీరువట్టునా
యాసము లేని మంత్రము ర
ణాభయవృత్తి యమోఘ బాణ బా
ణాసన సాధనంబులు సు
రాసుర దుర్జయ శౌర్యమున్ జయ
శ్రీ సహితోదయంబు కృప
చేసి కృతార్థుల జేసెనంతయున్ ''

(4.28)

అను ఒక్క పద్యమున మిక్కిలి సంక్షేపముగా జెప్పియున్నాడు. ముఖ్యములైన బల, అతిబల నామమంత్రములనైనను ఇందు పేర్కొనలేదు.

—(రామా iV - 16-29 ప)

16. ఇరువది తొమ్మిదవ సర్గమునందు అదితికశ్యపుల తపః ఫలముగా విష్ణువు వామనుడుగా అవతరించి బలిని నిగ్రహించు టయు, ఆ వామనుని ఆశ్రమమే అప్పటి సిద్ధాశ్రమమై అదియే నేడు విశ్వామిత్రునకు ఆశ్రమభూమి యగుటయు, తాటక వధా నంతరము మారీచ సుబాహు నిరాసమునకు పూర్వమున నే వర్ణించినట్లు మూలమునగలదు, అది రామాభ్యుదయమున పూర్తిగా వదలివేయబడినది.

17. ముప్పదవ సర్గమునందు గల మారీచ సుబాహు నిరాసము సంక్షేమముగా వివరింపబడినది.

— (రామా iV 47-53

18. ముప్పది యొకటవ సర్గమునందు మిథిలా వృత్తాంతము జనకుని యాగప్రశంస మూలమున కలవు. ఆ యాగ సందర్శనార్థము విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటగొని మిథిలకు బయలుదేరును. ఇచ్చటనే శివధనుః ప్రశంస కలదు. ఇవి యెవ్వియును రామాభ్యుదయమున లేవు. ఒక్క పద్యమున మాత్రము ఆ సూచన కలదు.

19 ముప్పది రెండు, ముప్పది మూడు, ముప్పది నాలుగు సర్గములలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో మిథిలా నగరమునకు పోవుదారిలో పెక్కుకథలు ప్రసక్తానుప్రసక్తముగ వారికి చెప్పినట్లున్నది. మొదట కుశికవంశమునకు మూలపురుషుడును, ప్రజాపతి తనయుడును అగు కుశుని నలువురు పుత్రులలో ప్రథముడగు కుశనాభుని చరిత్రము మిక్కిలి వివరముగా వర్ణింపబడినది. ఈ వివరములు రామాభ్యుదయమున లేవు.

20. ముప్పదియైదు, ముప్పదియారు, ముప్పదేడు సర్గములలో మూలమున క్రమముగా ప్రశ్నోత్తర రూపమున శ్రీరామునకు విశ్వామిత్రునకు జరిగిన సంభాషణ ఫలితముగా గంగానది త్రిపథగయైన వృత్తాంతము, పార్వతీదేవికథ, కుమార జననగాథ, మున్నగునవి కలవు. ఇవి కూడ రామాభ్యుదయమున లేవు.

21. ముప్పైయెనిమిది నుండి నలువది నాల్గవ సర్గవరకు మూలమున సగరుడు, అతని అరువది వేవురు పుత్రులగాథ, కపిల మహర్షి కోపాగ్నికి బలియైన సగర పుత్రుల కూర్ధ్వగతి కల్పింప అంశుమంతుడు, భగీరథుడు గంగను భూమికి తెచ్చుటకు చేయు ప్రయత్నముల ఫలము, మిక్కిలి వివరముగా గలవు. అవి యెవ్వియు మన రామభద్రయ్య గ్రహింపలేదు.

22. నలువదిన్నైదు, నలువదియారు, నలువదియేడు సర్గములలో మూలమున సముద్రమథన గాథ, సప్తమారుతముల వ్యుత్పత్తి, ఇక్ష్వాకు పుత్రుడగు విశాలుడు విశాల నగరమును నిర్మించుట మున్నగు కథలు గలవు. ఇవి యెవ్వియు మన రామాభ్యుదయమున సూచనాప్రాయముగనైనను లేవు.

23. నలువది యెనిమిది, నలువది తొమ్మిది సర్గములందు మూలమున గౌతముడు అహల్యను శపించిన విధము

"ఇహ వర్షసహస్రాణి బహూనిత్వం నివత్స్యసి
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వ భూతానా మాశ్రమేఽస్మిన్నివత్స్యసి"
— (బాల 48-29,30)

అను శ్లోకపాదము లందున్నట్లు ఆమెను పాషాణముగా ఉండునట్లు కాక, అదృశ్యగా ఉండునట్లు మాత్రమే గౌతముడు శపించి నట్లున్నది. గౌతముడు ఆశ్రమమున లేని సమయమున ఇంద్రుడు అహల్య పొందు నాశించివచ్చినట్లును, అత డింద్రుడని తెలిసియు, కామాసక్తయగు అహల్య అతనిని తృప్తిపరచినట్లును, తత్ఫలిత ముగాఇంద్రుడు శపింపబడినట్లునుకూడ కలదు. ఇంద్రునకు మేషాం డములు తగిల్చిన గాథయు ఇచటనేయున్నది. అవి యెవ్వియును రామాభ్యుదయమున లేవు. ఇందు శాపవిమోచన గాథ మాత్రమే కలదు. అదియు వెనుకటి గ్రంథము లన్నింటియందు వలె మన రామాభ్యుదయమున గూడ అహల్య శిలారూపమున నున్నట్లే యున్నది. చూడుడు—

"రాచందము గల రాముడు
రాచందము మాన్పె తపసి రాచానకు నో

రాచతురాస్యోపాస్య
శ్రీచతుర పదాంబు జాణురేణు వ్యాప్తిన్"
శిలచిగురుబోడియై యుల్లసిల నొనర్చి
మెత్తిపోయిన గౌతము నిల్లు నిలిపె
నడుగు కెందమ్మి కమ్మ పుప్పొడిన ఇంక
నేమని నుతింప వచ్చు శ్రీరామ మహిమ"

(4-56-57)

ఈ మార్పు అనూచానముగా వచ్చుచున్నదే కాని కేవలము రామభద్రయ్య కల్పించినది మాత్రము కాదు. ఉత్తర దేశమునందలి తులసీ రామాయణాదులలో కూడ ఈ విధమే వర్ణింపబడినది. రామాభ్యుదయమున ఇంద్రాహల్యల ప్రణయముగాని గౌతముని శాపముగాని లేవు. శాపవిమోచనము మాత్రమే కలదు.

**24.** ఏబదియవ సర్గమునుండి అరువది యైదవ సర్గము వరకు మూలమున మిథిలా నగర ప్రాంతముననున్న గౌతమాశ్రమమునందు అహల్యా శాపవిమోచన గాథయైన వెనుక వారందరు మిథిల చేరినపుడు అహల్యా గౌతముల పుత్రుడును, జనక మహారాజ పురోహితుడునునగు శతానందుడు శ్రీరామలక్ష్మణులకు విశ్వామిత్రుని మహాత్వ పూర్ణ చరిత్రమును అతడు బ్రహ్మర్షి యగువరకు వర్ణించుటయు ఆ బ్రహ్మర్షి త్రిశంకువునకు సశరీరముగా స్వర్గమునకు బోవు నవకాశము కల్పించుటయు, అంబరీష యజ్ఞమునకు బలిపశువుగా గొనిపోబడిన మేనల్లుడు శునశ్శేపుని రక్షించుటయు, మేనకా విశ్వామిత్రుల ప్రణయగాథ, విశ్వామిత్రుని తపస్సును చెఱుపవచ్చిన రంభను అతడు పాషాణమగునట్లు శపించుట, మున్నగు కథ లెన్నియో ఉన్నవి. ఇవి యెవ్వియును

రామాభ్యుదయమున లేవు. మిథిలకుపోవు దారిలో విశ్వామిత్రుడు రాఘవులకు చెప్పిన కథల నన్నింటిని సూచింప పద్య మొక్కటి అయోధ్యానగరము వీడిన వెంటనే చెప్పినట్లున్నది.

"గాధేయోక్త పురాతన
గాధా నిరవద్య పద్య గద్య గ్రహణా
సాధారణా నివారణ

మేధానిధులగుచు జనిరి మిత్రకులేంద్రుల్" (4-26

ఇంత చిన్న కందపద్యములో ఆ గాథలన్నియు గతార్థములైనవి.

25. అరువదియారునుండి అరువది తొమ్మిదవ సర్గము వరకు మూలమున జనకుడు విశ్వామిత్రుని, శ్రీరామలక్ష్మణులన పూజించి తాను వారికేమి సేయవలయునో తెలుపగోరును విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులు శివధనుస్సును చూడగోరి చున్నారని చెప్పును. జనకుడా ధనువు చరిత్ర చెప్పుచు దానిని మొదట శివుడు దేవతల కీయగా నా దేవతలు తమ పూర్వ పురుషుడైన దేవరాతున కిచ్చిరని చెప్పును. అయోనిజగా భూమి యందు పుట్టిన సీతాదేవిని వీర్యవంతునకే యిత్తునని తాను ప్రకటింపగా, రాజులు వచ్చి శివధనుస్సును ఎక్కిడలేక తనపై కోపించి దండెత్తి వచ్చిరనియు వారినందరను తా నోడించెననియు చెప్పును ఈ ధనువును శ్రీరాముడు ఎక్కిడెనేని సీతాదేవిని అతనికే యిచ్చెదను అని చెప్పును. విశ్వామిత్రుని కోరికపై శివ ధనుస్సును వేలకొలది బలవంతులచే లాగబడు బండిపైనిది తెప్పించిరి శ్రీరాముడా ధనుస్సును అవలీలగా మోపెట్టగా నది విరుగును తన ప్రతిన మేరకు జనకుడు సీతాదేవిని శ్రీరామున కీయ నిశ్చయించి దశరథు నాహ్వానింప అయోధ్యకు తన మంత్రులను పంపును, ఇచ్చట మూలమున—

భవతోఽనుమతే బ్రహ్మన్ శీఘ్రంగచ్ఛంతు మంత్రిణః
మమ కౌశిక భద్రంతే అయోధ్యాంత్వరితారథైః
రాజానం ప్రశ్రితైర్వాక్యైరాన యంతుపురం మమ
—(బాల - 67 – 23,24)

అని యెంతో వినయముతో జనకుడే తన మంత్రులను దశరథు నాహ్వానింప బంపినట్లుండగా రామాభ్యుదయమున

"పిలిపింపు మితని తలిదం
డ్రుల తమ్ముల నన మునీశ్వరుడునట్లన వా
రల రాబనిచెం పురిజన
మలరగ నటు లగ్న నిశ్చయము గావించెన్."(4–98)

అని జనకుడు పలికిన విధము దశరథాదులను బిలువనంపుమని విశ్వామిత్రుని ఆజ్ఞాపించినట్లున్నది. ఆ మునియు 'అట్లే' యని వినీతుడై వారల తానే పిలిపించినట్లు రామభద్రయ్య వ్రాసి యున్నాడు. ఈ విధము జనకుని యొక్కయు, విశ్వామిత్రుని యొక్కయు శీలమున కపకర్ష ముగ నున్నది. తరువాత దశరథుడు పురోహితులతో, రాణులతో మిథిలకు వచ్చును. జనకుడు వారం దరిను పూజించి కుశల మడిగి వివాహ ప్రయత్నములు చేయును.

—(రామా. చతుర్థా 78 –104 పద్య)

20. డెబ్బదియవ సర్గము మూలమున జనకుడు సాంకాశ్య యను నగరమును పాలించుచున్న తన తమ్ముడైన కుశధ్వజుని పిలిచికొనివచ్చుటకై వేగరులైన కొందరు దూతలను గుఱ్ఱములపై బంపును. కుశధ్వజుడు కూడ సీతా వివాహ దర్శనార్థము తొంద రగా మిథిలానగరమునకు వచ్చిచేరును. సుదామను డను మంత్రిని పంపి దశరథునికూడ జనకుడు సభకు ఆహ్వానించును. దశరథుని

కోరికపై వశిష్ఠుడు ఇక్ష్వాకు రాజుల వంశ చరిత్రమును సూర్యుని నుండి దశరథుడు శ్రీరామాదులు గలుగువరకు గల చరిత్రమును సాకల్యముగ చెప్పును. ఇవెవ్వియు రామాభ్యుదయమున లేవు.

27. డెబ్బది యొకటవ సర్గము మూలమున విదేహరాజుల చరిత్రయు, జనకుడు చాల వివరముగా తన తమ్ముడైన కుశధ్వజుని చరిత్ర చెప్పుటయు గలవు. రామాభ్యుదయమున నవి యెవ్వియు లేవు.

28. డెబ్బది రెండు, డెబ్బది మూడు సర్గములలో మూలమున విశ్వామిత్రుడు ఇక్ష్వాకు వంశము, విదేహ వంశము వియ్యమందుట ప్రశస్తమైన విషయమని చెప్పును. ఒక్క పగటనే శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు సీతోర్మిళా మాండవీ శ్రుత కీర్తులతో వివాహము జరుప నిశ్చయింతురు. అచ్చటకు భరతుని మేనమామ యుధాజిత్తుకూడ వచ్చును. వశిష్ఠ మహర్షియే వివాహములకు పౌరోహిత్యము వహించునట్లు జనకుడు ప్రార్థించును. వరుసగా నాలుగు వివాహములు జరుగును. ఇచ్చట మూలమున "శ్రీరామలక్ష్మణులకు నీ పుత్రికలైన సీతోర్మిళలు తగుదు" రని విశ్వామిత్రుడు జనకునితో చెప్పి వెంటనే

> "భ్రాతా యవీయాన్ ధర్మజ్ఞః ఏష రాజాకుశధ్వజః
> అస్య ధర్మాత్మనోరాజన్ రూపేణా ప్రతిమంభువి (4)
> సుతాద్వయం నరశ్రేష్ఠ పత్న్యర్థం వరయామహే
> భరతస్య, కుమారస్య శత్రుఘ్నస్య చధీమతః" (5)
>
> (బాల - 72 - 4, 5)

అని స్పష్టముగా కుశధ్వజుని పుత్రికలైన మాండవీ శ్రుతకీర్తులను, భరత శత్రుఘ్నులకు వధువులుగా నిర్ణయించి నట్లున్నది. కాని

రామాభ్యుదయమున కుశధ్వజుని పేరైనను లేకపోగా అతని పుత్రిక లైన మాండవీ శ్రుతికీర్తులను భరత శత్రుఘ్నులకు కన్యాదానము సేయుసమయమునగూడ కుశధ్వజుని పేరు రానీయక సీతోర్మిళలతో పాటు వారిద్దరుకూడ జనకుని సంతానమేమో యను భ్రమను కలిగించునట్లు కల్పింపబడినది. ఇది సంక్షేపములో సంక్షేపము. దశరథ మహారాజు కుమారులు సమావర్తనోత్సవము నుద్దేశించి కొన్ని లక్షల గోవులను, సమృద్ధిగా ధనమును వేదవిదులగు బ్రాహ్మణులకు దానము చేయును. ఇచ్చటనే మూలమున యుధాజిత్తు, తన తండ్రి కేకయ మహారాజు తన దౌహిత్రుడైన భరతుని జూడగోరుచున్నాడనియు చెప్పును. దానికి దశరథుడు సమ్మతించును. వశిష్ఠుడు పురోహితుడుగా, విశ్వామిత్రుడు, శతానందుడు సాక్షులుగా సాంగోపాంగముగా మిక్కిలి ఆర్ష పద్ధతిలో నాలుగు వివాహములు జరుపబడినవి. రామాభ్యుదయమున నీ వివాహములు దేశీయ పద్ధతిలో జరిగినవి.

(రామా. చతుర్థ : పద్య 105 - 130)

29. డెబ్బది నాలుగు, డెబ్బది యైదు, డెబ్బది యారు సర్గములలో మూలమున పరశురామాగమన విషయము గలదు. అదియంతయు 16 పద్యములలో రామభద్రయ్య సంక్షేపించి యున్నాడు. దశరథాదులు మిథిలను వీడి అయోధ్యా నగరాభిముఖులై నడచునపుడు కలిగినట్లు మూలమున వర్ణింపబడిన శుభాశుభ నిమిత్తములు, ఉత్పాతములు ప్రబంధ కథాగతికంతపోషకములు కావు. వాని సూచన కనుగుణమైన సంఘర్షణ మెద్దియు జరుగలేదు. మరియు శివధనువు, విష్ణుధనువుల ఉత్పత్తియు, వాని కారణముగా బ్రహ్మచే శివునకు విష్ణువునకు కలహము కల్పింప బడుటయు, శివధనువు జనకునొద్దకు విష్ణుధనువు పరశురాము

నొద్దకు జేగుటయు, మున్నగు వివరము లెవ్వియు రామాభ్యుదయ మున లేవు అవి ఉత్తరోత్తర కథ కెంతమాత్రము తోడ్పడక పోవుటయే కాక ఆ గ్రంథము అనవసర విస్తృతికి కారణమగును. కావున అవి నిజముగా పరిహార్యములే. తక్కిన విషయము లన్నియు మూలమున నున్నవి సంక్షేపముగనే యైనను రామా భ్యుదయమున గలవు.

(రామాభ్యు : చతుర్థ. పద్య 131 - 146)

30. డెబ్బది ఏడవ సర్గమున మూలమున దశరథుడు అయోధ్యా పునరాగమన వృత్తాంతమును, భరత శత్రుఘ్నులు మాతుల గృహమున కేగుటయు వర్ణింపబడినవి. రామాభ్యుదయ మున ఈ ఘట్టము మిక్కిలిగా పెంచబడినది మూలమున శృంగా రము కేవలము సూచనప్రాయముగా నుండగా రామభద్రుడు దానిని వేలము వెఱ్ఱిగా వర్ణించి యున్నాడు. అది కేవలము గ్రంథ మునకు ప్రబంధత్వ రూపము నిచ్చుటకే పనికివచ్చినది. ప్రబంధ మున శృంగారరసమే కదా ప్రధాన రసము? శృంగార నైషధ, వసుచరిత్రముల యందలి వివిధ ఘట్టము లందున్న వర్ణనముల ననుకరించిన విధము తెలియుచున్నది. మూలమున ఏ మాత్రము శృంగారవాసన లేని ఈ క్రింది

"పతాకాధ్వజినీంరమ్యాం తూర్యోద్ఘుష్టనినాదితామ్ ।
సిక్తరాజపథాం రమ్యాం ప్రకీర్ణకుసుమోత్కరామ్ ॥
రాజప్రవేశసుముఖైః పౌరైః మంగళవాదిభిః ।
సంపూర్ణాం ప్రావిశద్రాజ జనౌఘైస్సమలంకృతామ్"

(బాల-77.6,7)

అను నాలుగు పాదములలో వర్ణించిన అయోధ్యానగర ప్రవేశ ఘట్టమును రాజమార్గమున నడచు శ్రీరాముని పౌరస్త్రీలు

శృంగార విలాస విభ్రమ చేష్టలతో ఒడలిపైనున్న వలువ జారుట గాని, ఆభరణములు స్థానభ్రంశము నొందుట గాని గమనింపనంత తమకముతో దర్శించిరని పూర్తిగా శృంగార రసస్ఫూర్తి కలుగు నట్లు రామభద్రయ్య నాలుగు పద్యములలో వర్ణించియున్నాడు. (రామా. చతు. 147-151) అంతేకాక నలువురు కోడండ్రు తమ తమ భవనముల ప్రవేశించిన వెనుక—

అభివాద్యాభివాద్యాంశ్చ సర్వారాజసుతాస్తదా
రేమిరేముదితాస్సర్వాభర్తృభిస్సహితారహః ॥

(బాల - 77 - 13)

అని "రాజపుత్రికలు (కోడండ్రు) తమతమ భర్తలతో మిక్కిలి ముదిత హృదయలై రహస్యముగా క్రీడించిరి" అని మూలమున ఎంతో గంభీరముగా నొక చోటను

"రామస్తు సీతయాసార్థం విజహారబహూన్నృతూన్ ।
మనస్వీతద్గతస్తస్యా నిత్యం హృదిసమర్పితః ॥"

అని శ్రీరాముడు సీతాదేవితో పెక్కు ఋతువులు క్రీడించినట్లు లోకసామాన్య రీతిలో నొకచోటను, వాల్మీకి అర్షపద్ధతిలో జెప్పిన దానిని రామభద్రయ్య మిక్కిలి విస్తారముగా శ్రీరాముడు సీతాదేవితో గడపిన ప్రథమ రాత్రి సమాగమ విశేషములను తానెదురుగా నిలిచి చూచిన వానివలె దివ్య దంపతుల రహస్య క్రీడలను బజారుపాలు చేసి కేవల లౌకిక దంపతుల శృంగార స్థాయికి తెచ్చి వర్ణించియున్నాడు. ఇది కేవలము ఆనాటి రసిక పతితల యభిరుచులను తృప్తిపరచుటకై పెంచి వ్రాసినదే యనుట స్పష్టము. అందువలననే కొంచెము అనౌచిత్యచ్ఛాయ ఈ ఘట్టముపై ప్రాకినది. రామాభ్యుదయము నందలి ఈ ఘట్టమును, అట్టివానినే

ఇతర సమకాలిక ప్రబంధములనుండి చదివినప్పుడు ఆ నాటి ప్రజ అభిరుచులు ఎంత నీచస్థితికి దిగజారినవో తెలియవచ్చును. రచయితలు సామాన్యముగా ప్రజల యభిరుచుల కనుగుణముగ గదా రచనలు చేయుదురు.

(రామా. చతు. పద్యములు 152-177

ఇట్లు బాలకాండ కథాభాగము సర్గానుక్రమముగా సమీక్షింపబడినది. అందు పైన పేర్కొన్న పెక్కు గాథలు రామాభ్యుదయమున వదలివేయబడుటకు కారణము గ్రంథ విస్తరణ భీతియే ప్రధానము. ఐనను గ్రంథకర్త కివి యన్నియు కథాగతికి అవరోధము గల్పించుటయే కాక ప్రబంధమునకు పురాణరూపమిచ్చి రసాభ్యుచిత బంధముగా తీర్చుటకు వీలులేక పోవును. ఈ బాలకాండ భాగముననే పెక్కు సందర్భములలో సన్నివేశములను మిక్కిలిగా పెంచుటయు, క్రొత్తవి కల్పించుటయు గూడ జరిగినది. ఇదివరకే చెప్పినట్లు ప్రబంధములలో నాయక విషయమునగాని రసవిషయమున గాని ప్రతిపాదింపబడిన వస్తువు అనుచితముగా నుండరాదు. అట్లున్నచో వానిని తొలగించుటయో, తొలగించుట కథాగతికి భంగమగుచో అన్యథా ప్రకల్పనము చేయుటయో జరుగవలయును గదా! అంతేగాక పూర్వ పూర్వ ప్రతిపాదిత వస్తువు తప్పనిసరిగా ఉత్తరోత్తర కథకు పోషకముగనో, ఉత్కర్షాపాదకముగనో, ఉండవలయును గాని అపకర్ష కలిగింపరాదు. కావుననే కథాగతికిగాని, రసపోషణకుగాని, నాయకుని శీలమునకు గాని పోషకము కానట్టి భాగము లన్నింటిని రామభద్రయ్య తొలగించినాడు. ఒక్క కాకాసుర వృత్తాంతము మాత్రము ఉత్తరోత్తర కథలో నుపయోగపడకున్నను అయోధ్యాకాండ భాగమున పొందుపరుపబడి యున్నది. ఇట్టి మార్పులు రామభద్రయ్య

శాస్త్రదృష్టితో జేసినవే కాని స్వతంత్రించి విశృంఖలముగా చేసినవి కాదు.

అట్లే కొన్ని మూలమున పూర్తిగా లేనివియో, ఉన్నను కేవలము సూచింపబడినవో ఐన వానిని క్రొత్తగా కల్పించియో, లేక పెంచియో వ్రాసి ప్రబంధత్వాపాదనమునకును, ఉత్తరోత్తర కథకు రసస్ఫూర్తి కలిగించుటకును రామభద్రయ్య బాలకాండ కథాభాగమునందే తన చాతుర్యము నంతటిని ప్రదర్శించి యున్నాడు. రామాభ్యుదయ మంతయు జాగ్రత్తగా చదివినపుడు ప్రాబంధిక శైలి, అలంకారయుత రచన, పాత్రపోషణ విధానము మున్నగునవన్నియు, సమకాలము నాటి ఆముక్తమాల్యద, మను చరిత్రము, పారిజాతాపహరణము, వసుచరిత్రము వంటి ప్రబంధము లందలి వాని కెందును తీసిపోని లక్షణములు కాన్పించును. కాని రస విషయమున శృంగారమునకు తక్కిన ప్రబంధములలో ఇచ్చిన స్థానము ఈ గ్రంథమున కానరాదు. ఒక్క బాలకాండ కథను మాత్రమే గైకొని సీతాకల్యాణమువరకే కథను పరిమిత మొనర్చు కొన్నచో శృంగార రసము పరాకాష్ఠకు కొనిపోబడినట్లే కాని పించును. అప్పుడు పరశురామ గాథ వదలవచ్చును.

మూలమున దశరథుని శాపప్రాప్తి వృత్తాంతము (ఎచ్చటను) అయోధ్యాకాండమున తన మరణమునకు కొన్ని ఘడియలకు పూర్వము దశరథుడు కౌసల్యతో నుడివినట్లు ఈ క్రింది శ్లోకము వలన తెలియుచున్నది.

> "త దిదం మేఽనుసంప్రాప్తం దేవి! దుఃఖం స్వయంకృతమ్
> సమ్మోహా దిహ బాలేన యథా స్యా ద్భక్షితంవిషమ్
> దేవ్యనూఢా త్వ మభవో యువరాజో భవా మ్యహామ్
> తతః ప్రావృడనుప్రాప్తా మదకామ వివర్ధనీ

తస్మిన్నతిసుఖే కాలే ధనుష్మానిషుమాన్ రథీ
వ్యాయామ కృత సంకల్పః సరయూమన్వగాం నదీమ్
అథాంధకారే త్వశ్రౌషం జలే కుంభస్య పూర్యతః
అచక్షుర్విషయే ఘోషం వారణస్యేవ నర్దతః
తతోఽహం శరముద్ధృత్య దీప్తమాశీ విషోపమమ్
శబ్దం ప్రతి గజప్రేప్సుః అభిలక్ష్య త్వపాతయమ్
హా హేతి పతత స్తోయే బాణాభిహత మర్మణః
తస్మి న్నిపతితే బాణే వాగభూత్తత్ర మానుషీ—"

(అయోధ్యా. 63 సర్గము 12 నుండి 25)

ఈ విషయము అంతముఖ్యము కానట్లు, పరాకుగా సమయము వచ్చినది కాబట్టి ఏదో అలవోకగా జ్ఞాపకమునకు వచ్చినట్లు దశరథుడు కౌసల్యతో చెప్పినట్లున్నది. కాని రామాయణ కథ కింతటికిని ఈ ఘట్టమే ఆయువుపట్టు. ఇచ్చట మునిశాపము— దశరథుడు కూడ తన వలెనే పుత్రవిశ్లేష దుఃఖముతో మరణింప వలయునని. అరువదివేల సంవత్సరములు దశరథుడు రాజ్య భారము వహించినట్లు మూలరామాయణమునందే యున్నది. అప్పటికిని దశరథునకు పుత్రసంతానము కలుగునన్న విశ్వాసము సడలలేదు. సాధారణ పరిస్థితులలో ఆ వయస్సున సంతానప్రాప్తి కెవ్వరును ఆశింపరు. కాని దశరథునకు ఆ విశ్వాస ముండుటకు కారణము మునిశాపమే. పుత్రుడున్ననే కదా పుత్ర వియోగప్రాప్తి. కావున తనకు పుత్రప్రాప్తి యోగమున్నది. సరిగా అదే సమయమునకు సుమంత్రుడు తాను పూర్వము సనత్కుమారుడు మునులతో చెప్పగా వినిన భవిష్యదర్థమును, అందునను ఋష్యశృంగుడు కారణముగా దశరథునకు నలుగురు కుమారులు కలుగుదురనుటను, రాజుతో చెప్పెను. దాని ఫలి

తముగనే ఋష్యశృంగాగమనము, పుత్రకామేష్టి నిర్వహణము, శ్రీరామాదుల జననము అగును. ఇంతముఖ్యమైన విషయమును అల్పమైనదిగా త్రోసిపుచ్చలేము గదా! పుత్రులు కలుగుటయు, వారి వియోగము కారణముగా దశరథుడు మరణించుటయు జరుగవలెను. అది అల్పకాల వియోగమైన దీర్ఘోదాత్తుడగు దశరథ మహారాజునకు మరణకారణము కాజాలదు ...వున అది శాశ్వత వియోగమో, దీర్ఘకాల వియోగమో కావలయును. కైక కోరిన వరములలో శ్రీరాముడు కేవలము పదునాల్గేండ్లు అరణ్యావాసము చేయుట యొకటే ప్రధానము కాదు. అదియేమైన అరువది వేల సంవత్సరములు జీవించిన దశరథునకు పదునాలుగేండ్ల పాటి పుత్ర వియోగము అంత గొప్పకాదు. రెండవ వరముచే శ్రీరాముడు శాశ్వతముగా రాజ్యాధికారమునకు దూరుడగునను న్యాయశాస్త్ర రహస్యమును దశరథుడు గుర్తింపలేనంత అమాయకుడు కాడు. ఇవి రెండును ఏకత్ర చేరి దశరథ మరణమునకు కారణములైనవి. మూలరామాయణమున దశరథుని పుత్రకామేష్టి యాగశాలయే రావణవధకై ఇంద్రాది దేవతలు పన్ను కుట్రకు రంగస్థలమైనది. వారి వారి హవిర్భాగములు గ్రహింపవచ్చిన దేవతలు బ్రహ్మతో ఆలోచనసల్పుట, తత్కాలమునకు యాగశాలకు శ్రీ మహావిష్ణువే విచ్చేయుట, దేవతలందరు రావణ బాధితులైనందున తద్వధకై విష్ణుని ప్రార్థించుట, ఆయన దేవతలకు వారి అభీష్టము దీర్ప వాగ్దాన మొనర్చుట ఇచ్చటనే జరుగును. దాని ఫలితముగనే శ్రీరామాదులు విష్ణ్వంశ సంభూతులై దశరథునకు పుత్రులుగా జన్మించుట, కైక వరము కారణముగా లేక ఒక మిషగా శ్రీరాము డరణ్యగతుడగుట, రావణవధలో ఒక భాగమే కదా! అది పూర్వరంగము. కాబట్టి దశరథుని శాపమునకు ఇంత

ప్రాధాన్యమున్నది. అది గుర్తించియే రామభద్రుడు ఆ ఘట్టమున అంత విస్తరింపజేసినాడు. ఈ శాపఘట్టము రామభద్రయ్య రచనలో ప్రథమాశ్వాసము 44 వ పద్యము నుండి ద్వితీయాశ్వాసము 61 వ పద్యము వరకు అనగా దాదాపు నూటపది పద్యముల గ్రంథము వరకు పెరిగినది.

రామాభ్యుదయము ప్రబంధము కావున శృంగార రస పోషణము సక్రమముగా శాస్త్రయుక్తముగా జరుగవలయును. అప్పటికి దశరథుడు యువకుడే. మూలరామాయణము ననుసరించి అత డవివాహితుడు. కాని రామభద్రయ్య రసపోషణకై దశరథుడు అప్పటికే నవయౌవనవతులైన మువ్వురు భార్యలతో కాపురము సేయువాడుగా చిత్రింపబడినాడు. అన్ని ప్రబంధము లలో వలెనే ఇచ్చటను పురవర్ణనమునకు అంగముగా పుష్పలావికల వర్ణనము, వనవిహార వర్ణనము, జలక్రీడా వర్ణనము, పుష్పాపచయ వర్ణనము మున్నగు ఉద్దీపన విభాగముల నన్నిటిని ప్రవేశపెట్టినాడు. వీనికన్నింటికి తగిన కాలము వసంతఋతువే కదా! మూలమున దశరథుడు వేటకైపోయిన కాలము వర్షాకాలము. వసంతము కాదు. అచ్చట (మూలమున) శృంగారరస ప్రశక్తి లేనందున వసంతఋతు వర్ణన లేదు. కాని వర్షాకాలము సైతము 'మదకామ వివర్ధనీ' అని వాల్మీకి వర్ణించియున్నాడు. రామాభ్యుదయమున దశరథుడు భార్యలతో వనవిహార జలక్రీడాదులు జరుపుటకు ఉద్దీపనముగా వసంతఋతువే తగినది కాని వర్షఋతువు కాదు. నిజమునకు వసంతఋతువే మదనకామ వివర్థిని. వర్షఋతువట్లుకాదు. మహాభారతమున కూడ పాండురాజ మరణ సందర్భమున సంస్కృతమూలమున అల్పాల్పముగా చేయబడిన వసంతఋతు వర్ణనము తెలుగు భారతమున నన్నయచే

అతివేలముగా వర్ణింపబడినది. అట్టి సందర్భమే పాండురాజునకు ఒడలు తెలియనంత ప్రమత్తతను కల్పించి మునిశాపమునే మఱచి మాద్రితో కూడి మరణించునట్లు చేసినది. పుష్పలావికల వర్ణనము, వనవిహార జలక్రీడల వర్ణనములు, పుష్పాపచయ వర్ణనము, వేశ్యలొనర్చిన వనవిహారము—అన్ని సందర్భములందును పొందు పరచిన దోహదక్రియల పరిజ్ఞానము ఆముక్తమాల్యద, మను చరిత్రము, పారిజాతాపహరణము మున్నగు ప్రబంధములలోని వాని కెందును తీసిపోదు. రామరాజభూషణుని వసుచరిత్రమును, రామభద్రయ్య చూచియుండు ననుటకంటె, చూచియుండడు అనుటయే ఎక్కువ సంభావ్యము. ఇందలి కొన్ని వర్ణనలు వసు చరిత్రములోని వానికి మెరుగుపెట్టినవిగా కూడ నున్నవి.

ఇక వేట విషయము. వసంతఋతువునందే వేటకు దశ రథుడు బోయలతో కూడి వెడలినట్లు రామాభ్యుదయము తెల్పు చున్నది. మూలములో వాల్మీకి మదనకామ వివర్ధని యని వర్ణిం చిన వర్షాకాలములో దశరథుడు చేసిన పని విల్లమ్ములు గైకొని ఏకాంతముగ అర్థరాత్రమున 'వ్యాయామకృత సంకల్పుడై' సరయూనది చేరనరుగుటయే. ఇచ్చట వ్యాయామశబ్దము శృంగారమునకు సంబంధించినదికాదు. నిఘంటువులలో వ్యాయామ శబ్దమునకు వేట అను నర్థము ఎచ్చటను కాన్పింపకున్నను, గోవిందరాజీయ వ్యాఖ్యానమున "వ్యాయామకృత సంకల్పః = మృగయా విహారే కృత సంకల్పః ఇత్యర్థః" అనియు మహేశ్వర తీర్థుల రామాయణతత్త్వదీపికా వ్యాఖ్యానమున వ్యాయామ కృత సంకల్పః=మృగయా విహారకృత సంకల్పః ఇత్యర్థః" అనియు స్పష్టముగ చెప్పియున్నారు. ఆ సన్నివేశము వర్షాకాలమునకు తగి నదియే. మడువులు నిండుటయు ఏనుగుల విహారమునకు అనువైన

తరుణము. కాని రామాభ్యుదయమున వసంతఋతువును వర్ణించి అట్టి సమయముననే దశరథుడు భార్యలతో వనవిహారాదులు సల్పినట్లున్నది. ఆ వాసరాంతమే దశరథుడు అంతఃపురము చేరి, ఆ రాత్రిగడిపి, మరునాడు కొలువుదీరియున్నపుడు బోయ లరుదెంచి ఉపాయనము లర్పించి దశరథుని వేటకు ప్రోత్సహించినట్లును, రాజు ఆ నిశీథిని నిదురించి నిశాంతమునందు మృగయులతో కూడ హయము నెక్కి వేటకు బయలు దేరినట్లును కలదు. ఏది ఎట్లున్నను దశరథుడు నిండు యౌవనములో నుండి మిక్కిలి ఉత్సాహియై వనవిహారాదులందును, మృగయావిహారాదులందును పాల్గొనుట మిక్కిలి సమంజసముగా నున్నది.

కాని ఇచ్చట మిక్కిలి అనౌచిత్యముగా భాసించుచు పెక్కురు విమర్శకుల అసంతృప్తికి కారణమైన విషయ మొకటి కలదు. దశరథుడు మునిబాలకుని పొరపాటున సంహరించి పశ్చాత్తాపమును ప్రకటించియు వాని తలిదండ్రులచే—

"సూను దెగటార్చి మమ్ము న
సూనుల జేసితివి యిట్టి సూక్తులు చాలున్
వీనులకు ములుకులైనవి
పో నీవుం బుత్రశోకమున మారీతిన్" (2-51)

అని శపింపబడెను. పిదప నా

"మానిమిథునంబు పంచత్వంబునొందినం గనుంగొని మూర్ఛిల్లి లేచి యుల్లంబు తల్లడిల్ల వెల్లువగచి యథావిధి తదీయాగ్ని సంస్కారవిధులు నిర్వర్తించి పుత్రసంతాన కారణంబగు తాపసశాపం బమోఘుంబని అంతరంగంబున శోకంబు లెక్కింపక పరమసంతోషభరమగ్నుండయి అలరి మరియు వేటాడుచుం జనియె" — (2-54)

ఈ క్రింది గీతలుగల గ్రంథభాగము చాల కృతకముగనున్నది. అప్పటికి దశరథుడు యువకుడు. క్రొత్తగా రాజ్యమునకు వచ్చిన వాడో లేక నూత్న నూత్నముగ వివాహితుడైనవాడో అయియుండ వలెను గదా! మూలరామాయణమున అరువదివేలసంవత్సరములు రాజ్యము చేసిన పిదపకూడ సంతానము లేకున్నను మునిశాపము ఫలితముగా తనకు సంతానయోగమున్నదని దశరథుని ఆశ, విశ్వాసము. కాని ఇచ్చట "పుత్రసంతానకారణంబగు తాపస శాపం బమోఘుంబని" భావించి శోకింపక మిక్కిలి సంతోషముతో మరల వేటయందు ప్రవృత్తుడయ్యెననుట యెట్లు పొసగును? దశరథుడు ఇంక సంతానము కలుగదేమో యను నిరాశ పెంచుకొనునంత వయస్సు మించినవాడు కాడు. ముందు ఎంతోకాలమున్నదికదా! పోనీ అప్పటికే కొన్ని వేలయేండ్లు గడచిన వనలేము. ఆ తరువాత పెక్కువేలఏండ్లు రాజ్యము చేసినట్లు-

"మృగయాక్రియ మాని వడిన్
మగిడి యయోధ్యాపురిఁ ప్రమారాజ్యరమా
నుగుణ మహిమ నానృపమణి
విగతాఘుడు విభుడు పెక్కువేలేండ్లు డెన్"

— (రామా 2-61)

అను పద్యమున స్పష్టముగా సూచించియున్నాడు.

ద్వితీయాశ్వాసము నందలి 35వ పద్యమగు "కాసరి కేసరి కిరికరి..." అను కందపద్యము వెంటనే 55వ పద్యమగు 'నాయెదుట మీకు భూమి భృన్నామమూన' అను గీతమునుండి 59వ పద్యమగు "సరసైకద్విరదత్రతాం కధరయున్..." అను మత్తేభము వరకు గల గ్రంథభాగమును కలిపివేసి దానివెంటనే 36వ పద్యమగు 'ఆసమయంబునందు...' అను ఉత్పలమాల

నుండి 54వ వచనమగు "అని పలువరించి...సంస్కార విధులు నిర్వర్తించి" అని యావచనము నంతటితో నిల్పి 61వ పద్యమగు "మృగయాక్రియామాని..." అని కందముతో అంతముచేసి యున్న ఎంతో బాగుండెడిది. అనగా మునిబాలకుని మరణమునకు తరువాత నున్న వేటవర్ణనము, ముందున్న వేటవర్ణనముతో కలిపి 54వ వచనముకడపట తదనుగుణముగ మార్పుచేసియుండ వచ్చును. అప్పుడు ఏవిమర్శయు లేకుండెడిది. ఆతరువాత సంతానము లేమికి చింతిల్లుట తరువాయి కథాగతి సక్రమముగా సాగినది.

శాపము పొందియు మరల దశరథుడు వేటాడుటలో మగ్నుడయ్యెననుట నిజముగ అసంబద్ధముగనే యున్నది. కవియే ఇచ్చట దానికి తగుకారణము నిచ్చియున్నాడు. తనకిక సంతానమే లేదని నిరాశోపహతుడై యున్న దశరథునకు ఈశాపము మూలమున సంతానప్రాప్తియున్నదని తెలియుటచే కలిగిన ఆనంద పారవశ్యమున మరల వేటాడ నుపక్రమించెనని కవిసమర్థనము. ఐనను అది కృతకమేకాని సహజముకాదు. పుత్రవియోగముచేత తనకు మరణము కలుగునట్లు మునిశాపము. "పోసివున్ పుత్రశోకమున మారీతిన్" అను పదముల కూర్పులో అమంగళార్థమే ఎక్కువగా నున్నది. 'మారీతిన్' అనుటచే "పుత్రమరణ కారణముగా కలిగిన వియోగబాధచే" అనియే కదా అర్థము? పుత్రులు కలుగుదురు అనుసంతోషముతోడి భావనకంటె, వారికకాల మరణము ప్రాప్తించును అనుదుఃఖముతోడి భావము బాధాకరముగదా! అట్టిచో దశరథునకది ఆనందించుటకు తగిన విషయముగాని, సమయముకాని కాదుగదా! కలుగబోవు వియోగమెట్టిదో అప్పటికి తెలియనట్లు సన్నివేశము సృష్టింప బడవలయును.

ఋష్యశృంగాగమనమునకై రోమపాదునిచే వేశ్యలు పంప బడినట్లును, వారు తమ శృంగారచేష్టల వలనను విదగ్ధవ్యవహారము వలనను ఋషిపుత్రు నాకర్షించి తమతో నతనిని అంగ రాజ్యమునకు కొనివచ్చినట్లును మూలరామాయణమున విపులము గనే వర్ణింపబడినది. ఎంత శృంగారమైనను అది ఋషిప్రోక్తము అనిపించుకొతగినంత గంభీరముగనే సాగినది. రామాభ్యుదయమున సన్నివేశము మాత్రమట్టిదియే. ఇచ్చట రోమపాదుడు కాక దశరథుడే వేశ్యలను ఋష్యశృంగుని తెచ్చుటకై పంపినట్లు కవి మార్చియున్నాడు. శృంగారమునకు ఆమాత్రము ఆలంబనము మూలకారుడే కల్పించినందున రామభద్రయ్య దానినే అతి వేలముగా వర్ణించి ఇది లౌకికవిరచన అని అనిపించుకొన్నట్లు చేసినాడు. వేశ్యల వనవిహారము, వృక్ష లతాదులపై వారి దోహదక్రియలు, వారి అంగభంగములు, అవయవవిక్షేపములు, నర్మగర్భోక్తులు, ఒకటి యననేల? అన్నియు ప్రబంధోచితముగా తీర్చిదిద్దబడినవి.

తృతీయాశ్వాసమున, 82 వ పద్యమునుండి 101 వ పద్యము వరకు అనగా యిరువది పద్యములలో రామభద్రుడు కౌసల్యా దేవి గర్భలక్షణములను వర్ణించియున్నాడు. ఆద్యులైన ఋషులు ఋషితుల్యులైన కవులు ఉత్తమస్త్రీల గర్భధారణ లక్షణము లను, చాలసున్నితముగ వర్ణింతురు. శ్రీ మహావిష్ణువును వామన రూపమున గర్భమున ధరించిన అదితియు, శ్రీకృష్ణుని భరించిన దేవకియు, శ్రీరాముని గర్భమున భరించిన కౌసల్యయు ఒక తీరువారే. సాక్షాత్తు భగవంతుని పుత్రునిగా పొందబోవు దేవ తాంశసంభూతలు త్రిభువనపూజ్యులు, నగు స్త్రీలను గర్భధారణ లక్షణవిషయమున సామాన్య లౌకిక స్త్రీలను వర్ణించినట్లు

వర్ణించుట సద్విమర్శకులకు నచ్చక పోవచ్చును. అంతేకాక కౌసల్య కారణజన్మురాలు. వారి గర్భధారణమునకు వయస్సు నిమిత్తము కాదు. ప్రబంధనాయికవలె ఆమె యౌవనవతి కాదు. ఐనను రామభద్రయ్య కౌసల్య గర్భలక్షణములను కేవల ప్రబంధ నాయికల గర్భలక్షణములవలె వర్ణించియున్నాడు. చూచుకముల (చనుమొనల) నల్లదనమునే ఐదుపద్యములలో వర్ణించియున్నాడు. లౌకికులగు కవులు తమతమనాయికల విషయమున యిట్టిపద్ధతినే అవలంబించిరి. ఇట్టి సందర్భములందు కూడ మిక్కిలి చమత్కారముతోడను, అపురూపములగు ఉత్ప్రేక్షలతోడను కూడిన పద్యములను మనము ఈ గ్రంథమున చూడగలము.

ఈ రామాభ్యుదయమును సమీక్షించినవారందరు ఏక వాక్యముగా విమర్శించిన అంశమొకటి ఈ బాలకాండభాగమున కలదు. అది విశ్వామిత్రునినోట సీతాసౌందర్యవర్ణనము చేయించుట. అదియు కళాస్థానములగు ఏ అవయవమును వదలక వర్ణింపజేయుట.

చతుర్థాశ్వాసమున 64వ (సీస) పద్యము మొదట 76వప. ఆటవెలది వరకు గల పదమూడు పద్యములలో సీతాదేవి ప్రత్యంగవర్ణనమును ప్రసంగవశమున విశ్వామిత్రుడు శ్రీరాముని తో చేయుచు, వారిరువురు (సీతారాములు) పరస్పరము వివాహమాడ మిక్కిలి అర్హులని నొక్కి చెప్పెను. ఈ వర్ణనమున బాహ్యాంగములైన కన్ను, ముక్కు, ముఖము, అధరములు___ మున్నగు అవయవములే కాక, కళాస్థానములైన స్తనములు, నూగారు, నాభి, కటిస్థలము మున్నగు అవయవములు కూడ వర్ణింపబడినవి. ఇట్టి స్త్రీ సౌందర్య వర్ణనము ప్రబంధయుగమున ఎక్కువగా, అంతకుముందును వెనుకను కొంచెము తక్కువగా

అందరుకవులును చేసియే యున్నారు. ఆ స్త్రీ వేశ్యయో, సామాన్యనాయికయో ఐన దోషములేదు. కాక నాయకుడే స్వయముగా చేసినను, కవియే చేసినను, దోషములేదు. ఉదాత్తశీలము గల కథానాయికను ఆమెను వివాహమాడబోవు నాయకు నెదుట పరపురుషుడు (స్త్రీయైన అంతపట్టింపులేదు) అంగాంగములను వివక్షించి వర్ణించుట నిజముగా జుగుప్సావహమే. కాని అట్టి వర్ణనము మన రామభద్రయ్య ఒక్కడే చేయలేదు. సంస్కృత వాఙ్మయమునందుకూడ ఇట్టివర్ణనములు లేకపోలేదు. వామన భట్టబాణుని పార్వతీపరిణయనాటకమున చెలికత్తెలు పార్వతిని పెండ్లికూతురు చేయుసమయమున ఆమె సౌందర్యమును అంగాంగములను ప్రత్యేకించి వర్ణించి తండ్రియగు హిమవంతునితోడనే చెప్పుటయు, ఆతండ్రి మహోత్సాహముతో "తత స్తతః" అని అట్టి వర్ణనమును మరిమరీ వినగోరుటయు వర్ణింపబడినది. తెలుగున వసుచరిత్రమున గిరికావర్ణనము రామాభ్యుదయమునందువలెనే నర్మసచివుడు వసురాజు ఎదుటనే చేయును. కొన్నింట నాయికా వర్ణనము హంస, చిలుక, మొదలగు మానవేతరములగు తిర్యగ్జంతువులచే చేయించుటయు గలదు. తరువాతి కాలమున చేమకూర వేంకటకవి సుభద్రా సౌందర్య వర్ణనమును అర్జునసఖుడగు విశారదుని మూలమున నాయకు నెదుటనే చేయించును. సీతాదేవి సుందరకాండమున హనుమంతునితో రాముని రూపమును వర్ణింపగోరుచు—

"కథమూరూ కథంబాహూ లక్ష్మణస్య చ శంస మే!"

అని లక్ష్మణుని తొడలు, బాహువులు కూడ ఎట్లుండెనో తెలుపగోరినది. అదేమి బాగున్నది? ఆమె వేయు మరొక ప్రశ్నకు సమాధానముగా సాముద్రిక శాస్త్రమును అడ్డుగాపెట్టుకొని

హనుమంతుడు శ్రీరాముని గుహ్యాంగములను సైతము సీతతో వర్ణించిచెప్పెను. 'వరారోహే! సుమధ్యమే భామిని!' వంటి సంబుద్ధులు హనుమదాదులు సాక్షాల్లక్ష్మీస్వరూపయగు సీతాదేవి విషయముననే వాడినట్లు వాల్మీకిరామాయణముననే పెక్కు చోట్ల కలవు. ఇట్టిచోట్ల ఉద్దిష్ట స్త్రీ సౌందర్యవర్ణనము చేయుటయే ప్రస్తుతముకాని, అట్టి వర్ణనమును ఎవరు చేసిరి? అని తర్కించుట అప్రస్తుతము. యౌవన ప్రాదుర్భావసమయమున నాయికరూప మెంత ఆకర్షణీయముగా ఉండెనో అది పఠితకు తెలియజేయుట ప్రధానము. ఆర్ష పద్ధతిలో వర్ణ్యములైన విషయములెన్నియో ప్రబంధయుగమున లౌకిక పద్ధతిలో వర్ణించుట జరిగినది.

అట్లని విశ్వామిత్రుని నోట సీతా సౌందర్య వర్ణనము చేయించిన రామభద్రయ్య చర్యను నేను సమర్థించుట లేదు. "గతాను గతికోలోకః" అన్నట్లు రామభద్రయ్యకూడ అందరు చేసిన తప్పే చేసియున్నాడు. అట్టిరచన ఆనాటి సంఘములో చెల్లుబడియైనందున మనము కూడ సరిపెట్టుకోవలసినదే కాని విమర్శించి సాధించునదేమియు లేదు.

జనకరాజర్షి పుత్రికలైన సీత, ఊర్మిళల వివాహములు రామలక్ష్మణులతోడను, జనకుని అనుజుడైన కుశధ్వజుని పుత్రికలు మాండవీ శ్రుతకీర్తుల వివాహములు భరత శత్రుఘ్నులతోడను ఆర్ష పద్ధతిలో మిక్కిలి క్లుప్తముగా వాల్మీకి జరిపించినట్లు మూలమునగలదు. కాని రామభద్రయ్య దేశీయ పద్ధతిలోనే రాముని పెండ్లికొడుకును చేయించెను. శ్రీరామునకు శిరసంటుట, జలకమార్చుట, ధౌతవస్త్రము గట్టుట, శిరసార్చుట, విరిదండ సికకు జుట్టుట, కర్ణాభరణములు సంతరించుట రత్న నీరాజనమిచ్చుట,

కనుబొమల నడుమ కస్తూరితో నామము దిద్దుట, కాలికి గండ పెండేరము తొడుగుట, నక్షత్రకంఠమాలికలను మెడను వేయుట, చందనమలంది బాసికము కట్టి మణిమకుట మమర్చి కస్తురి బొట్టిడుట మొదలగు క్రియలన్నియు ముక్కుతిమ్మన పారిజాతాప హరణ ద్వితీయాశ్వాసమున సత్యభామ సదనమున శ్రీకృష్ణుని జలకమాడించిన ఘట్టమును జ్ఞప్తికి దెచ్చును. తరువాత వరునిచే సభ్యజనులకు కర్పూరతాంబులాదు లిప్పించుట మున్నగు క్రియ లచే శ్రీరాముని పెండ్లికొడుకును జేయు సంరంభమును ఎనిమిది పద్యములలో కవి వర్ణించియున్నాడు. సమావర్తన హోమాది క్రియలు తప్ప పై వివరము లెవ్వియు మూలమున లేవు. తరు వాత వివాహపు తంతు అంతయు ఆంధ్ర దేశీయపద్ధతిని తిక్కన జరిపిన ఉత్తరాభిమన్యుల వివాహపు తంతువలెనే జరిగినది. ఈ తంతుకూడ తొమ్మిది పద్యములలో రామభద్రయ్య వర్ణించి యున్నాడు. ఈ పెండ్లి అచ్చముగా సంపన్నులగు తెలుగు వారి యిండ్లలో జరుగు పెండ్లియే కాని అన్యముకాదు. ఇంత బాగుగా వివాహమునకు ఆంధ్రతా ముద్ర తిక్కన తరువాత మరి యెవ్వ రును వేయలేదు. లక్ష్మణ భరతశత్రుఘ్నుల వివాహములు మాత్రము చాల క్లుప్తముగా జరిపించి కేవలము ఐనవనిపించినాడు. ఈ వివాహఘట్టమున రామభద్రయ్య తెలుగువారి సంప్రదాయ మును నిలిపి వారి మన్ననలకు పాత్రుడైనాడు.

7

# అయోధ్యాకాండము



సంస్కృత మూలమున అయోధ్యాకాండము 119 సర్గములతో 4415 శ్లోకములుగా విస్తరించి యున్నది. బాలకాండమునందలి శ్లోకసంఖ్య కేవలము 2280 మాత్రమే. ఇది స్థూలముగా అయోధ్యాకాండ పరిణామములో సగమే యని చెప్పవచ్చును. ఐనను బాలకాండ కథ రామాభ్యుదయమున 566 పద్య గద్యములవరకు విస్తరించి యుండగా, మూలమున అంతకు రెండింతలైన అయోధ్యాకాండ కథ రామాభ్యుదయమున 101 పద్య గద్యములలో సంక్షేపింపబడినది. ఇది బాలకాండ పరిమాణములో ఐదింటిపాలుకూడ కాదు. భాస్కరరామాయణాదులలో కూడ బాలకాండ కథ మిక్కిలిగా పెంచబడకపోయినను అయోధ్యాకాండ కథ మాత్రము బాగుగా సంక్షేపింపబడినది. ఇందుకు కారణము మనకు స్పష్టమే. ఏ కథాభాగమైనను పఠితలను శృంగార వీరరసములవలె కరుణరసము ఆకర్షింపజాలదు. ఆ రసము ఆనందము నిచ్చునది కాదు. అయోధ్యాకాండమున సర్వత్రా వ్యాపించినది కరుణరస సామగ్రియే. కావుననే అనువాదకు లందరును అయోధ్యాకాండ కథను సంక్షేపించియే యున్నారు. ఇది మన భారతీయసంస్కృతి కనుగుణమైన చర్యయే. కరుణరసము ప్రబంధమునకే మాత్రము పనికిరానందున పఠితృ

లకు రసానందము కలిగింప సమర్థము కానందున మన రామ భద్రయ్యకూడా ఆ కథాభాగమును మిక్కిలిగా సంక్షేపించి యున్నాడు. మూలమునందలి మొదటి ముప్పది యెనిమిది సర్గము లందలి కథాభాగమును కేవలము ఒక్క పద్యమునందు సూచించి వదలినాడు, చూడుడు.

(1) ఒకటి రెండు సర్గములలో మూలమున దశరథుడు శ్రీరామ పరాక్రమ విశేషములనేకాక, ఉత్తమ పురుష లక్షణ ముల నన్నింటి నెంచి, తన వార్ధక్యమునుగూడ గుర్తించి తాను బ్రతికియుండగనే శ్రీరాముని యౌవరాజ్యమున కభిషిక్తుం జేయ నెంచుట ఎంతయు యుక్తముగ నున్నది. దానికై యతడు సభకు ప్రజానాయకుల నాహ్వానించి వారి యనుమతి గైకొన్నవిధము మిక్కిలి శ్లాఘ్యముగా నున్నది. మహాభారతమునగూడ ధృత రాష్ట్రుడు వానప్రస్థాశ్రమ (ఆశ్రమవాస) స్వీకార మొనర్చు సంద ర్భమున ఇట్లే ప్రజల యనుమతి వడసినట్లు వర్ణింపబడినది. అట్టి ఉత్తమాదర్శయుత సంప్రదాయ ప్రదర్శకమగు సందర్భమును రామభద్రయ్య గైకొనకపోవుటకు గ్రంథ విస్తర భీతి యొక్కటియే కారణమని సరిపెట్టుకొనవలసినదే.

(2) మూడు, నాలుగు, ఐదు సర్గములలో మూలమున దశరథుడు దుస్వప్నముంగని, తత్కారణముగా శ్రీరామాభిషేక మున కతడు తొందరపడి భరతశత్రుఘ్నులు రాకముందే అభిషే కము ముగియవలెనని తగు సంభారములు సేకరించుటయు, ఉప వాస విధి నిర్వహింప శ్రీరామున కనుజ్ఞ నిచ్చుటయు, అయోధ్య అలంకరింపబడుటయు కలవు. ఇవెవ్వియు, రామాభ్యుదయమువ లేవు. లేకపోవుట యొక లోపము కాదు.

(3) ఆరు, ఏడు, ఎనిమిది సర్గములలో మూలమున శ్రీరామాభిషేక సందర్భమున ఆనందోత్సాహములతో ప్రజలు వేడుకలు జరుపుకొనుట జూచి మత్సరగ్రస్తురాలైన మంథర కైకకు దుర్బోధ మొనర్చుటయు, ఆమె మొదట మన్నింపకున్నను, కడకట్టి దుర్బోధమునకు తలయొగ్గుటయు ఎంతయో యుక్తియుక్తముగ వర్ణింపబడినవి. అది యొక రసవద్ఘట్టము. కాని ఇదంతయు కేవలము కైక యను నొక శబ్దముచే సూచింపబడినదే కాని మంథర పేరైన రామాభ్యుదయమున కానరాలేదు.

(4) తొమ్మిది, పది, పదునొకండు సర్గములలో మూలమున మంథర మున్ను దశరథుడు కైకకు వాగ్దానము చేసిన వరముల విషయము వెల్లడించును. మొట్టమొదటగా భారతీయ సాహిత్యములో కోపగృహ సృష్టి ఇచ్చటనే జరిగినది. పారిజాతాపహరణ కర్త సత్యభామ కోపగృహమును ఈ ఘట్టమునకు ప్రతీకగా సృష్టించి యున్నాడు. కాని యింత రసవత్తర ఘట్టముకూడ మన రామభద్రయ్య వదలివేసినాడు. దశరథుడు కైక కోరిన వరములను తప్పనిసరిగా యీయవలసియే వచ్చినది. దీనికి మరియొక కారణముకూడ కలదు. అది యిచ్చట చెప్పకపోయినను పాదుకా ప్రదాన ఘట్టమున శ్రీరాముడే భరతునితో—

"పురాభ్రాతః పితానః సమాతరం తే సముద్వహన్
మాతామహేసమాశ్రౌషీద్రాజ్య శుల్కమనుత్తమమ్ ॥"
(3-వ శ్లోకము)

అని దశరథుడు కైకను వివాహమాడునప్పుడే అమెకు పుట్టిన కుమారునకు రాజ్యమిచ్చునట్లు కేకయ రాజునకు వాగ్దానము చేసెనని చెప్పినట్లు వాల్మీకిరామాయణము 107 వ సర్గ (అయోధ్యా కాండ)మున కలదు. శ్రీరాముని వనవాస గమనము కేవలము

భరతుని భద్రతకొరకే. ఇవన్నియుకూడ రామాభ్యుదయమున లేవు.

(5) పంద్రెండునుండి పదునేడు సర్గములవరకు మూలమున సామాన్య విషయములే కలవు. దశరథుడు మనసు మార్చుకొమ్మని కైకను ప్రార్థించుట, ఆమె మరియు కఠినవైఖరి నవలంబించుట, వసిష్ఠాదులకంటె పూర్వమే కైక శ్రీరాముని దశరథునొద్దకు సుమంత్రుని మూలమున పిలిపించుట, శ్రీరాముడు తండ్రిని కలిసి కొనుట మున్నగు విషయములు కలవు. ఇవికూడ రామాభ్యుదయ మున లేవు. లేకపోవుట యొకలోపము కాదు.

(6) పదునెన్మిది, పందొమ్మిది సర్గములలో మూలమున కైకయే శ్రీరామునకు దశరథుడు తనకిచ్చిన వరముల వివరములు తెలుపుట, శ్రీరాముడు పితృాజ్ఞ పాలింప నిశ్చయించుట కలవు. ఇచ్చట శ్రీరాముని శీలము గొప్పగా పోషింపబడినది.

(7) ఇరువదినుండి, ఇరువది యైదవ సర్గమువరకు మూల మున శ్రీరాముడు కోపోద్రిక్తుడైన లక్ష్మణుని శాంతపరచుట, కౌసల్యా దుఃఖ నివృత్తికై ప్రయత్నించుట తల్లి యాశీస్సులను పొందుట వివరింపబడినవి.

(8) ఇరువది యారునుండి ముప్పదవ సర్గమువరకు మూల మున శ్రీరాముడు తనతోకూడ అడవికి రాగోరిన సీతాదేవిని నివారింప ప్రయత్నించుటయందే సరిపోయినది. అరణ్యవాస కష్టము లెన్ని వివరించినను సీత తన ప్రయత్నమును విరమించు కొనకపోవుటయే కాక—

"కింత్వాఽమన్యత వైదేహః పితా మేమిథిలాధిపః
రామ! జామాతరం ప్రాప్యస్త్రియం పురుషవిగ్రహమ్."

(30 - 3)

అను శ్లోకమున శ్రీరామునితో "మా తండ్రి పురుషాకారంబున నున్న ఆడదానివని తెలియక నిన్నల్లుడుగా నెట్లు పడసెనో?" అని నిష్ఠురములాడి తన యనుగమనమునకు శ్రీరాముని ఒప్పించినది. మూలమున ఈ ఘట్టము ఇంత స్పష్టముగా, వివరముగా ఉండగా రామభద్రయ్య శ్రీరాము డడవికి ఎందుల కరుగుచున్నాడో తెలియకయే సీతాదేవి యతని వెంబడించినట్లు వ్రాసియున్నాడు. చూడుడు :

"అరదము దెచ్చి పంక్తిరథు
నానతి వచ్చితి చిత్తగించి దా
శరథి రథాధిరోహణము
సల్పుము నావుడు జానకీతలో
దరియు సుమిత్ర పట్టియును,
దానును నెక్కి పురంబు వెల్వడన్
నరుల మహార్తనాదము వి
నంబడి యెందలకేన్ ధరిత్రియున్." (5-6)

అని యొకచోటను మరల "దుర్ఘటతరమార్గగ్లానిచే" భర్తతో—

"మనయూరెయ్యది? యెంత దవ్వు మనమీ
మార్గంబునం బోవుటల్ ?
మన మెచ్చోటికిఁ బోయిరావలయు? నే
లాలేదు తే రిచ్చటన్ ?
మనతోటన్వలెఁ బువ్వుటోవరులు స
మ్యక్చంద్ర కాంతస్థలుల్
కనరావిప్పు డదేమి? నావిభుడు శో
కం బాత్మలో నాగుచున్." (5-37)

అని మరియొకచోటను స్పష్టముగా నామెకు తెలియనట్లే వర్ణించుట చాల కృతకముగా గన్పట్టుచున్నది. ఇట్టి మార్పువలన రామభద్రయ్య సాధించిన ప్రయోజనమేమియో ఊహాకందని విషయము. ఈ విధమైన కల్పన సీతారాముల శీలపోషణమున నొక లోపముగా గన్పించును.

(9) ముప్పదియొకటవ సర్గమునుండి ముప్పదినాల్గవ సర్గము వరకు మూలమున శ్రీరాముని వనవాసగమన ప్రయత్నము, దాన ధర్మాదు లొనర్చుట, ప్రజల అనురాగమున కాంక్ష, శ్రీరాముడు రాజపత్నుల యెదుట తండ్రిని వనగమనమున కనుజ్ఞ వేడుట మున్నగు విషయములు గలవు.

(10) ముప్పదియైదు, ముప్పదియారు సర్గములలో మూలమున కైకేయి తల్లి దుష్టత్వమును, మూర్ఖత్వమును సారథియగు సుమంత్రుడే పేర్కొని నిందించినట్లు గలదు. పైగా రాముని వెంట సేనను, కోశమును బంప ఆజ్ఞయిడిన దశరథుని మాట నాక్షేపించి కైక అవి రెండును లేని రాజ్యము భరతునికేల యని నిష్ఠురము లాడుట కలదు. ఇచ్చటను మరల

(11) ముప్పది యేడవ సర్గమున మూలమున మూర్ఛాగతుడైన దశరథుని యనుజ్ఞకొరకు వేచియుండక, సీతారాములకు వల్కలములు తానే తెప్పించి యిచ్చిన కైకను వాల్మీకి మిక్కిలి కఠినచిత్తనుగా వర్ణించియున్నాడు.

(12) ముప్పది యెనిమిదవ సర్గము మూలమున శ్రీరాముడు తల్లియగు కౌసల్యను తగు మన్ననతో జూడుమని తండ్రిని వేడినట్లున్నది. ఇంతవరకుగల కథయంతయు రామాభ్యుదయమున వదలబడినది. "కైకయీనామస్త్రీ" వేడిన వరముల ఫలితముగా

సీతారాములు లక్ష్మణునితోగూడి యడవుల కేగిరని యొక్క పద్యమున నింతవరకుగల కథయంతయు సంక్షేపింపబడినది.

(13) ముప్పది తొమ్మిదినుండి నలువది నాల్గవ సర్గము వరకు మూలమున దశరథుడు సీతకాభరణము లిప్పించుట, సీతకు కౌసల్య ధర్మములు బోధించుట, సుమిత్ర లక్ష్మణునకు ప్రవర్తన నియమావళి బోధించుట మున్నగునవి కలవు. శ్రీరామాదులు అయోధ్య వీడినప్పుడు ప్రజలు వారిని వెంబడించు దృశ్యము మిక్కిలి కరుణరస పూర్ణముగ వర్ణింపబడినది. శ్రీరాముడు లేని అయోధ్యను, అందలి ప్రజలను, గజాశ్వాదులను, వాల్మీకి చైతన్య రహితములుగా వర్ణించి యున్నాడు. అవి ఎవ్వియు రామాభ్యుదయ మున లేవు. ఇదియు రసవద్ఘట్టమే. దశరథుడు కొంతవరకు పుర మార్గమున శ్రీరాముని వెంబడించి మరలి కౌసల్యా గృహము జేరుట మూలమున మిక్కిలి జాలిగొలుపునట్లు వర్ణింపబడినది.

--- (రామా 5-5 6, 7, 8)

ఇచ్చట మూలమున నచ్చటచ్చట చెదరియున్న దశరథ విలాపసందర్భములను, కొన్నింటిని రామభద్రయ్య వర్ణించి యున్నాడు. పెక్కురు విమర్శకులకు వికటముగా కన్పించు—

"కానక కన్న సంతానంబుగావున
కానక కన్న సంతానమయ్యె
నరయగోత్ర నిధానమై తోచుగావున
నరయ గోత్రనిధానమయ్యె నేడు
ద్విజకులాదరణ వర్థిష్ణుండు గావున
ద్విజకులాదరణ వర్థిష్ణుడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుడయ్యె

కటకటా! దాశరథి సముత్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్రి కటకమార్గ
గామియెట్లు చరించునుత్కటకరీంద్ర
కటకలిత దాన ధారార్ద్రి కటక తటుల..." (5-12)

అను పద్య మిచ్చటనే కలదు. ఇంత దుఃఖములోనున్న దశరథుడు తన శోక ప్రకటనమునకై శబ్దచిత్రము నెన్నుకొనుట మిక్కిలి యనుచితముగా నున్నదని ప్రసిద్ధ విమర్శకులైన డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారు విమర్శించియున్నారు. కాని సూక్ష్మ పరిశీలనము చేసినపుడు అది అంత దోషము కాదేయో అని యనిపించును. దశరథుడు ఏ భాషలో మాటాడెనో మనకు తెలియదు. తెలుగులో మాత్రము కాదని నిస్సందేహముగా జెప్పవచ్చును. పైగా ఈ భావములు భాషపై నాధారపడని హృదయాంతర్గత విచారములు. మనస్సులో నుండి బయటకు రాని ఆవేదనాపూర్ణ భావములు. ఎవరితోడను బహిరంగముగా నొక భాష నాశ్రయించి చెప్పుకొనినవి కావు. కావున నవి కవి భావములే కాని దశరథప్రోక్తములు కావు. ఇట్టి సందర్భములలో అనౌచిత్యముగా భాసించు రచనలు మనకు వ్యాస వాల్మీకుల రచనలలోనే పెక్కులు కాన్పించును. ఉదాహరణమునకు ఆ గ్రంథములలో నొక్కొక్క దానినుండి యొక్కొక్క ఘట్టమును ఉటంకింతును. సంస్కృత భారతమున స్త్రీ పర్వమున కౌరవవీరుల పత్నులు పోలికలనికి వెళ్ళి తమతమ భర్తల బంధువుల శరీర ఖండములను ఏర్చి ఒకచో కూర్చి ప్రయత్నము జేయు ఘట్టమున భూరిశ్రవస్సు భార్యలు అర్జుననిచే శరీరమునుండి వేరు చేయబడిన తమ భర్త బాహుదండమును ముందర నిడుకొని ఇట్లు దుఃఖింతురు :

"అయంసరశనోత్కర్షీ పీన స్తన విమర్దనః
నాభ్యూరుజ ఘనస్పర్శీనీ విస్రంసనః కరః"
(భారతము - స్త్రీపర్వము, 24 అ, 19 శ్లో)

అని "ఈ చేయియే కదా మా మొలనూలును తొలగించుచుండి నది. ఈ చేయియే కదా మా బలిసిన స్తనములను మర్దించు చుండినది. ఈ చేయియే కదా మా బొడ్డును, తొడలను, పిరుదు లను స్పృశించుచుండినది. ఈ చేయియే కదా రతికై మా కో(పో)క ముడి విప్పుచుండినది" అని విలపించిరట. ఇది ఎంత అనౌచిత్యమో గమనింపుడు. ఆ సమయమున వారు ఏడ్వవలసిన విధ మది యేనా! ఇక రామాయణము అరణ్యకాండమున శ్రీరాముడు లేడిరూపమున నున్న మారీచుని వధించినప్పుడు వాడు "హా! సీతా! హా! లక్ష్మణా!" అని అరచిన స్వస్వరూపమును దాల్చి మరణించినట్లున్నది. అంతకుముందే అది రాక్షసమాయ యని తనకును, లక్ష్మణునకును జరిగిన సంభాషణములో తేలినది. కావున వాడు అరచిన "హా సీతా! హా లక్ష్మణా!" అను పద ములు సీతకెంత అనర్థమును కలిగించునో ఊహింపలేని అమా యకుడు కాడు శ్రీరాముడు. వెంటనే సీతాదేవి ప్రేరణచే లక్ష్మణుడు పర్ణశాలను వీడివచ్చును. సీత రాక్షసులచే అపా యమును పొందును. అని నిశ్చితముగా శంకించినట్లు ఆ వెను వెంటనే కలదు. అట్టి సమయమున శ్రీరాముడు :

"నిహత్య పృషతం చాన్యం మాంసమాదాయ రాఘవః ।
త్వరమాణో జనస్థానం ససా రాభిముఖ స్తదా ॥
(అరణ్య - 44 - 28)

అను శ్లోకము నందలి భావము ననుసరించి పర్ణశాలకు పోయి మాంసమును బాగుగా పక్వమొనరించి భక్షింపవలయునను

భావముతో ఇంకొక జింకను చంపి దాని మాంసమును దీసికొని శ్రీరాముడు పర్ణశాలాభిముఖుడై వెడలెనని కలదు. ఇది ఎంత యుచితమో ఆలోచింపుడు. శ్రీరాముడట్టి హృదయాందోళనమునకు గుఱియైన సమయమున మాంసార్థము మరొక జింకను చంపి ఓపికగా దాని మాంసమును పర్ణశాలకు దెచ్చుట సంభావ్యమా? అది అంగీకార్యమా? ఈ రెండు గ్రంథము లందలి సన్నివేశములు ఎంత అనుచితములో రామభద్రయ్య "కానకకన్న సంతానంబు కావున..." అను పద్యము నందలి శబ్దచిత్రణయు అంతే అనుచితము. ఇట్టి ఉదాహరణములను మన సాహిత్యము నుండి ఎన్నియేని చూపవచ్చును.

(14) నలువది యైదు నలువది యారు సర్గములలో మూలమున శ్రీరాముడు తన్ను వెంబడించిన ప్రజలకు సాంత్వన వాక్యములు చెప్పుచునే తమసానదిని చేరుట, నిద్రించుచున్న పౌరులను వంచించి రాత్రికి రాత్రియే శ్రీరామాదులు నదిని దాటి యావలకుబోవుట కలవు. ఇది తత్కాలోచితచర్యయే కాని మోసము కాదు. రామాభ్యుదయమున శ్రీరాముడు ప్రజలను సమాధానపరచిపోయినట్లున్నది.

(రామా 5 - 14, 17)

(15) నలువదియేడు నలువది యెన్మిది సర్గములలో మూలమున ప్రజలు దుఃఖితులై మరలి అయోధ్య జేరుదురు. అయోధ్యానగరము కాంతిహీనముగ గన్పట్టును. కాని ఈ విషయము కూడ రామాభ్యుదయమున లేదు.

(16) నలువది తొమ్మిది నుండి ఏబదిరెండవ సర్గము వరకు మూలమున శ్రీరామాదులు కోసలదేశమును దాటి, సరయూ, గోమతీ, స్యందికా నదులుత్తరించి గంగాతీరమున గుహుని నివాస

మగు శృంగిబేరపురమున విడియుట, లక్ష్మణుడు, గుహుడు, దశ రథాదుల పరిస్థితి దలచి దుఃఖించుట, మఱ్ఱిపాలతో తాము జడలు తీర్చుకొని సుమంత్రుని వెనుకకు బంపుట పడవనెక్కి గంగానదిని దాటుట మున్నగు విషయములు కలవు. ఇవియన్నియు మిక్కిలి సంక్షేపముగా రామాభ్యుదయమున చెప్పబడినవి.

(రామా 5 - 18 నుండి 28 దాకా)

(17) ఏబదిమూడవ సర్గము మూలమున మొదటి సారిగా శ్రీరాముడు దశరథుని కైకను నిందించినట్లు మాటాడును. రామాభ్యుదయమున నీ విషయము విడువబడినది.

(18) ఏబదినాలుగు, ఏబదియైదు సర్గములలో మూలమున గంగా యమునా సంగమ స్థానమున శ్రీరామాదులు భరద్వాజ మహర్షిని సందర్శించి, తాము నివసించుటకు ప్రశాంత వాతా వరణముగల స్థలము నిర్దేశింపగోరుదురు. భరద్వాజుడు చిత్ర కూటమును సూచింపగా తెప్పచే యమునను దాటి శ్రీరామా దులు చిత్రకూటము వైపు పయనింతురు.

(ఇచ్చట రామభద్రయ్య శ్రీరాముడు సీతనూరార్చుటకై 29 నుండి 49 వరకు అనగా 21 పద్యములు వ్రాసియున్నాడు. వాల్మీకమున సీత నోదార్చుట అచ్చటచ్చట చెదరియున్నది.

—(రామా. 5- 50 నుండి 59 దాకా)

(19) ఏబదియారవ సర్గములో మూలమున చిత్రకూట వర్ణ నము కొంచెముగా కలదు. రామాభ్యుదయమున నా వర్ణనము ఆరు పద్యములలో విశేషముగా జేయబడినది. మూలమున మూడు శ్లోకములలో వాల్మీక్యాశ్రమ వర్ణనము, ఆ ఋషిని దర్శించినట్లు కూడ కలదు. రామాభ్యుదయమున ఆ ప్రశంసయే లేదు. ప్రాయశః ప్రక్షిప్తములని తలంచెనేమో! (ఇచ్చటనే రామాభ్యుదయమున

కాకాసుర వృత్తాంతము 66 నుండి 71 వరకు ఆరు పద్యములలో నీయబడినది. కాని మూలమున నీ వృత్తాంతము ఇచ్చట లేదు. సుందరకాండమున సీతాదేవి శ్రీరామునకు తన యభిజ్ఞానము కొరకు హనుమంతునితో చెప్పినట్లున్నది.)

(20) ఏబది ఏడవ సర్గమునుండి అరువది రెండవ సర్గము వరకు మూలమున సుమంత్రుడయోధ్యజేరి శ్రీరామాదుల సందేశములను ప్రజలకు రాజునకు, రాణులకు విన్పించినట్లున్నది. ఇచ్చట శ్రీరాముని విశ్లేషముచే నిఖిల చరాచర జంతువులు పరిమ్లానము లైనట్లు వర్ణింపబడినది. కౌసల్య హృదయావేగము నాపుకొనలేక దశరథుని నిందించును. దశరథుడామెను క్షమింపగోరును. ఆమె భర్త మనస్సు నొప్పించినందుకు పశ్చాత్తప్త యగును. రామాభ్యుదయమున దశరథుడు సీతాదేవి కష్టములం దలచి దుఃఖించినట్లు కల్పింపబడినది.

—(రామా. పంచ. పద్య. 72-79)

(21) అరువదిమూడవ సర్గమునందు మూలమున దశరథుని శాపవృత్తాంతము కలదు. అది దశరథుడు కౌసల్యతో తన మరణమునకు కొన్ని ఘడియలు ముందుగా చెప్పినట్లున్నది. ఇది బాలకాండ భాగముననే వివరింపబడినది.

(22) అరువదినాల్గవ సర్గము (మూలము)న దశరథుని మరణము మాత్రమే వర్ణింపబడినది.

—(రామా. పంచ. 80-81)

(23) అరువది ఐదునుండి అరువది ఎనిమిది సర్గముల వరకు మూలమున వందిమాగధుల గానమువలన మేల్కొనని దశరథుని అంతఃపుర స్త్రీలు మృతునిగా గుర్తింతురు. దశరథుని శవము తైలద్రోణమునం దుంపబడును. 67 వ సర్గమున రాజులేని దేశ

మున అరాజక పరిస్థితులు ఎన్ని విధముల ప్రబలునో మిక్కిలి చక్కగా విపులముగా వివరింపబడినది. ఇవి యెవ్వియు రామాభ్యుదయమున లేవు. వసిష్ఠప్రేరితులై భటులు భరతుని దెచ్చుటకై కేకయ రాజధాని కేగుట సంక్షేపముగా గలదు.

—(రామా. పంచ. పద్య 82 మాత్రము)

(24) అరువదితొమ్మిది డెబ్బది సర్గములలో మూలమున భరతుడు దుస్స్వప్నబాధితుడై తండ్రి మరణమును శంకించి మాతులుని, మాతామహుని యనుజ్ఞగొని శత్రుఘ్నునితో అయోధ్యకు బయలుదేరును. ఇవి యెవ్వియు రామాభ్యుదయమున లేవు.

(25) డెబ్బదియొకటి నుండి ఎనుబది రెండవసర్గము వరకు మూలమున ఏడు రాత్రుల ప్రయాణమున భరతు డయోధ్యజేరి, అది కళాహీనముగా గన్పట్టుటచే అనిష్ట శంకచే తండ్రి గృహమున కేగును. అచ్చట తండ్రింగానక తల్లియొద్ద కేగి యామెనుండి సర్వ విషయములు తెలిసికొనును. భరతుడు అకార్య కరణమునకై తల్లిని నిందించును. శ్రీరాముని వనవాసప్రాప్తికై కౌసల్య ఎంత దుఃఖించుచున్నదో యని బాధపడును. ఆమె యెదుట తాను నిర్దోషినైనట్లు కఠిన ప్రతినలు చేయును. వసిష్ఠానుమతుడై భరతుడు తండ్రికి అగ్ని సంస్కారము నడపి, యాశౌచము గడపి, అస్థి సంచయనము చేయును. మంథరను శిక్షింప పూనుకొన్న శత్రుఘ్నుని అది శ్రీరామున కిష్టమైన పని కాదని వారించి, పెద్దలు తన్ను రాజ్యాభిషేకమునకై తొందరపెట్టుచున్నను, శ్రీరాముని తెచ్చుటకై తానడవులకు బోవ నిశ్చయించుకొనును. ఇచ్చట అరణ్యమార్గము రాజమార్గముగా తీర్పబడుట మిక్కిలి రమ్యముగా వర్ణింపబడినది. వసిష్ఠాదులచే ప్రజాప్రతినిధుల సభ జరుపబడును.

కాని భరతుడు, వారిని, వసిష్ఠాదులను, తల్లులను వెంటగొని పరిమిత సేనతో శ్రీరాముని వెనుకకు తోడ్కొని వచ్చుటకై బయలు దేరును. కొన్ని వదలినను రామాభ్యుదయమున ఈ విషయములన్నియు మిక్కిలిగా సంగ్రహింపబడినవి.

(రామా. పంచ. పద్య 83 - 91)

(26) ఎనుబది మూడు నుండి నూటొక్కటవ సర్గము వరకు మూలమున భరతుడు వసిష్ఠాదులతో, తల్లులతో గంగాతీరము చేరును. గుహుడు భరతుని ఆగమనోద్దేశమును పరీక్షించి యది దుష్టముగాదని విశ్వసించి వారి నందరను ఐదువందల (500) పడవలలో గంగను దాటించును. వారు భరద్వాజాశ్రమము చేరుదురు. భరద్వాజర్షియు భరతుని చిత్తశుద్ధిని పరీక్షించి గొప్పగా విందు చేసి చిత్రకూటమునకు మార్గము చూపును. అచ్చటికి చేరి భరతాదులు శ్రీరాముని పర్ణశాలను గుర్తింతురు. భరతుని గుర్తించి సేనతో వచ్చిన యతని యుద్దేశమును శంకించి లక్ష్మణుడు క్రోధమూర్తి కాగా శ్రీరాము డతనిని సాంత్వన వాక్యములచే శాంతపరచును. భరతుడొక్కడు ముందుగా పాదచారియై శ్రీరాము నొద్దకు పోవును. దశరథ మరణ వృత్తాంతము శ్రీరామాదులు తెలిసికొని మిక్కిలిగా విలపింతురు. ఇవన్నియు రామాభ్యుదయమున మిక్కిలిగా సంక్షేపింపబడినవి. పూర్తిగా వదలివేయబడినవన్నను దోషము లేదు.

—(రామా. పంచ. 92–95)

(27) నూటరెండు నుండి నూటపదునైదవ సర్గము వరకు మూలమున శ్రీరాముడు తండ్రికి తర్పణము వదలిన వెనుక, తల్లులను గురువులను కలిసికొనును. అందరును శ్రీరాముని అయోధ్యకురా నాహ్వానింతురు. కాని యతడు నిరాకరించును. జాబాలి యన్న

ముని చార్వాకమత మవలంబించి శ్రీరాముని ఒప్పింప ప్రయత్నించును. కాని శ్రీరాముడు వైదిక మతాధారమున జాబాలిని నిరుత్తరుం జేయును. వసిష్ఠుడు సూర్యవంశాచారము ననుసరించి రాజ్యము జ్యేష్ఠునిదే యని శ్రీరాముని సమాధాన పరుప ప్రయత్నించును. గుర్వాజ్ఞకంటె పిత్రాజ్ఞ బలవత్తరమని శ్రీరాముడు సమాధానించును. భరతుడు విధిలేక సమాధానపడి శ్రీరామ పాదుకలతో వెనుదిరిగి వచ్చి నందిగ్రామమున వానికి పట్టాభిషేక మొనరించును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవనియే చెప్పవచ్చును. పాదుకాపట్టాభిషేక విషయము మాత్రము ఒక్క పద్యములో చెప్పబడినది.

—(రామా. పంచ. పద్య. 96-101)

28. నూటపదునారు నుండి నూటపందొమ్మిదవ సర్గమువరకు మూలమున రాక్షస బాధకు వెఱచి మునికులపతి తక్కిన మునులతో చిత్రకూటము వదలును. శ్రీరామాదులు అత్రి మహాముని యాశ్రమము జేరుదురు. అనసూయ సీతాదేవికి పతివ్రతా ధర్మములు బోధించును. ఆ పై దండకారణ్యమునకు ప్రయాణము. ఇవి ఎవ్వియు రామాభ్యుదయమున లేవు.

8

# అరణ్యకాండము



సంస్కృత మూలమున ఆరణ్యకాండము 75 సర్గములతో 2732 శ్లోకములుగా విస్తరించియున్నది. రామాభ్యుదయమున ఆరణ్యకాండ కథ 152 పద్య గద్యములలో ముగింపబడినది. రామభద్రయ్య బాలకాండ కథను 566 పద్య గద్యముల వరకు పెంచి యున్నాడు. మూలమున బాలకాండము ఆరణ్యకాండము దాదాపు సమాన పరిమాణము కలవిగా నున్నవి. ఐనను బాలకాండ కథ చాల పెంచబడినది. దానికి కారణములు ఎచ్చటి వచ్చటనే వివరించి యున్నాను. అట్లే అయోధ్యాకాండ కథ బాలకాండము కంటెను ఆరణ్యకాండము కంటెను పరిమాణమున రెండింతలే యైనను రామాభ్యుదయమున ఆ కథాభాగము మిక్కిలి సంక్షేపింపబడి కేవలము 101 పద్య గద్యములవరకే విస్తరించియున్నది. దానికిని సంభావ్యములైన కారణము లీయబడినవి. ఆరణ్యకాండ కథ మాత్రము బాలకాండ కథవలె అతివిస్తృతి కలిగియుండ లేదు. మరియు అయోధ్యాకాండ కథవలె మిగుల సంక్షిప్తము కాదు. ముఖ్యములైన విషయము లేవియు వదలకుండ, రసవత్తర ఘట్టములకు తగినంత ప్రాతినిధ్యము నిచ్చి, రసహీనములగు పట్టులను కేవలము సూచనప్రాయముగ వదలి, భారత కవులవలెనో కనిర్దిష్ట పద్ధతిలో ననుసరించి యున్నాడు. ఈ పద్ధతి యుద్ధకాండాంతము వరకు పాటించెనని చెప్పవచ్చును.

1. ఒకటవ సర్గము మూలమున శ్రీరామాదులు దండ కారణ్యము ప్రవేశింతురు. మునులు తమ్ము రాక్షసుల బాధనుండి రక్షింపుమని రాముని ప్రార్థింతురు. ఈ విషయము శ్రీరామాభ్యుదయమున లేదు. మూలమున దండకారణ్య వర్ణనమే లేదు. ఇచ్చట పూర్తిగా నొక్క పుటయంతయు వ్యాపించిన వచనము నందు దానిని రామభద్రయ్య అతివేలముగా వర్ణించియున్నాడు. రామాయణమున నచ్చటచ్చట వాల్మీకి వర్ణించిన విషయమునుబట్టి దండకారణ్యము రావణ పాలితము. అచ్చట చెల్లెలైన శూర్పణఖను స్వేచ్ఛాజీవితము గడుప ననుమతించి ఆమెకు రక్షకులుగా తమ్ముడైన ఖరుని పదునాలుగు వేల వీర రాక్షససేనతో, దూషణాత్రి శిరులతో తనకు ప్రతినిధిగా దండకారణ్యమున రావణుడుంచి యున్నాడు. వారు ఆ యరణ్యమున విచ్చలవిడిగా సంచరించుచు, అచ్చటి ఋషులకు వర్ణింపరాని ఉపద్రవములు కల్గించుచున్నారు. ప్రధాన వ్యక్తియైన శూర్పణఖ వలననే ముందటి కథ యంతయు నడువవలయును. దండకారణ్యము కథలోనంత ప్రాధాన్యము వహింపవలసి యున్నది. కనుకనే రామభద్రయ్య ఆ యరణ్యము నంత గొప్పగా వర్ణించియున్నాడు.

(రామా. పంచ. పద్య 102-107)

2. రెండు మూడు నాలుగు సర్గములలో మూలమున విరాధవధ గాథ కలదు. వికారరూపుడగు విరాధుడు మొదట సీతాదేవిని ఆహారార్థము పట్టి చంక నిరికించుకొనును. లక్ష్మణు డెదిరింపగా సీతాదేవిని విడిచి శ్రీరామలక్ష్మణుల నిరువుర నెత్తి కొని పరుగిడును. శ్రీరామాదులు విరాధుని చేతులు నరుకగా వానికి పూర్వ జన్మజ్ఞానము కల్గి తాను తుంబురుడైనట్లు చెప్పి వారిని శరభంగాశ్రమమునకు పోవ నిర్దేశించును. విరాధుని

శవమును భూమిలో పూడ్చి వేయుదురు. ఇదియంతయు రామా భ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా చెప్పబడినది.

(రామా. పంచ. పద్య 108-109)

3. ఐదవ సర్గము మూలమున శ్రీరామాదులు శరభంగ మహర్షిని దర్శింతురు. అప్పటికే అచ్చటకు వేంచేసియుండిన దేవేంద్రుని, దేవతలను వారి త్రిదశత్వమును (నిత్య యౌవనత్వ మును) బట్టి శ్రీరాముడు గుర్తించి లక్ష్మణునితో చెప్పును. శర భంగుడు శ్రీరామాదులను సుతీక్ష్ణమునిని దర్శింపుడని కోరి తా నగ్నిప్రవేశము చేయును. ఇదంతయు కూడ రామాభ్యుదయమున మిక్కిలిగా సంక్షేపింపబడినది.

(రామా. పంచ. పద్య 110-111)

4. ఆరునుండి పదునొకండవ సర్గమువరకు మూలమున ఋషులు తమ్ము రాక్షసుల బారినుండి రక్షింప వేడగా శ్రీరాముడు రాక్షసులను జంపి వారిని కాపాడ ప్రతినబూనును. సుతీక్ష్ణమునిని దర్శింపగా నతడును తమ్ము మృగబాధనుండి కాపాడకోరును. ఆ మహర్షి కోరికపై శ్రీరాముడు పరిసరములందలి మున్యాశ్రమము లను దర్శించును. రాక్షసులతో నిష్కారణ వైరము పూనవలదని సీతాదేవి రాముని మందలించును. స్వయముగా మనకు కీడొన రింపని వారిని రాక్షసులనైనను సరియే చంపిన యెడల మనకు లేని క్రూరత్వమలవడుననియు, పూర్వము ఉగ్రతపోదీక్షతోనున్న యొక మహర్షి చిత్తశుద్ధిని శంకించి ఇంద్రుడే క్షత్రియ వేషమున వచ్చి తాత్కాలికముగా నా ఋషి చేతికి ఒక ఖడ్గమునిచ్చి తాను మరల వచ్చువరకు దానిని భద్రపరచి యుంచుమని యదృశ్యుడు కాగా నా మహర్షియు ఖడ్గము నుబుసుపోకకు చెట్లను, లతలను, ప్రాణు లను నరకుట కుపయోగించి క్రౌర్యమును సంపాదించి తపోభ్రష్టు

డయ్యెనని యు ఉదాహరణముగా చెప్పును. శ్రీరాముడు తాను ఋషులకు ముందే వారిని కాపాడునట్లు ప్రతిన చేసితిననియు, ప్రతిజ్ఞాపాలనము తన కర్తవ్యమనియు చెప్పును. తరువాత వారు పంచాప్సరస్సరస్సును జూచి ధర్మభృత్తను మునిచే దాని చరిత్రమును, మాండకర్ణి చరిత్రమును తెలిసికొందురు. శ్రీరామాదులు మున్యాశ్రమములలో పది సంవత్సరముల కాలము నివసింతురు. సుతీక్ష్ణముని యాదేశముపై వారు అగస్త్యాశ్రమము నుద్దేశించి పోదురు. అగస్త్యుని మహిమలను, వాతాపీబిల్వలుల కథను శ్రీరాముడు లక్ష్మణునకు చెప్పును. ఇచ్చటనే అగస్త్యభ్రాత వృత్తాంతము వచ్చును. ఇవి యెవ్వియు రామాభ్యుదయమున లేవు.

5. పండ్రెండవ సర్గము మూలమున లక్ష్మణుడు అగస్త్యశిష్యునిద్వారా శ్రీరామాగమనమును ఆ ఋషికి దెలిపి వారగస్త్యాశ్రమమును ప్రవేశింతురు. రామాభ్యుదయమున అగస్త్యాశ్రమ వర్ణనము మూలమునకు మించియున్నది. మూలమున అగస్త్యుడు, బాణ, బాణాసనాదులు శ్రీరామున కిచ్చిన విషయము మాత్రము ఒక్క పద్యములో రామభద్రయ్య సూచించియున్నాడు.

(రామా. పంచ. పద్య 112-123)

6. పదుమూడవ సర్గము మూలమున పంచవటీ వర్ణనమును, సీతాదేవియొక్కయు, లక్ష్మణునియొక్కయు గుణగణములను అగస్త్యుడు కీర్తించుటయు కలవు. శ్రీరామాదులు పంచవటిని ప్రవేశింతురు. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

7. పదునాల్గవ సర్గము మూలమున జటాయువు శ్రీరామాదులకు మొదటిసారిగా కన్పించుటయు, తాను దశరథ సఖుడైనట్లు

చెప్పుటయు కలదు. ఇచ్చటనే జటాయువు తన వంశ చరిత్రము నంతయు వివరించును. రామాభ్యుదయమున నివి యెవ్వియు లేవు.

8. పదునైదవ సర్గము మూలమున నానావృక్షముల దారువులను సంగ్రహించి లక్ష్మణుడు పర్ణశాల నిర్మించును. ఇది కేవలము సూచింపబడినది.

—(రామా. పంచ. పద్య 124)

9. పదునారవ సర్గము మూలమున హేమంతవర్ణనము కలదు. రామాభ్యుదయమున కూడ హేమంత వర్ణనము చేయబడినది. కాని అది యంతయు మూలానుసారి కాక ప్రబంధ శైలిలో, పద్ధతిలో చేయబడినది.

—(రామా. పంచ పద్య 125- 32)

10. పదునేడు, పదునెనిమిది సర్గములలో మూలమున శూర్పణఖ తన రాక్షసరూపముతోడనే శ్రీరాముని జూచి మోహించును. తన యొక్కయు రావణునియొక్కయు చరిత్రమును వైభవమును వివరించును. సీతాదేవి నాక్రమింపబోయిన శూర్పణఖను శ్రీరామానుమతిని లక్ష్మణుడు విరూపంజేయును. రామాభ్యుదయమున శూర్పణఖ కామ (సుందర) రూపము దాల్చినది. లక్ష్మణుని ప్రసక్తియే లేదు. శ్రీరాముడే ఆమె కర్ణ నాసాచ్ఛేదము చేసినట్లున్నది.

—(రామా. పంచ. పద్య 133-141)

11. పందొమ్మిదవ సర్గమునుండి ముప్పదవ సర్గమువరకు మూలమున శూర్పణఖా ప్రేషితులైన ఖరదూషణ త్రిశిరులు పదునాలుగువేల సేనతో శ్రీరామునిపై గవిసి మడియుదురు. మొదట పదునాలుగు మంది రాక్షసులు మాత్రమే వచ్చి శ్రీరామునిచే చత్తురు. వెంటనే ఖరుడు తమ్ముడైన దూషణునితో,

కొంత సేనతో శ్రీరాముని పైకి వచ్చును. సామాన్య రాక్షసులు వేల సంఖ్యలో నిహతులైన పిదప, దూషణుడు ఐదు వేల మందితో వచ్చును. సేనాధిపతియైన త్రిశిరుడు తరువాత మడియగా కడపట ఖరుడు శేషించిన సేనతో గూడ నిహతుడగును. మూలమున నీ ఘట్టము పండ్రెండు సర్గములలో వ్యాపించియుండగా, రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా కేవలము పండ్రెండు పద్యములలో చెప్పబడినది. భవభూతి రచితమైన ఉత్తరరామ చరిత్రమున చంద్రకేతువు లవుని యుద్ధమున సంధించినపుడా బాలుడు శ్రీరాముని గూర్చి "ఖరునితోడి యుద్ధమున రాముడు వెనకడుగు వేసిన పిరికి" అని ఆక్షేపించిన దానికి ఆధారభూతమగు శ్లోకము ఈ ముప్పదవ సర్గమునందే యున్నది. ఖరుడు రక్తప్లావితాంగుడై శ్రీరాముని పైకి రాగా 'బాణము విడువనవకాశము గల్గుటకును, ఖరుని మేని రుధిర దుర్గంధము సహింపజాలక పోవుటవలనను శ్రీరాముడు కొంచెము వెనుకకుపోయెను. అంతేకాని వాని పరాక్రమమునకు వెఱచికాదు. ఆ శ్లోకము క్రిందిది :

> "తమాపతన్తం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతమ్,
> అపాసర్ప త్ప్రతి పదం కించి త్త్వరిత విక్రమః॥
>
> ... (వాల్మీకి. అరణ్య. సర్గ. 30 శ్లో. 23)

12. ముప్పదియొకటవ సర్గము మూలమున రావణ చారుడగు అకంపనుడు హతశేషుడై ఖరవధ వృత్తాంతము రావణునితో చెప్పును. వెంటనే రావణుడు మారీచాశ్రమమునకు వెళ్ళి, యతనితో నాలోచించి యతడిచ్చిన హితబోధను మన్నించి లంకకు తిరిగివచ్చును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

13. ముప్పదిరెండు, ముప్పదిమూడు, ముప్పదినాలుగు సర్గములలో మూలమున శూర్పణఖయే స్వయముగా రావణుని యెదు

టకుపోయి తన యవమాన గాథయంతయు చెప్పికొనినను చలింప నట్లున్న రావణుని నిందావహేళన ధ్వనితో గూడిన రాజకర్తవ్య బోధ సేయును. రావణునకు పౌరుషము గలుగునట్లు వాని చేతగాని తనమును ఎత్తి పొడుచును. ఇచ్చట రావణుని ప్రాభవము గొప్పగా వర్ణింపబడినది. ఆమె రామలక్ష్మణులను ముఖ్యముగా సీతాదేవి అందమును వర్ణించును. ఇదంతయు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా ఒక్క వచనమున జెప్పబడినది.

—(రామా. పంచ. వచ. 154)

(ఒక్క స్త్రీ పురుషుని కీలెరిగి ఎట్లు రెచ్చగొట్టగలదో ఆ నైపుణ్య మిచ్చట (మూలమున) పరాకాష్ఠ నందుకొన్నది రామ భద్రయ్య ఇంతటి రమణీయమైన సన్నివేశమును వదలుకొనుట శోచనీయము.)

**14.** ముప్పదియైదవ సర్గము మూలమున రావణుడు రెండవ సారి మారీచాశ్రమమునకు పోవునప్పుడు మార్గమునందలి సముద్ర తీర వర్ణనము మిక్కిలి సహజముగా, ప్రకృతి పరిశీలనా దృష్టితో చేయబడినది. ఈ విషయము రామాభ్యుదయమున వదల బడినది.

**15.** ముప్పదియారవ సర్గమునుండి నలువది రెండవ సర్గము వరకు మూలమున రావణుడు మారీచుని సహాయముడుగగా వాడు శ్రీరాముని పరాక్రమము అజేయమని వర్ణించి హితము చెప్పెను. రావణుడది వినక వానిని బెదిరించి చుక్కల జింకగామారి సీతా దేవిని ప్రలోభ పెట్టగోరును. సీతాదేవి నపహరించుటవలన కలుగు స్వజాతి నాశరూపానర్థములను మారీచు డెంత వికరువు పెట్టినను రావణుడు విననందున తన చావెట్లయినను సిద్ధమని యతడు బంగారు చారల లేడియై సీతాదేవికి కన్పడునట్లు పర్ణశాల

యెదుటకు వచ్చును. ఇదంతయు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా చెప్పబడినది.

—(రామా. పంచ. పద్య. 155-161)

16. నలువదిమూడు నలువదినాలుగు సర్గములలో మూలమున సీతాదేవి శ్రీరామునితో నా చుక్కల జింకను సప్రాణముగగాని, శవరూపమునగాని తెచ్చి యిమ్మని ప్రార్థించును. లక్ష్మణుడు మారీచుని మాయలమారి చేష్టలను జ్ఞప్తికి తెచ్చి వారించుచున్నను శ్రీరాముడు జింక వెంట వెడలిపోవును. మారీచు డెంతకును దొరకక మిక్కిలి అలయించుటచే శ్రీరాము డలిగి వానిని బాణహతుని చేయును. చచ్చునపుడు "హా సీతా! హా లక్ష్మణా!" యని యఱచి వాడు చచ్చును. రామాభ్యుదయమున నిది మిక్కిలి సంక్షేపముగా జెప్పబడినది.

—(రామా. పంచ. పద్య. 162-166)

17. నలువదియైదవ సర్గము మూలమున నిష్ఠురములగు సీతాదేవి నిందా వాక్యములను భరింపలేక లక్ష్మణుడు అన్న జాడ లరయబోవును. ఇచ్చట కూడ రామభద్రయ్య మిక్కిలి సంక్షేపించి యున్నాడు.

—(రామా. పంచ. పద్య. 167-173)

18. నలువదియారవ సర్గమునుండి నలువది తొమ్మిదవ సర్గమువరకు మూలమునందు సన్యాసి వేషమున రావణుడు సీతాదేవి యున్న పర్ణశాలకు వచ్చును. కొంత సవ్యమగు సంభాషణ జరిగిన పిదప వాడు తన నిజరూపమును వెల్లడించినపుడు సీతాదేవి వానిని తిరస్కరించి మాటాడును. రావణుడు తన పరాక్రమ విశేషముల నన్నింటిని వర్ణించి చెప్పినను సీతాదేవి వానిని లెక్కింపకుండును. రావణుడు వేరు మార్గములేక సీతాదేవిని

బలవంతముగా గ్రహింప నామె శ్రీరాముని, లక్ష్మణుని పేర్కొనుచు దారిలో తటస్థపడిన జటాయువును సహాయమడుగును. రామాభ్యుదయమున నిదియు మిక్కిలి సంగ్రహింపబడినది.

—(రామా. పంచ. పద్య. 174-190)

19. ఏబది, ఏబదియొకటవ సర్గములలో మూలమున జటాయువు రావణు నెదిరించి పోరి, సారథిని, అశ్వములను చంపి, రథమును విఱిచి, రావణుని విరథునిచేసి బాధించును. కడకు వార్థక్యహేతువుచే అలసిపోయి రావణుని ఖడ్గధారచే పక్షము తెగి నేలగూలును. ఈ యుద్ధము రామాభ్యుదయమున ఒక్క వచనమున మూలమున కంటె రసవత్తరముగ వర్ణింపబడినది.

—(రామా. పంచ. పద్య. 191-203)

20. ఏబదిరెండు, ఏబదిమూడు, ఏబదినాలుగు సర్గములలో మూలమున సీతాదేవి శరీరావయవములనుండి కొన్ని నగలు, కొన్ని నగల భాగములు జారి నేలరాలును. ఆమె శ్రీరామాదులను పేర్కొని గట్టిగా విలపించును. శ్రీరాముడు లేనప్పుడు దొంగవలె తన్ను తెచ్చినందుకు వాని పిరికితనము నెత్తి పొడుచును. దారిలో నొక కొండ నెత్తముపై నున్న నలువురు వానరుల నడుమ సీతాదేవి తన యాభరణముల నొక యుత్తరీయమున కట్టి పడవేయును. రావణుడు మొదట సీతాదేవిని తన యంతఃపురముననే యుంచి, ఎనిమిది మంది వీరులగు రాక్షసులను జనస్థానమున కనుపును. రామాభ్యుదయమున సీతాదేవి విలాపమే ఎక్కువగాగలదు, తక్కిన విషయములు లేవు.

—(రామా. పంచ. పద్య. 204-214)

21. ఏబదియైదు ఏబదియారు సర్గములలో మూలమున రావణుడు తన నగరి వైభవమును తన యైశ్వర్యమును జూపి సీతాదేవిని ప్రలోభపెట్ట ప్రయత్నింపగా నామె వానిని లెక్కింపక

ధర్షించి మాట్లాడును. పిదప రావణు డామెను అశోకవనమునకు మార్చి యచ్చట రాక్షస స్త్రీలను కావలియుంచి ఆమెకు మనస్సు మార్చుకొనుటకై పండ్రెండు మాసముల గడువు నిచ్చును. ఈ రెండు సర్గములందలి విషయము రామాభ్యుదయమున లేదు.

22. ఏబదిఏడవ సర్గమునుండి అరువదియారవ సర్గమువరకు మూలమున శ్రీరాముడేదో అనిష్టమును శంకించుచు పర్ణశాలాభిముఖుడై అతివేగముగ వచ్చుచుండగనే లక్ష్మణు డెదురు వచ్చుటయు, శ్రీరాముడు ఆశ్రమమున సీతాదేవిని గానక దుఃఖించుటయు, సీతాదేవి నిందావాక్యములను భరింపలేక లక్ష్మణుడు పర్ణశాలను వీడి రావలసిన పరిస్థితి యేర్పడినట్లు వివరించుటయు, శ్రీరాముడు సీతాదేవిని గూర్చి మృగ, పక్షి, లతాదుల నడుగుటయు, చేతనా చేతన వివక్షము మఱచి ప్రవర్తించి యొకప్పుడు నిరాశుడై, మరొకప్పుడు అరణ్య వ్యవసాయియై లక్ష్మణుని అయోధ్యకు పొమ్మనుటయు, లక్ష్మణుడు అన్న నోదార్ప ప్రయత్నించుటయు, సీతాదేవిని గోదావరీతీర ప్రదేశములందు వెదకి, మృగపక్ష్యాదులు దక్షిణ దిఙ్మార్గమును తమకు సూచించుచున్నట్లు భ్రమించి రామలక్ష్మణులు ఆ దిక్కుగా ప్రయాణము సాగించి ప్రస్రవణగిరి సమీపమున రావణ జటాయువుల యుద్ధ చిహ్నములను గుర్తించుటయు, మున్నగు విషయములు గలవు. ఈ ఘట్టమున రామభద్రయ్య భాగవతము నందలి గోపికలు శ్రీకృష్ణుని కొఱకు వెదకు ఘట్టమును అనుకరించినట్లున్నది.

— (రామా. పంచ. పద్య. 215-246)

23. అరువది ఏడు, అరువది యెనిమిది సర్గములలో మూలమున జటాయువు సీతను రావణు డపహరించినట్లు శ్రీరామలక్ష్మణులకు చెప్పగలిగియు, వాని యునికి మున్నగు విషయములు చెప్ప ప్రయత్నించి శక్తిహీనుడై మరణించును. శ్రీరామలక్ష్మణులు

పితృసఖుడగు జటాయువునకు ప్రేతసంస్కార మొనర్తురు. రామా భ్యుదయమున నిదియు రెండు పద్యములకు కుదింపబడినది.
—(రామా. పంచ. పద్య. 249.250)

24. అరువది తొమ్మిదినుండి డెబ్బదిమూడవ సర్గమువరకు మూలమున లక్ష్మణుడు అయోముఖియను రాక్షసికి శూర్పణఖకు వలెనే కర్ణనాసాచ్ఛేదము చేయును. శ్రీరామలక్ష్మణు లిరువురు కబంధునిచే పట్టుబడి వాని భుజములు నరుకుదురు. కబంధుడు తన శాపవృత్తాంతము, తన్నివృత్తి విధము తెలిసి సీతాదేవి యునికి తాను చెప్పలేకున్నను ఆ సమాచారము సంపాదించుటలో మరో విధముగా సహాయపడుదునని చెప్పి తన దేహమున కగ్నిసంస్కారము గావింప శ్రీరామలక్ష్మణులను ప్రార్థించును. దివ్యదేహము ధరించినగాని తానేమియు చెప్పనేరనని తెలిసి వాడావిధముగ చేయగోరెను. అట్లు దివ్యదేహధారియై కబంధుడు యక్షుడై సుగ్రీవ వృత్తాంతము దెల్పి, అతడు పంపాసరస్తీరమున నున్నాడనియు, అతనితో స్నేహము జేసినచో సీతాదేవిని వెదకి పెట్టుటలో నతడు తప్పక తోడ్పడుననియు చెప్పును. అచ్చటనే శబరి యను నొక వృద్ధ భక్తురాలున్నదనియు, ఆమెను తప్పక దర్శింపుడనియు చెప్పి విరాధుడు నిష్క్రమించును. ఈ భాగమంతయు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగ మూడు పద్యములలో చెప్పబడినది. -- (రామా. పంచ. పద్య. 151-253)

25. డెబ్బదినాలుగు డెబ్బదియైదు సర్గములలో మూలమున శ్రీరామలక్ష్మణులు పంపాసరస్తీరమున శబరిని చూచి ఆమె యమాయిక భక్తికి ముగ్ధులగుదురు. యోగబలమున శబరి శరీర త్యాగము చేయును. శ్రీరాముడు లక్ష్మణుని సుగ్రీవు నొద్దకు పంప నిశ్చయించును. ఈ భాగము రామాభ్యుదయమున లేదు.

9

# కిష్కింధాకాండము



వాల్మీకి రామాయణమున కిష్కింధాకాండము అరువది ఏడు సర్గములతో 2432 శ్లోకములుగా విస్తరించియున్నది. బాల కాండమునకంటె 200 శ్లోకములు ఇందు ఎక్కువగా గలవు. అరణ్యకాండమునకంటె 300 శ్లోకములు ఇందు తక్కువగాగలవు. రామాభ్యుదయమున కిష్కింధాకాండము 161 పద్య గద్యములతో ముగింపబడినది. మిక్కిలిగా పెంచబడుట బాలకాండమునకును, మిక్కిలిగా కుదింపబడుట అయోధ్యాకాండమునకును మన రామ భద్రయ్య పరిమిత మొనర్చియున్నాడు. తక్కిన నాలుగు కాండము లందలి కథయు మూలమునందలి ముఖ్య విషయములను వదలక క్రొత్తవి చేర్చక ఒకే ప్రణాళికపై ఆధారపడి ప్రబంధముగా సాగించియున్నాడు.

1. ఒకటవ సర్గము మూలమున పంపా సరస్తీరమున శ్రీరాముడు సీతా విరహము ననుభవించుట చాల విపులముగా, దీర్ఘముగా వర్ణింపబడినది. రామాభ్యుదయమున నిదియంతయు విడువబడినది. కాని యీ వివరమంతయు అరణ్యకాండ భాగమున పంచమాశ్వాసము 224 నుండి 245వ పద్యమువరకు గల 22 పద్యములలో వర్ణించియున్నాడు. కాని నిజమునకు శ్రీరాముడప్పుడు పడిన బాధ విరహముగా నిర్వచింపలేము. సీతాదేవి కానరా

నందున కల్గిన దుఃఖావేగము మాత్రమే మూలమున వర్ణింప బడినట్లు పంపా సరస్తీరమున లభించు విరహోద్దీపనమునకు కావల సిన విభావ సామగ్రి రామభద్రయ్య వర్ణించినచోట అంతగా లేదు. ఇచ్చట రామభద్రయ్య సుగ్రీవాదులు శ్రీరామలక్ష్మణులను చూచి బెదరినట్లు మాత్రమే వర్ణించియున్నాడు.

—(రామా. పంచ. పద్య. 254-258)

2. రెండునుండి ఐదవ సర్గమువరకు మూలమున మిక్కిలిగా బెదరిన సుగ్రీవుని హనుమంతుడు మందలించి, అతని కోరికపై శ్రీరామలక్ష్మణు లున్నచోటికి పోవును. హనుమంతుడు బ్రహ్మ చారి వేషమున శ్రీరామలక్ష్మణులను దర్శించి వారి చరిత్రము నడిగి తెలిసికొని తాను సుగ్రీవ సచివుడైనట్లు తెలిసికొనును. హనుమంతుని మాట నేర్పరితనము, సంస్కారయుతమైన భాషా శైలి, పాండిత్య ప్రకర్షకు శ్రీరాముడు ముగ్ధుడై లక్ష్మణునకా అభి ప్రాయమును వివరించును. లక్ష్మణుడు తామెవ్వరైనదియు వివ రించి, అవసరము కాన శ్రీరాముడు సుగ్రీవుని శరణము కోరి సహాయార్థియై వచ్చినట్లే చెప్పును. హనుమంతుడు వారిని ఋష్య మూకమునకు తోడ్కొనిపోయి శ్రీరామ సుగ్రీవులకు సఖ్యము చేయును. శ్రీరాముడు సుగ్రీవుని బాధలు విని, అవి తన బాధల వంటివే కాన వాలిని చంప వాగ్దానము చేయును. రామాభ్యుదయ మున నీ విషయము లన్నియు మిక్కిలి సంక్షేపముగా చెప్ప బడినవి.

(రామా. పంచ. పద్య. 259-277)

3. ఆరవ సర్గము మూలమున సీతాదేవి తమపై పడవేసిన నగలను వానిని కట్టిన ఉత్తరీయముతో సహా సుగ్రీవుడు శ్రీరామ లక్ష్మణులకు చూపును. శ్రీరామ లక్ష్మణులు వానిని సీతాదేవి

నగలనియే గుర్తింతురు. ఇచ్చట మూలమున లక్ష్మణుని శీలమునకు మెరుగుపెట్టుచు విరివిగా ప్రజలలో ప్రచారముననున్న

"నా హం జానామి కేయూరే నా హం జానామి కుండలే।
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభి వందనాత్ ॥"

(ఈ భుజకీర్తుల జంటనుగాని, కుండలముల జంటనుగాని నేను గుర్తింపలేను. ఈ నూపురముల జంటను మాత్రము - నిత్యము సీతాదేవి పాదాభివందనము చేయు నలవాటున్నందున ఇవి ఈమెవే యని గుర్తింపగలను) అను శ్లోకమున్నది. ఇక సీతాదేవి నెత్తుకొని పోయిన రావణుని నివాసమెచ్చటనో ఎవరైనా చెప్పగలరా యని సుగ్రీవాదులను శ్రీరామలక్ష్మణులు ప్రశ్నింతురు. రామాభ్యుదయమున ఇట్టి మనోహర ఘట్టముకూడ సంగ్రహింపబడుట శోచనీయము.

(రామా. 5-278-286)

4. ఏడవ సర్గము మూలమున అతిశయముగా దుఃఖించుచున్న శ్రీరాముని సుగ్రీవు డోదార్చును. వాలిని చంపుటకై చేయవలసిన తరువాతి యత్నమునకై వేచియుందురు.

(రామా. పంచ. పద్య. 287-290)

5. ఎనిమిది, తొమ్మిది, పది సర్గములలో మూలమున వాలి పరాక్రమ విశేషములను సుగ్రీవుడు శ్రీరామునకు వివరించుచు, వాలి మాయావి యను రాక్షసుని చంపిన కథయు, వారు యుద్ధము చేయుచు గుహలో ప్రవేశించిన వెనుక వాలిచేత చంపబడిన మాయావి బృహత్కాయము నుండి వెడలిన రక్తము గుహాముఖమునకు రాగా వాలియే మరణించెనని సుగ్రీవుడు గుహాముఖమున పెద్ద గండశిల నుంచి వచ్చి కిష్కింధారాజ్యమును ఆక్రమించుటయు, తరువాత వాలి వచ్చి సుగ్రీవునిపై కోపించి యతనిని

భూమండలమంతయు తిరుగునట్లు తరిమికొట్టుటయు గలవు. ఈ విషయములన్నియు పూర్తిగా రామాభ్యుదయమున వదలివేయ బడినవి.

6. పదునొకండవ సర్గము, పండ్రెండవ సర్గములో పండ్రెండవ శ్లోకమువరకు మూలములో సుగ్రీవుడు శ్రీరాముని బలము పరీక్షింపదలచి మహిషరూపుడైన దుందుభి యను రాక్షసుని వాలి వధించిన విధమును అభివర్ణించును. దుందుభి మొదట సముద్రుని, పిదప హిమవంతుని యుద్ధమడిగి ఆపై హిమవంతునిచే ప్రేరితుడై వాలిని యుద్ధమున కాహ్వానించి అతనిచేత మడియును. దుందుభి కళేబరమును కోపవశమున వాలి దూరమున విసిరివేయగా నది ఋష్యమూకముపై గల మతంగ మున్యాశ్రమ భూమిపైబడి యా ప్రదేశమును రక్తప్లావిత మొనర్చును. అది చూచి యా ఋషి కోపించి ఆ పనిచేసినవాడు, వాని మిత్రులు, ఆ యాశ్రమ భూమికి ఆమడదూరమున నెచ్చటికి వచ్చినను మరణించునట్లు శపించెను. అందువలననే తాను తన మిత్రులతో నా ఋష్యమూకము నాశ్రయించినట్లు సుగ్రీవుడు చెప్పి శ్రీరాముడు ఆ దుందుభి కళేబరమును కాలితో మీటునట్లు చేయును. అది యిప్పుడు భారరహితమై నందున సుగ్రీవునకు శ్రీరాముని బలముపై ప్రత్యయము కుదురక అతనిచే ఒక్క బాణముచేత సప్తతాళచ్ఛేదము చేయించును. దుందుభి కళేబరమును మీటుట, సప్తతాళములు ఛేదించుటతప్ప తక్కిన వివ్వియు రామాభ్యుదయమున లేవు.

(రామా. పంచ. పద్య. 291-301)

7. పండ్రెండవ సర్గ శేషమున మూలమునందు శ్రీరాముని చే ఉత్సాహపరుపబడిన సుగ్రీవుడు కిష్కింధ కేగి వాలిని యుద్ధమునకు బిలిచి పోరుటయు, ఇరువురు ఒకే రూపము, ఒకే వేషము

కలవాడుగా నున్నందున సుగ్రీవుని గుర్తింపలేక శ్రీరాముడు ప్రాణాంతకమైన తన దివ్యాస్త్రమును వేయలేక పోవుటచేత సుగ్రీవుడు చావు దెబ్బలుతిని పారిపోవుటయు, మరల లక్ష్మణుడు అభిజ్ఞానమునకై సుగ్రీవుని మెడలో గజపుష్పమాలను వైచి రెండవసారి వాలిపై యుద్ధమునకు బోవునట్లు పురికొల్పుటయు రామాభ్యుదయమున యథాతథముగ గలవు.

(రామా. పంచ. పద్య. 302.311లో కొంత)

8. పదుమూడవ సర్గములో మూలమున సుగ్రీవునితో గూడ శ్రీరాముడు కిష్కింధకు పోవుదారిలో "సప్తజను" లన బడు ఏడ్వురు మునులున్న వనమును సుగ్రీవుడు శ్రీరామునకు జూపును. అప్రధానమైన ఈ విషయము రామాభ్యుదయమున లేదు.

9. పదునాల్గవ సర్గము మూలమున భయపడుచున్న సుగ్రీవునకు ధైర్యముచెప్పి శ్రీరాముడు దివ్యమును భయంకరమును అగు బాణమును చేతనందుకొని సుగ్రీవునితో వాలిని యుద్ధమున కాహ్వానింపుమని కోరును. ఇదియు రామాభ్యుదయమున లేదు.

10. పదునైదవ సర్గము మూలమున తార వాలికి హితము చెప్పి తగిన సహాయము లేక సుగ్రీవుడు ఓడిన యల్పకాలముననే మరల యుద్ధమునకు రాడనియు, అంగదునిచే తాను శ్రీరామ లక్ష్మణులను గూర్చి ఇదివరకే విన్నట్లును చెప్పును. ఇచ్చట మూలమున అంగదుని చారకృత్యము మిక్కిలి ప్రశంసనీయముగ వర్ణింపబడినది. ఈ విషయమంతయు రామాభ్యుదయమున కేవలము 311 వ వచనము ఉత్తరార్థమున సూచితము.

11. పదునారవ సర్గము మూలమున వాలి తార చెప్పిన హితము వినక సుగ్రీవునితో తలపడును. సుగ్రీవుడు ముందటివలెనే

అలసిపోయి పారిపోవ సిద్ధముగా నున్న సమయమున మాత్రమే శ్రీరాముడు బాణముచే వాలిని కూలనేయును. ఇచ్చట మూల మును సూక్ష్మపరిశీలన దృష్టితో చదివినచో తన సహాయము విలువ సుగ్రీవుడు గుర్తించు సమయమువరకు వేచియుండి శ్రీరాముడు బాణమోక్షము చేసెనేమో యను భ్రమ కలుగును.

—(రామా. పంచ. పద్య. 311లో కొంత 314)

12. పదునేడవ సర్గము మూలమున వాలి శ్రీరాముని అన్యాయ ప్రవర్తనము నెత్తి పొడుచును. ఈ విషయము రామా భ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా కలదు.

(రామా. 5-315)

13. పదునెనిమిదవ సర్గము మూలమున శ్రీరాముడు వాలికి తగు విధముగా సమాధానము చెప్పును. అనుజన్మ వధూగమ నము పాపమనియు, తదనుభవ రూప మరణశిక్ష నీకు విధింపవలసి వచ్చినదనియు శ్రీరాముడు పలుకును. వాలి పశ్చాత్తాపపడి అంగదుని భారము శ్రీరామున కప్పగించును.

(రామా. పంచ. పద్య. 316-321)

14. పందొమ్మిదవ సర్గమునుండి ఇరువదియైదవ సర్గమువరకు మూలమున తార అంగదునితో గూడి వాలి సమీపమున కేగి విలపించును. హనుమంతుడే స్వయముగా తార నూరడించును. దైవవశమున మూర్ఛదేరిన వాలి సుగ్రీవుని జూచి అతనియెడ తానొనర్చిన పూర్వకృతాపరాధమును మఱచి, అంగదుని రక్షణ భారము వహింపుమని కోరును. మహేంద్రదత్తమైన కాంచన మాలను వాలి సుగ్రీవునకు సమర్పించును. సుగ్రీవుని యెడల అంగ దుడు నడచుకోవలసిన తీరును కుమారునకు బోధించును. అంత మున వాలి ప్రాణోత్క్రమణము, వానరుల పరిదేవనము కలవు.

ఇవన్నియు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా ఒక్క వచనమున వర్ణింపబడినవి. శ్రీరాముడే స్వయముగా తార నూరడించి మరణ వ్యవసాయినియైన ఆమెను అంగద యౌవరాజ్యలాభ రూపము ననునయించును. వాలి శరీరమునకు సంస్కారము, పిండ ప్రధానము యథాశాస్త్రముగ జరుగును. ఇవన్నియు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగా రెండు పద్యములలో చెప్పబడినవి.

—(రామా. పంచ. పద్య. 322-323)

15. ఇరువదియారవ సర్గము మూలమున వర్ష ఋతువు పిదప శరదాగమనమున సీతాన్వేషణము జరుపదలచి శ్రీరాముడు సుగ్రీవునకు కిష్కింధా రాజ్యపట్టాభిషేకము, అంగదునకు యౌవరాజ్య పట్టాభిషేకము జరుపును. రామాభ్యుదయము నందును ఇట్లే యున్నది.

—(రామా. పంచ. పద్య. 324-327)

16. ఇరువదియేడవ సర్గము మూలమునందు ప్రవర్షణగిరి కందరమున శ్రీరామలక్ష్మణులు ఆషాఢాది మాస చతుష్టయమును గడుపుదురు. శ్రీరాముడు సీతా విరహతప్తుడు కాగా లక్ష్మణు డతనిని సమాశ్వాసింప చేయును. మూలమున శ్రీరాముని విరహావర్ణనము మిక్కిలి తగియున్నది. ఆ సమయము ఆ వాతావరణము అట్టివి. రామాభ్యుదయమున ఈ ఘట్టము లేదు.

17. ఇరువది ఎనిమిదవ సర్గము మూలమున వర్ష ఋతువర్ణనము, శ్రీరాముడు రాజ్యనాశనము, దారాపహారణము బలవంతుడగు శత్రువుతోడి వైరము-మున్నగు విషయములు తలచి బాధపడును. లక్ష్మణుడే అన్నను అడుగడుగున తేర్పవలసివచ్చును. వర్ష ఋతువర్ణనము రామాభ్యుదయమున ప్రబంధశైలిలో

మూలమునందుకంటె విరివిగా జేయబడినది. అట్లే శ్రీరామ విరహ వర్ణనము కూడ మూలమునకంటె విపులముగా చంద్రాద్యుపాలంభములతో జేయబడినది.

(రామా. షష్ఠా. పద్య. 3-19 వర్షవర్ణన 20-23 విరహవర్ణన)

18. ఇరువదితొమ్మిదవ సర్గము మూలమున హనుమంతుడు సుగ్రీవునకు కర్తవ్యబోధ సేయును. శ్రీరామునివలన పనిగొని బదులుసేయ కుండుట ద్రోహమనియు వర్షాకాలము గడచి శరదృతువు ప్రవేశింపనున్నదనియు గుర్తుచేయును. సుగ్రీవుడు వానర వీరుల నందరను కిష్కింధకు చేరునట్లు ఆజ్ఞలను పంపుమని నీలున కాదేశించును. రామాభ్యుదయమునను ఇట్లే యున్నది.

(రామా. షష్ఠా. పద్య. 38-41)

19. ముప్పదవ సర్గము మూలమున శరదృతు వర్ణనము. ప్రకృతి వర్ణనము మిక్కిలి మనోహరముగను, విపులముగను జేయబడినది. శ్రీరాముని విరహవర్ణనము కూడ అట్లే దీర్ఘముగ జేయబడినది. అట్టి సమయమున సుగ్రీవుడు మాటతప్పిన వాడయ్యెనేమో యని అనుమానించి రాముడు కోపముతో నతని యొద్దకు లక్ష్మణుని బంప నిశ్చయించును. లక్ష్మణుడు శీఘ్రకోపి కాన కార్యము చెడగొట్టునేమో యని మరల సుగ్రీవునెడ జాగ్రత్తగా కార్యము చెడకుండ సహనముతో ప్రవర్తింపుమని బోధించును. ఇట్టి చర్య ఎంతయు సమయానుకూలము, ఉచితమునై యున్నది. రామాభ్యుదయమున శరదృతువర్ణనము కేవలము 5 పద్యములలో చేయబడినది. శ్రీరాముని విరహము, కోపము లక్ష్మణునితో ఆలోచన అంతయు ఒక వచనము సగములో మాత్రమే సంక్షేపముగా జేయబడినది.

(రామా. షష్ఠా. పద్య. 33-37 శరదృతువర్ణన, 42 శ్రీరామ విరహము)

20. ముప్పదియొకటవ సర్గ మూలమున లక్ష్మణుడు కిష్కింధ పరిసరములకుపోయి అంగదుని మూలమున మదిరా మత్తుడై యున్న సుగ్రీవునకు తన యాగమన వార్త చెప్పి పంపును. అంగద సహితులై సుగ్రీవుని మంత్రులు అతనియొద్దకు వెళ్ళి లక్ష్మణుడు వచ్చి యున్నట్లు చెప్పుదురు. రామాభ్యుదయమున నీ ఘట్టమొక వచనమున సంగ్రహింపబడినది.

(రామా. షష్ఠా. పద్య. 42 ఉత్తరార్థము)

21. ముప్పదిరెండవ సర్గమునుండి ముప్పదియేడవ సర్గము వరకు మూలమున అంగదాదులు చెప్పిన మాటలకు సుగ్రీవుడు భయభ్రాంతుడై ఆలోచనలో పడును. హనుమంతు డతనికి కర్తవ్యము బోధించును. లక్ష్మణుడు కిష్కింధ ప్రవేశించును. కిష్కింధా నగరము, అంతఃపుర స్త్రీల విలాసచేష్టలు విపులముగా వర్ణింపబడినవి. కొన్నిచోట్ల వారి వర్ణనము మిక్కిలి అసభ్యముగను, జుగుప్సావహముగను నున్నది. ఇచ్చట మూలమున తార యాకారము కూడ నొక కాముకి యగు విలాసస్త్రీని తలపించు నటులున్నది. ఇవి ఎవ్వియును రామాభ్యుదయమున లేవు. తార లక్ష్మణుని శాంతపరచును. లక్ష్మణు డంతఃపుర ప్రవేశముచేసి సుగ్రీవునితో సంభాషించును. సైన్య సమీకరణ విషయమును హనుమంతుడు లక్ష్మణునకు చెప్పి సుగ్రీవు ననుమతిపై వానర సేనను అతనికి చూపును. ఇదియంతయు మిక్కిలి సంక్షేపముగా రామాభ్యుదయమున నీయబడినది.

—(రామా. షష్ఠా. పద్య. 42 లో కొంత 47 వరకు)

22. ముప్పదియెనిమిదన సర్గము మూలమున లక్ష్మణ సుగ్రీవులు, పల్లకిలో శ్రీరాము నొద్దకుపోయి విషయములు వివరిం

తురు. సుగ్రీవుడు శ్రీరాముని మన్ననలను పొందును. రామాభ్యుదయమున నిది యథాతథము

—(రామా. షష్ఠా. పద్య 48-50)

23. ముప్పది తొమ్మిదవ సర్గమునుండి నలువది మూడవ సర్గము వరకు మూలమున వానర వీరులు తమతమ యనుచరులతో శ్రీరామ సుగ్రీవుల యెదుటకు వత్తురు. శ్రీరాముడు సుగ్రీవుని శ్లాఘించును. వినతుని సుగ్రీవుడు సేనతో తూర్పు దిశకు పంపును. హనుమదాదులను పరిమిత సేనతో దక్షిణ దిశకు పంపును. పశ్చిమ దిశకు సుషేణుని నాయకత్వమున కొందరు కపి వీరులను పంపును. అట్లే ఉత్తరమునకు శతబలిని తగిన పరివార మిచ్చి యనుపును. ఆయా దిశలకు వెళ్ళు నాయకులకు సీతాదేవిని వెదుకవలసిన పద్ధతులు సుగ్రీవుడు బోధించును. ఆయా దిశలో నున్న నదులు, సముద్రతీర భాగములు మున్నగు ప్రదేశములను చాల విపులముగా సుగ్రీవుడు వానివాని పేర్లను పేర్కొని వారికి వివరించును. మూలమున వాల్మీకి తన భౌగోళిక విషయ పరిజ్ఞానమును అద్భుతముగా ప్రదర్శించియున్నాడు. రామాభ్యుదయమున ప్రాక్పశ్చిమ దక్షిణోత్తర దిశలకు వినతాదుల పంపెనని యున్నదే కాని వాని వివరములు లేవు. అదియు మిక్కిలి సంక్షేపముగా చెప్పబడినది.

—(రామా. షష్ఠా. పద్య. 51-54)

24. నలుబది నాల్గవ సర్గము మూలమున సుగ్రీవుడు ఎక్కువగా మన్నించిన హనుమంతుడు కార్యసాధకుడుగా నుండునని నమ్మి శ్రీరాము డతనికి అభిజ్ఞానార్థము సీతాదేవికి జూపుటకై తన నామాక్షరములు చెక్కిన ముద్రిక (అంగులీయకము) నిచ్చును. ఈ ఘట్టము మనోజ్ఞముగ సంగ్రహింపబడినది.

—(రామా. షష్ఠా. పద్య. 55-62)

25. నలువది మైదవ సర్గము మూలమున ఆయా దిశలకు వెళ్లు వానరులు, తాము చేయగల పనులనుగూర్చి తమతమ శక్తి సామర్థ్యములకు మించి ప్రగల్భములు పలుకుదురు. తమలో నొక్కొక్కడే రావణుని ససైన్యముగా నిర్జించి సీతాదేవిని తెచ్చునట్లు మాట్లాడుదురు. రామాభ్యుదయమున నీ వివరములు లేవు.

26. నలువది యారవ సర్గము మూలమున సుగ్రీవుడు వర్ణించిన భూమండల ప్రదేశాది విశేషములకు ముగ్ధుడై శ్రీరాముడు సుగ్రీవునితో వాని నన్నింటిని అతడెట్లు, ఎప్పుడు చూచెనో తెలియగోరును. సుగ్రీవుడు తాను ఋష్యమూకమును స్థావరముగ నేర్పఱచుకొనుటకు ముందు వాలిచే తరుమబడినప్పుడు నిలుచుటకు నీడలేక భూమండల మంతయు తిరిగినట్లు చెప్పును. ఈ వివరములు కూడ రామాభ్యుదయమున లేవు.

27. నలువది యేడవ సర్గము మూలమున తూర్పు, పడమర, ఉత్తరము వెళ్ళిన వానర వీరులు సీతాదేవిని కనుగొనలేక తిరిగి వత్తురు.

—(రామా. షష్ఠా. పద్య. 63-69)

28. నలువది ఎనిమిది నుండి ఏబది ఐదవ సర్గము వరకు మూలమున హనుమదంగదాదులు సీతాదేవిని వెదకుచు వింధ్యాద్రియందొక గుహాముఖమున ప్రవేశింతురు. వారిని ఎదిరించిన యొక యసురుని చంపి ఆ ప్రదేశమం దంతటను సీతాదేవి కొఱకు వెదకుదురు. అందు కాన్పించిన ఒక బిలమున దూరి యొక యోజనము నడచినను వారికి దారి తెలియలేదు. ఆ గుహ

యందు మహోన్నతములగు భవనము లుండెను. అచ్చట వారొక వృద్ధ తపస్విని చూచిరి. ఆ గుహా వివరములు హనుమంతుడు ఆ తాపసిని అడుగగా ఆమె యా గుహ మయునిదనియు, తన పేరు స్వయంప్రభ యనియు నుడువును. స్వయంప్రభ హనుమదాదుల నుండి వారెందులకు వచ్చిరో ఆ వివరము లన్నియు తెలిసికొనును. అది శ్రీ రామ కార్యమైనందున నామె వారిపై జాలిగొని వారం దరను గుహ వెలుపలకు చేర్చును. అంగదుడు సుగ్రీవుని కఠిన శాసనుడని వర్ణించి తమ గడువు దాటినందున తమ్మందరను అతడు మరణదండమునకు తక్కువకాని విధమున శిక్షించునని అందరను ప్రాయోపవేశమునకు పురికొల్పును. హనుమంతుడు అంగదుని భయము పోగొట్టుటకు ఎన్ని చెప్పినను అతడు తన పినతండ్రియగు సుగ్రీవుని పరమ దుర్మార్గుడుగా చిత్రించి అందరకు ప్రాయోపవేశమే శరణ్యమని బోధించును. ఇచ్చట వ్యక్తులు బయటికి కెట్లున్నను సమయము వచ్చినపుడు వారివారి నిజమైన మనస్తత్వము బాగుగా ప్రకటీకృత మగునను, సార్వకాలిక సత్యము మిక్కిలి చక్కగా చిత్రింపబడినది. అంగదుడు సుగ్రీవు నెడ ఎంత వినీతత్వమును ప్రకటించుచుండినను అంతర్గతము గాగ నతనికి తన పినతండ్రియెడ నిజమైన గౌరవభావము లేదని ఈ ఘట్టము తెలుపును. అందరు నిరాశులై ఏమిజేయుటకు తోచక నిర్విణ్ణులై యున్నప్పుడు అచటకు సంపాతి వచ్చును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

29. ఏబదియారునుండి అరువది మూడవ సర్గము వరకు మూలమున అంగదుడు శ్రీరాముని చరిత్రమును తలచుకొనుచు

జటాయువు ఎట్లు శ్రీరామునకు సహాయము చేయబోయి తన ప్రాణములనే కోల్పోయెనో ఆ విషయము పేర్కొనును. సంపాతి తన తమ్ముని పేరు విని అంగదుని వివరము లడుగగా నతడు మరల శ్రీరామ చరిత్ర మంతయు చెప్పును. సంపాతి తన వంశ వృత్తాంతము చెప్పి సీతాదేవిని రావణు డపహరించినట్లు తాను తన కుమారుడైన సుపార్శ్వునివలన విన్నట్లు చెప్పును. సంపాతి ఱెక్కలు కాలిన వివర మెట్లని నిశాకర మహర్షి తన్నడిగినట్లును, తాను, తన తమ్ముడు జటాయువు సూర్యబింబము నొద్ద కెగుర బోయి ఱెక్కలు కాలి నేలగూలినట్లు తా నతనికి చెప్పినట్లును, నిశాకరమహర్షికి తనపై దయగలిగి తాను శ్రీరాముని కథ వినుట తటస్థించినపుడు ఱెక్కలు మొలుచునని అనుగ్రహించి నట్లును చెప్పును. అంగదునివలన శ్రీరాముని కథ వినగనే సంపాతికి ఱెక్కలు మొలిచి తాను కుమారుని వలన వినిన సీతాపహరణ వృత్తాంతము, రావణుని లంకనుగూర్చియు, చెప్పి యతడు ఎగిరి పోవును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు. కాని "జటాయువు నన్న" అను పదములచే మాత్రము సూచింప బడినది.

—(రామా. షష్ఠా పద్య 70)

30. అరువది నాలుగు, అరువది యైదు, అరువది యాఱు సర్గములలో మూలమున అంగదాదులగు వానరులు హనుమంతుడు, జాంబవంతుడు మొదలగు పెద్దలతో సముద్ర తీరమునకు వచ్చి దాని విస్తృతిని చూచి నిరాశులై దీని నెవ్వరు దాటగలరు అని దుఃఖింతురు. ఋక్ష వానర వీరులు వారు వారు సముద్ర

మును ఎన్నెన్ని యోజనములవఱకు లంఘింపగలరో తెలుపుదురు. జాంబవంతుడు హనుమంతుని జన్మవృత్తాంతమును తెల్పి అతడే ఈ సముద్రమును దాటగలవాడని పొగడి ప్రోత్సహించును. రామాభ్యుదయమునను ఇట్లే యున్నది.

—(రామా. షష్ఠా. పద్య 71-81)

31. అరువది యేడవ సర్గము మూలమున హనుమంతుడు తన బల మెరిగి విజృంభించి తన పరాక్రమమును వెల్లడించుచు సముద్ర లంఘనమునకై మహేంద్రగిరి శిఖరము నెక్కును. ఇదియు యథాతథమే.

(రామా. షష్ఠా. పద్య. 82-87)

ఇట్లు రామభద్రయ్య కిష్కింధాకాండమును సంగ్రహించుట జరిగినది. ఈ సంగ్రహమువల్ల మూలసౌందర్యము చాల వరకు చెడినదని చెప్పవచ్చును.

10

# సుందర కాండము



వాల్మీకి రామాయణమున సుందరకాండము అరువది యెనిమిది సర్గములతో 3006 శ్లోకములుగా విస్తరించి యున్నది. ఆరణ్య కాండమునకంటె దాదాపు 600 శ్లోకములు చిన్నది. రామాభ్యుదయమున సుందరకాండము 189 పద్యములతో ముగింపబడినది. ఇదియు ఆరణ్యకాండము, కిష్కింధ కాండముల వలెనే మూలమునందలి ముఖ్యవిషయములను వదలక క్రొత్తవి చేర్చక ఒకే ప్రణాళికపై నాధారపడి ప్రబంధ ఫక్కీలోనే రచింపబడినది.

1. ఒకటవ సర్గము మూలమున హనుమంతుడు శరీరము పెంచి సముద్రమును లంఘించునపుడు సగర పుత్రులచే త్రవ్వబడిన సాగరుడు తద్వంశీయుడైన శ్రీరాముని కార్యార్థమై యరుగు హనుమంతుడు విశ్రాంతి గొనుటకై తనయందు దాగియున్న మైనాకునితో నీవు పైకివచ్చి అతని కాతిథ్య మిమ్మని కోరును. హనుమంతుడు ఆలస్యాసహిష్ణుడై మైనాకుని మన్నించినను అతని యాతిథ్యము స్వీకరింపకయే సాగిపోవును. మరల దేవతలు హనుమంతుని శక్తిసామర్థ్యములను పరీక్షింపగోరి సురస యను సర్పమాతను పంపుదురు. హనుమంతుడు సురస నోట ప్రవేశించి వెడలివచ్చి యవలబోవును. సింహిక యను ఛాయాగ్రాహిణి హనుమంతుని నీడనుబట్టి లాగును. అతడు సింహికను చంపి

సముద్రము దాటి యవలబోయి అల్ప ప్రమాణమగు రూపముతో త్రికూట శిఖరముపై వ్రాలును. రామాభ్యుదయమున మైనాకుని వృత్తాంతముగాని, సురసా సింహికల గాథగాని లేదు.

— (రామా. 6-88-102)

2. రెండు మూడు సర్గములలో మూలమున హనుమంతుడు మార్జాలమంత అల్పశరీరుడై లంకా నగ రౌన్నత్యమును, రాక్షసుల జాగ్రత్తను, రావణుని బలపరాక్రమములను, గమనించి రావణ నిగ్రహము అనుకొన్నంత సులభము కాదని తలచి లంక యుత్తర ద్వారము చేరును. లోపల ప్రవేశింపబోవ నగరాధిదేవత యగు లంకిణి (సంస్కృతమున నీమెకు లంకయనియే వ్యవహారము) యడ్డుపడగా హనుమంతుడు దానిని నిర్జించి దాని యనుజ్ఞగొని లంకలో ప్రవేశింప నిశ్చయించును. రామాభ్యుదయమున నీ లంకిణి పేరైన లేదు.

—(రామా. షష్ఠా. పద్య. 103-109)

3. నాలుగవ సర్గమునుండి పండ్రెండవ సర్గమువరకు మూలమున హనుమంతుడు శత్రునగరమును ముఖద్వారము ద్వారా ప్రవేశింపరాదని ప్రాకారముపైనుండి దూకి, అశుభ సూచకముగా లోపల మొదట ఎడమకాలు పడునట్లు లంక ప్రవేశించును. అచ్చటి భవనములను, సేనలను మూలబలమును, హనుమంతుడు చూచును. ఇచ్చట రాత్రి వర్ణనము, చంద్ర వర్ణనము మనోజ్ఞముగా చేయబడినవి. రాక్షసుల గృహములందు వేలకొలదిగాగల స్త్రీ పురుషుల జంటలను జూచును. కాని యెచ్చటను సీతాదేవి కన్పింపనందున దుఃఖితుడగును. పిమ్మట హనుమంతుడు రావణుని అంతర్నగరమును దర్శించును. రావణుని ప్రాసాదము, కుంభకర్ణుని నివేశము. ఇంకను ముఖ్యులగు రాక్షస

వీరుల గృహముల నన్నింటిని జూచును. మరల రావణాంతఃపుర ప్రవేశ మొనర్చి యచ్చటనున్న పుష్పక విమానమును చూచును. దాని యందము గొప్పగా వర్ణింపబడినది. రావణాంతఃపురము నందలి స్త్రీల భోగభాగ్యములను, రావణుని యైశ్వర్యమును దలచి హనుమంతుడు, అంతటివాడు ఇంతటి దుష్టుడయ్యెనే యని బాధపడును. రావణాంతఃపురమున నతనితో నేకశయ్యపై నిదు రించు మండోదరిం జూచి మొదట ఆమెనే సీతాదేవినిగా భ్రమించి మరల తన బుద్ధిహీనతను గుర్తించును. వేరువేరు స్థలములలో జానకీదేవిని వెదకును. బెత్తెడు స్థలముకూడ వదలక వెదకినను సీతాదేవి జాడ తెలియరానందున హనుమంతుడు మిగుల చింతా క్రాంతు డగును. రామాభ్యుదయమున మూల బల వర్ణనము గాని, పుష్పకవిమాన వర్ణనగాని లేవు. పెక్కు విషయములు మిక్కిలిగా సంక్షేపింపబడినవి.

(రామా. షష్ఠా. పద్య 110-119)

4. పదుమూడవ సర్గము మూలమున సీతాదేవి కన్పింప కున్న తాము పడిన పాట్లన్నియు వ్యర్థములగుననియు, శ్రీరామ లక్ష్మణులు, సుగ్రీవాదులు దుఃఖముచే మరణింతురనియు నెంచి హనుమంతుడు అశోకవనమును స్మరించి అచ్చట దుముకును. రామాభ్యుదయమున ఇవి యన్నియు మిక్కిలి సంక్షేపముగా చెప్పబడినవి.

(రామా. షష్ఠా. పద్య 120-125)

5. పదునాలుగు, పదునైదు సర్గములలో మూలమున అశోకవన వర్ణనము మిక్కిలి హృదయంగమముగా చేయబడినది. హనుమంతుడు తోటయంతయు తిరిగి తిరిగి కడకొక శింశుపా వృక్షముపై నిలుచును. ఆ వృక్షము క్రిందనే కృశించి, మలినాం

గ్నమై యున్న ఒక స్త్రీని హనుమంతుడు చూచి పరిస్థితులను ఆమె స్థితినిబట్టి ఆమెయే సీతాదేవి యని నిర్ణయించును. ఇచ్చట రామాభ్యుదయమున సీతాదేవి యున్న తీరు మిక్కిలి సహజముగా వర్ణింపబడినది.

—(రామా. షష్ఠా. పద్య. 126-137)

6. పదునారు, పదునేడు, సర్గములలో మూలమున హనుమంతుడు సీతాదేవిని గుర్తించి శ్రీరాముని విరహబాధను స్మరించి దుఃఖించును. జానకిని బాగుగా గుర్తించియు, కావలి యుంపబడిన రాక్షసస్త్రీల నడుమ నామె యుండుటవలన పల్కరించలేక శింశుపావృక్ష శాఖలయందే హనుమంతుడు దాగి యుండెను. ఇందలి విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

7. పదునెనిమిది, పందొమ్మిది, యిరువదియవ సర్గములలో మూలమున వైతాళికులవలన మేల్కొలుపబడిన రావణుడు మన్మథ ప్రేరితుడై సీతాదేవి యున్నెడకు శతభామినీ పరివృతుడై యరుదెంచును. హనుమంతుడు స్త్రీజన పరివేష్టితుడైన రావణుని చూచుట తటస్థించును. సీతాదేవి ప్రవాసవేషము ఇచ్చట మిక్కిలి వివరముగా వర్ణింపబడినది. అట్టి సీతాదేవిని రావణుడు సమీపించి తన నైశ్వర్యము, మున్నగువాని నాశజూపి పెక్కువిధముల నామెను ప్రలోభపెట్ట ప్రయత్నించును. ఇవన్నియు రామాభ్యుదయమున సంక్షేపముగ చెప్పబడినవి.

—(రామా. షష్ఠా. పద్య 144-158)

8. ఇరువది యొకటి, ఇరువది రెండు సర్గములలో మూలమున సీతాదేవి రావణుని ధిక్కరించి వానివైపు నిరాదరణ సూచకముగా వీపుద్రిప్పి మాట్లాడును. పిరికివాడవై శ్రీరామాదులు లేనప్పుడు నన్ను తెచ్చినాడవని అధిక్షేపించును. రావణుడు

మిక్కిలి కోపించియు ఆమె ధిక్కారమును మరి రెండు నెలల వఱకు సహింప నిశ్చయించి, కావలియున్న రాక్షస స్త్రీలకు, ఈ రెండు నెలల లోపల సీతాదేవి తన మనస్సు మార్చుకొనునట్లు ప్రయత్నింపుడని చెప్పి తన నగరు కేగును.

(రామా. షష్ఠా. పద్య 159-171)

9. ఇరువది మూడు, ఇరువది నాలుగు, ఇరువది యైదు సర్గములలో మూలమున రాక్షసస్త్రీలు రావణుని పరాక్రమ విశేషములను, ఆభిజాత్యమును, ఐశ్వర్యమును పొగడి, అట్టివానికి నీవు భార్యవగుట నీ యదృష్టమే యని చెప్పుదురు. అప్పటికిని సీతాదేవి విననందున భయపెట్ట ప్రయత్నింతురు. హనుమంతు డిది యంతయు చూచుచునే యుండును. ఏ దారియు లేక జానకి దుఃఖించి మరణమే శరణ్యమని తలంచును.

(రామా. షష్ఠా. పద్య 138-142)

10. ఇరువది యారవ సర్గము మూలమున శ్రీరామలక్ష్మణులు తన్ను వెదకుచు ఎక్కడ నున్నది ఏమైనది తెలియక మరణించిరో, లేక మునివృత్తి మానిరో యని దుఃఖమున మరణ వ్యవసాయిని యగును. ఈ విషయము రామాభ్యుదయమున లేదు.

11. ఇరువది ఏడవ సర్గము మూలమున త్రిజట యను రాక్షసి రావణాదు లందరు నశించినట్టు, శ్రీ రామలక్ష్మణులు వచ్చి సీతాదేవి నుద్ధరించినట్లు కలగని, తక్కిన రాక్షస స్త్రీల నందరను, సీతాదేవిని బాధింపవలదని వేడుకొనును. సీతాదేవిని స్వయముగా నోదార్చును.

—(రామా. షష్ఠా. పద్య 172-175)

12. ఇరువది ఎనిమిది, ఇరువది తొమ్మిదవ సర్గములలో మూలమున సీతాదేవి శ్రీరామలక్ష్మణులం దలంచుకొని, ఆపదః

నుండి బయటపడుటకు మరణమే మార్గమని వెండ్రుకలచే నురి పోసికొన సిద్ధపడును. అప్పు డామెకు ఎడమకన్నదరుట మున్నగు శుభశకునములు, అట్టివే మరికొన్ని శకునములు నగును. రామాభ్యుదయమున "డా కనుఁదమ్మి యదరగా" అను సూచన మాత్రమే కలదు.

13. ముప్పదవ సర్గము మూలమున హనుమంతుడు రాక్షస స్త్రీలకు తెలియకుండ సీతాదేవికి తన యునికి తెలుపుటకు, శ్రీరాముని విషయము దెలియబఱచుటకు, దారికొర కాలోచించి శ్రీరామ గుణకీర్తనముచేయ నారంభించును. ఈ విషయము రామాభ్యుదయమున లేదు.

14. ముప్పది యొకటి, ముప్పది రెండవ సర్గములలో మూలమున హనుమంతుడు - దశరథుడు రాజ్యపాలనము చేయుట మొదలుగా, తాను సంపాతి మాటలపై లంక జేరవచ్చువఱకు గల కథను చెప్పును. సీతాదేవి హనుమంతుని జూచియు వానర దర్శనము అశుభమని తలచి, ఎట్లైన హనుమంతుడు చెప్పిన కథ యంతయు సత్యము గావలయునని కోరుకొనును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

15 ముప్పది మూడవ సర్గమున మూలమున హనుమంతుడు సీతాదేవి ఎదుట నిలిచి ఆమె జానకి యగుట, తాను తలచినది సత్యమా యని యడుగును. సీతాదేవి తాను దశరథుని కోడలినే యనియు, శ్రీరాముని భార్యనే యనియు జరిగిన విషయము లన్నియు చెప్పును. తనకు మనస్సు మార్చుకొనుటకు రావణుడు ఈ రెండు మాసములు మాత్రమే గడువిచ్చెననియు చెప్పును.

(రామా, 6 - 176)

16. ముప్పది నాలుగు, ముప్పది యైదవ సర్గములలో మూలమున హనుమంతుడు, సీతాదేవి, పరస్పరము పరిచయము చేసికొందురు. వెంటనే హనుమంతుడు తాను సుగ్రీవుని మంత్రి యైనట్లు చెప్పుకొనును. అతడు వెంటనే సీతాదేవికి శ్రీరాముని యాకారవిశేషములను వర్ణించి మొదటినుండియు తానిచటకు వచ్చువరకు గల కథయంతయు చెప్పును. ఇవి ఎవ్వియు రామాభ్యుదయమున లేవు.

17. ముప్పది యారవ సర్గమున మూలమున హనుమంతు డిచ్చిన శ్రీరామనామాంకిత ముద్రిక గైకొని సీతాదేవి మిక్కిలి సంతసించినది. ఆమె శ్రీరాముని యొక్కయు లక్ష్మణ, భరతాదులతో సహా అందరి క్షేమములు విచారించినది. స్త్రీ సహజమైన కుతూహలముతో శ్రీరాముడు తన్ను గురించి తలంచుచున్నాడో లేదో యని తెలిసికొనగోరినది. అట్లే హనుమంతుడుకూడ శ్రీరాము డెల్లప్పుడు సీతాదేవినే తలచుచున్నాడని సత్యము, ఆమెకు ప్రీతికరమునగు మాటను చెప్పును. ఇచ్చట వాల్మీకి మానవ మనస్తత్త్వ సంబంధమైన లౌకిక ప్రజ్ఞను అద్భుతముగా ప్రదర్శించి యున్నాడు. రామాభ్యుదయమున మూలమునకు భిన్నముగా ముద్రికను చూచి పూర్తిగా దానిని వర్ణించినట్లే యున్నది కాని మూలమందలి స్వభావము లెవ్వియు లేవు.

(రామా. షష్ఠా. పద్య 177 - 196)

18. ముప్పది యేడవ సర్గము మూలమున హనుమంతుడు సీతాదేవిని తన వీపుపై మోసికొని శ్రీరాము నొద్దకు కొనిపోగల ననును. కాని సీతాదేవి అట్టి సాహసక్రియ తన క్షేమమును, హనుమంతుని క్షేమమునుగూడ క్లిష్టదశలో పడవేయునని సందేహించును. హనుమంతుడు సీతాదేవి ప్రత్యయార్థము తన శరీర

మును పెంచి నిజరూపమును చూపును. అప్పుడు సీతాదేవి శ్రీరాముడే వచ్చి, రావణుని నిర్జించి తన్ను గొనిపోవుటయే యతనికి కీర్తికరమని చెప్పును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

19. ముప్పది యెనిమిదవ సర్గము మూలమున సీతాదేవి కాకాసుర వృత్తాంతమును చెప్పి మరల అభిజ్ఞానార్థము చూడామణి నిచ్చును. ఈ కాకాసుర వృత్తాంతము రామాభ్యుదయమున అయోధ్యాకాండ భాగమున నున్నది. ఇచ్చటలేదు. రామాభ్యుదయమున అది ఉత్తర కథకును పనికిరాదు. అంతేకాక సీతాదేవి ఇంతయైన వెనుకకూడ మరల అనుమానించినట్లు రామభద్రయ్య రచించియున్నాడు. ఇది మిక్కిలి అసందర్భముగా కన్పించును.

—(రామా. షష్ఠా. పద్య 197-198)

20. ముప్పది తొమ్మిది, నలువదవ సర్గములలో మూలమున శ్రీరామలక్ష్మణులు, వానరులు, భల్లూకములు, సముద్రము నెట్లు దాటుదురో యని సందేహించిన సీతాదేవికి ఆపని తమకు ఒక సమస్య కాదని హనుమంతు డామెకు మనశ్శాంతికరమైన సమాధాన మిచ్చును. హనుమంతుడు శ్రీరామునొద్దకు బోవ ప్రయాణ మగును. రామాభ్యుదయమున నీ విషయములు లేవు.

21. నలువది యొకటినుండి నలువది యారవ సర్గము వరకు మూలమున హనుమంతుడు, రావణుని శక్తి నెరుగగోరి, యశోక వనమును విఱిచివైచును. దూత చెప్పిన మాత్రమే కాక ఎక్కువ చేసికొనిపోయి యధిపతి మెప్పుపొందుట శ్రేష్ఠుడగు దూతకు లక్షణమని యాలోచించి, కడకు రావణ దర్శనము చేయుటకు అదియే సరియైన విధానమని, తలంచియే హనుమం

తుడు అశోకవనమును భగ్నమొనర్చును. కావలియున్న రాక్షస స్త్రీలు చెప్పగా రావణుడు 80 వేల మంది కింకరులను హనుమంతుని పైకి పంప నతడు వారి నందరను అవలీలగా హతమార్చును. చైత్య ప్రాసాదమును గూల్చి హనుమంతుడు దానికి రక్షకులైన రాక్షసులను గూడ చంపును. ప్రహస్త పుత్రుడు జంబుమాలియు మడిసిన వెనుక మంత్రి పుత్రు లేడ్వురును, రావణ సేనాను లైదుగురును, హనుమంతునిపై గవిసి మరణింతురు. ఈ విషయము లన్నియు రామాభ్యుదయమున మిక్కిలి సంగ్రహముగా చెప్పబడినవి.

(రామా. షష్ఠా. పద్య. 199-213)

**22.** నలువది ఏడవ సర్గమునుండి, నలువది తొమ్మిదవ సర్గము వఱకు మూలమున రావణ కుమారుడగు అక్షయుడు హనుమంతునితో తలపడి మడియును. దుఃఖితుడైన రావణునిచే ప్రేరేపింపబడి ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చి హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధించును. బద్ధుడైన హనుమంతుడు, రావణ సభకు తీసికొనిరాబడి, రావణుని తేజోవిశేషమునకు మిక్కిలి విస్మితుడగును.

—(రామా. షష్ఠా. పద్య. 214-230)

**23.** ఏబదినుండి ఏబది నాల్గవ సర్గము వరకు మూలమున, రావణాజ్ఞానువర్తియై ప్రహస్తుడు హనుమంతుని తానెవ్వరో చెప్పుమని యడుగగా నతడు తాను శ్రీరామచంద్రుని దూతనని చెప్పును. రావణ దర్శనార్థ మనియే తాను అశోకవనమును విఱిచినట్లును, ఇష్టముతోడనే బ్రహ్మాస్త్రమునకు కట్టువడినట్లును చెప్పును. హనుమంతుడు రావణునితో శ్రీరాముని పరాక్రమమును వర్ణించి చెప్పి, సీతాదేవిని వెంటనే శ్రీరామున కప్పగింపు

మని హితము చెప్పెను. కాని రావణుడు కోపించి, హనుమంతుని చంప నాజ్ఞయిడును. దూతను చంపరాదని విభీషణుడు రావణుని శాంతపరుపగా, రావణుడు సమ్మతించి, వానరులకు తోక ప్రియమైనది కావున దానిని కాల్ప నాజ్ఞయిడును. ఆ కారణముగా హనుమంతుడు రాక్షసుల వెంట లంక యంతయు తిరిగిచూచును. వాలమున కగ్ని ముట్టించినను, అది సీతాదేవి ప్రార్థనమువలన హనుమంతునకు చల్లగా నుండును. అతడు రాక్షస నాయకుల గృహములతో సహా లంకానగరము నంతటిని కాల్చివేయును. ఇది యంతయు రామాభ్యుదయమున మిక్కిలి సంగ్రహముగా చెప్పబడినది.

—(రామా. షష్ఠా. పద్య 231-256)

24. ఏబది ఐదునుండి అరువదవ సర్గమువఱకు మూలమున సీతాదేవికూడ తాను కల్పించిన యగ్నికి లోబడి కాలిపోయెనేమో యని దుఃఖించుచున్న హనుమంతునకు చారిణీలు సీతా క్షేమమును నివేదింతురు. సీతాదేవిని జూచి ఆమె యాశీస్సులందుకొని 'అరిష్ట' యను పర్వతశిఖరముపైనుండి వారిధి దాటుటకై హనుమంతుడు లంఘించును. ఆవలిగట్టున మహేంద్రగిరి శిఖరముపై వ్రాలి అంగదాదులను కలిసికొని సీతాదేవి క్షేమ వృత్తాంతమును అందరకు తెలుపును. దారిలో తాను పడిన పాట్లన్నియు హనుమంతుడు వారికి విశదీకరించును. మరల వెనుకకు వెళ్ళి సీతాదేవిని తీసికొనివచ్చిన బాగుండునని హనుమంతుడు, తన యభిప్రాయమును ప్రకటింపగా, అంగదుడు బలపఱచును. కానీ జాంబవంతుడా పద్ధతికి తన సమ్మతి నీయలేదు. శ్రీరాముడు మనకు చెప్పిన పని చేయుటయైనది. మరల వారికి తెలియకుండ అట్టిపని చేయుట, ఆయన ప్రతిష్ఠకే భంగకరమని

చెప్పును. రావణ వధ శ్రీరాముని వలననే జరుగవలయున
వారిని ఒప్పించును. ఇది యంతయు చాల భాగము వదలి రామా
భ్యుదయమున మిక్కిలి సంగ్రహముగా చెప్పబడినది.

(రామా. సప్త. పద్య. 3-8)

25. అరువది ఒకటినుండి అరువది మూడవ సర్గము వరకు
మూలమున వానరులు మధువనమును ప్రవేశించి ఆనంద పార
వశ్యమున దానివి ధ్వంస మొనర్తురు. దానికి కాపున్న దధిముఖు
డను సుగ్రీవుని బంటు ఈ విషయము సుగ్రీవునితో చెప్పగా నత
డది విని సీతాదేవి క్షేమమునుగూర్చి ఇక సందేహింప పనిలేదని
యందఱకు చెప్పి యానందపరచును. ఇదియు రామాభ్యుదయమున
మిక్కిలి సంగ్రహముగా చెప్పబడినది.

—(రామా. సప్త. పద్య. 9-12)

26. అరువది నాలుగు నుండి, అరువది ఎనిమిదవ సర్గము
వరకు మూలమున దధిముఖుడు అంగదాదులయొద్ద కేగి క్షమింప
వేడును. సుగ్రీవుడు శ్రీరాము నాశ్వాసించును. హనుమంతుడు
శ్రీరామునకు సీతాదేవి యిచ్చిన చూడామణి నొసగి, అభిజ్ఞానా
ర్థము చెప్పిన కాకాసుర వృత్తాంతమునుకూడ చెప్పును. శ్రీరా
ముని విరహవర్ణనము, వీనిలో పెక్కు విషయములు, రామాభ్యుద
యమున లేవు.

—(రామా. సప్త. పద్య. 13-20)

ఇట్లు రామభద్రయ్య సంగ్రహించిన పట్టులన్నియు మూల
సౌందర్యమును ఇంచుమించుగ చెడగొట్టినవే అని చెప్పవచ్చును.

11

# యుద్ధకాండము



వాల్మీకి రామాయణమున యుద్ధకాండము 131 సర్గములతో 5990 శ్లోకములుగా విస్తరించి యున్నది. అచట బాలకాండమునకంటె రెండింతలకు మించి యున్నను, రామాభ్యుదయమున మాత్రము బాలకాండమునకంటె కొంచెము చిన్నదిగనే కన్పించుచున్నది. అయోధ్యాకాండమునకంటె యుద్ధకాండము 1500 శ్లోకములు మాత్రమే పెద్దదిగా నున్నను రామాభ్యుదయమున దానికంటె ఐదింతలుగా పెంచబడినది. ఆరణ్య, కిష్కింధ, సుందర కాండములతో పోల్చినచో రామాభ్యుదయమున యుద్ధకాండము కొంచెము విస్తృతిగలిగియే యున్నదనవచ్చును. రామభద్రయ్య యుద్ధకాండమును 517 పద్య గద్యములలో కూర్చి యున్నాడు. ఇదియు మూలమునందలి ముఖ్యవిషయములను వదలక క్రొత్తవిచేర్చక ఒకే ప్రణాళికపై నాధారపడి ప్రబంధముగా రచింపబడినది.

1. ఒకటి రెండు సర్గములలో మూలమున శ్రీరాముడు ఒక్క కౌగిలింతచే హనుమంతునకు తన కృతజ్ఞతను తెలుపుకొనును. అంతకంటె ఎక్కువ ప్రతికృతి ఏమున్నదనును. సముద్రమును దాటుటెట్లో యని దుఃఖించుచున్న శ్రీరామునకు సుగ్రీవుడు తన సేన ఎంతకైన సమర్థమనియు, సేతు నిర్మాణముచే గాని మరొకవిధముగా గాని వారిధి నుత్తరించుట సుసాధ్య

మనియు నుత్సాహ వాక్యములు చెప్పి యిక దుఃఖము వదలి శత్రునిరాసమున కనుగుణముగా క్రోధము నాశ్రయింపు మని కోరును. ఇవి కేవలము సూచనాప్రాయముగ రామాభ్యుదయమున గలవు.

2. మూడు, నాలుగు సర్గములలో మూలమున శ్రీరాముడు హనుమంతు నడిగి లంకానగర విస్తీర్ణము, దాని ప్రాకార విశేషములు, అందలి గవనులు, అగడ్తలు, వీధులు, నగరము నందలి సేనలు, మూలబలము మున్నగు విషయము లన్నియు తెలిసి కొనును. సుగ్రీవుని ఆజ్ఞ చే ఋక్ష, వానర సేన ముందుకు నడచును. ఆ సేన కన్నివైపుల రక్షకులుగా వానర వీరులను సుగ్రీవుడుంచును. హనుమ దంగదులు శ్రీరామ లక్ష్మణులను తమ మూపులపై నెక్కించుకొని నడతురు. సేన యంతయు పయనించి మహేంద్ర గిరి శిఖరమును చేరి సముద్రతీరమున విడియును. ఇవి యన్నియు రామాభ్యుదయమున సంక్షేపముగా చెప్పబడినవి. సముద్ర వర్ణన మిందు చేయబడినది.

—(రామా. సప్త. పద్య. 21-43)

3. ఐదవ సర్గమునందు మూలమున శ్రీరాముడు సముద్ర తీరమున విడిసి సేనాపతి నీలుడు తన సేనను పర్యవేక్షించుచుండగా తాను సీతావిరహము ననుభవించును. రామాభ్యుదయమున నీ విరహ వర్ణనము చంద్ర, మలయమారుతాద్యుపాలంభ రూపమున మిక్కిలి యాలంకారికముగా జేయబడినది.

—(రామా. సప్త. పద్య. 44-48)

4. ఆఱవ సర్గమునుండి పదునాఱవ సర్గము వఱకు మూలమున రావణుని కొలువు నందలి విశేషములు వర్ణింపబడినవి. రావణుడు మానవులలో, మంత్రులలో ఉత్తమ మధ్యమాధము

లిట్టివారని నిర్ణయించును. పరిస్థితిని సమీక్షించి అందర యభిప్రాయముల నడుగును. కొందరు అప్పుడేపోయి శ్రీరామాదుల చంపి వత్తుమని విపరీతముగా ప్రగల్భములు పలుకుచుండ ప్రహస్తుడు శ్రీరామునకు భరతునకు భేదము పుట్టింతునని చెప్పును. విభీషణుడు రావణునకు హితము గఱపి, లంకయం దశుభములు గన్పించుచున్నవని చెప్పును. కుంభకర్ణుడుకూడా రావణునిపై కోపించి సీతాదేవిని తెచ్చునపుడే మమ్ముల నందఱ నడిగి మా యభిప్రాయములు గైకొని యుండవలసినదనియు, అట్లు చేయక పోవుట రావణుడు చేసిన పెద్ద తప్పనియు మందలించును. ఐనను తాను అన్నకొఱకై చావునకైన సంసిద్ధుడనే యని పలుకును. కొందరు సీతాదేవిని కుక్కుటన్యాయమున బలాద్గమనము చేయుమని రావణుని ప్రోత్సహింప నతడు పుంజికస్థల కథ చెప్పి, బలాద్గమనమువలన, తనకే యపాయము సంభవించునని వివరించును. విభీషణుడు మరల హితము బోధింప ఇంద్రజిత్త్రాదులు అతనిని నిందింతురు. రావణుడు విభీషణుని జ్ఞాతిగా వర్ణించి ఏనుగులు పాశమునకు, ఆయుధములకు భయపడవు. కాని, తమజాతివేయైన జ్ఞాతులే తమ బంధమునకు సహాకరించునని ఉపమాన రూపముచే విభీషణునివల్ల తనకు, తన జాతికి కలుగబోవు ముప్పును సూచించును. వెంటనే విభీషణుని నిందించి, తన్ని, సభనుండి వెడలిపోవునట్లు శాసించును. అతడు తన నలువురు మంత్రులతో శ్రీరాముని సాన్నిధ్యమునకు పోవును. రామాభ్యుదయమున నివి యన్నియు చిరుమార్పులతో సంక్షేపముగా చెప్పబడినవి.

(రామా. సప్తమ. పద్య. 49-80)

5. పదునేడు, పదునెనిమిదవ సర్గములలో మూలమున విభీషణుడు ఆకాశమునుండియే - తాను రావణుని వదలి శ్రీరా

ముని శరణము కోరి వచ్చినట్లు ఘోషించును. అతనినిగూర్చి వానర వీరులలో పలువురు పలువిధముల భిన్నాభిప్రాయములను వెలువఱచి, అతడు శత్రువునకు తమ్ముడే యైనందున పరిహార్యుడే యని చెప్పుదురు. శ్రీరాముడు కడకు హనుమంతుని అభిప్రాయముపై మొగ్గుచూపి విభీషణునకు శరణమీయ నిశ్చయించును.

—(రామా. సప్తమ. పద్య. 81-89)

6. పంధొమ్మిదవ సర్గము మూలమున విభీషణుని శరణాగతితో ప్రారంభమగును. అతడు, రావణ కుంభకర్ణ ఇంద్రజిదాదులయు, రావణ సేనాపతులయు, శక్తిసామర్థ్యములం దెలుపును. శ్రీరాముడు విభీషణునకు లంకారాజ్యము నిచ్చి పట్టాభిషిక్తుని చేయును. విభీషణుని యభిప్రాయము ననుసరించి శ్రీరాముడు సముద్రము నుపాసింప నిశ్చయించును. రామాభ్యుదయమున శ్రీరాముడు స్వయముగనే సముద్రము నుపాసించినట్లు కలదు.

—(రామా. సప్తమ. పద్య 90-98)

7. ఇరువదవ సర్గము మూలమున శార్దూలుడను రాక్షసుడు వానర బలమును చూచి పోయి రావణునితో భేదోపాయము ప్రయోగింప గోరును. వెంటనే రావణుడు శుకుడను వానిని పంపి సుగ్రీవుని తనవైపుకు మళ్ళించుకొను ప్రయత్నము చేయును. ఆ ప్రయత్నమున శుకుడు పట్టువడి చావనుండ శ్రీరాముడు వానిని కాపాడి నిర్బంధించును. రామాభ్యుదయమున నీ విషయము లేదు. కాని వానర సేన సముద్రమును దాటిన పిదప 162 వ పద్యములో ఈ సూచన మాత్రము కలదు.

8. ఇరువది యొకటి, ఇరువది రెండవ సర్గములలో మూలమున శ్రీరాముడు సముద్రతీరమున దర్భశయనుడై వారధి నుపాసించుచు మూడు రాత్రులు గడుపును. అప్పటికిని సముద్రు

డేమియు తన కనుకూలించు విధము కానరానందున శ్రీరాముడు కోపించి మొదట కొన్ని సామాన్య బాణములచే జలాధి దేవతను కల్లోలపరుప చూచును. దాన ఫలితములేక కడకు బ్రహ్మాస్త్ర ప్రయోగమే తప్పనిసరియని భావించి ప్రయోగింపబోవ సముద్రుడు ప్రత్యక్షమై తాను తన సహజగుణములగు అగాధత్వము మున్నగు వానిని కోల్పోరాదనియు, వానర సేనలోని నలుడను వానిచేత సేతువు నిర్మింపజేయుట తగుననియు కోరును. సముద్రుని కోరికపై తానదివరకు ప్రయోగింప సజ్యమొనర్చిన దివ్యాస్త్రములను ద్రుమకుల్యముపై వైచి యా భూమిని దస్యులనుండి విముక్త మొనర్చును. సేతువు నిర్మించి శ్రీరాముడు వానర సేనతో సముద్రుని దాటి సువేలాద్రిని చేరును. రామాభ్యుదయమున సముద్ర సంక్షోభము మూలమును మించి వర్ణింపబడినది.

(రామా. సప్తమ పద్య 99-138)

ఇచ్చట రామాభ్యుదయమున 139 వ పద్యము నుండి 160 వరకు గల పద్యములలో హనుమంతుడు సువేలాద్రిని వర్ణించుట, అందలి కందరములలో రావణుడు చెఱపట్టిన స్త్రీలను శ్రీరామునిచే బంధమోక్షము సేయించుట, రావణుని విహారస్థలములను చూపి వానిని శ్రీరామునకు వివరించి వర్ణించుట మున్నగు విషయములు కలవు. ఇవి ఎవ్వియు మూలమున లేవు. సుందరకాండమున హనుమంతుడు సీతాదేవికొఱకు వెదకునప్పుడు లంకయందే యట్టి స్త్రీల వర్ణనము కలదు.

9. ఇరువది మూడు, ఇరువది నాలుగవ సర్గములలో మూలమున శ్రీరాముడు కొన్ని ఉత్పాతములను గమనించి తొందరగా సేనను లంకానగర సమీపమునకు తరలించును. అచ్చట సేన సంతతిని వ్యూహములుగా తీర్చ నీలున కాజ్ఞయిడ నతడట్లే

తీర్చును. అప్పుడు నిర్బంధింపబడిన శుకుడు విడువబడగా వాడు రావణు నొద్దకు వెళ్ళి వానరవీరుల పరాక్రమ విశేషములు, శ్రీరాముని దయాగుణమును ప్రశంసించును. రావణుడు కోపించి వానిని తరిమివేయును. రామాభ్యుదయమునను ఇది యథాతథము.

10. ఇరువదైదవ సర్గమునుండి ముప్పదవ సర్గమువరకు మూలమున రావణుడు లంకకు దగ్గరగా విడిసిన శ్రీరాముని సేనా వ్యూహ రహస్యములను దెలిసికొని వచ్చుటకు తన మంత్రులగు శుక సారణులను పంపును. వారు వెళ్ళి యచ్చట విభీషణునిచే పట్టువడి ప్రాణములతో విడువబడగా రావణునొద్దకు వచ్చి వానర సేనలో నున్న ఒక్కొక్క వీరుని గూర్చి మిక్కిలి విపులముగా వర్ణించి చెప్పుదురు. తనయొద్ద శత్రుబల మున్నట్లు ప్రశంసించి నందుకు రావణుడు మిగుల కోపించి వారిని తరిమివేసి మరల ఇతర చారుల నదే పనికి పంపును. వారిలో శార్దూలుడు ముఖ్యుడు. వారును ముందువారివలెనే వానర వీరులను, వారివారి సేనా పరిమాణములను వర్ణించి చెప్పుదురు. రామాభ్యుదయమున ఇచ్చట శార్దూలుడు లేడు.

—(రామా. సప్తమ. పద్య. 174-208)

11. ముప్పది యొకటినుండి ముప్పది నాల్గవ సర్గమువరకు మూలమున విద్యుజ్జిహ్వుడు మాయచే శ్రీరాముని ధనువును, శిరమునుచేసి తేగా వానితోగూడ రావణు డశోకవనికి వెళ్ళి వానిని సీతాదేవికిం జూపి భయపెట్టి తనకు లొంగిపోవునట్లు ప్రార్థించును. కాని వాని నామె నిరాకరించును. అప్పుడే యొక భటుడు రావణు నావలకు పిలుచుకొనిపోగా నా మాయా ధనుశ్శిరములు మాయమగును. సరమ యను రాక్షస స్త్రీ సీతాదేవి నూరార్చి అది యంతయు మాయ యనియు,

శ్రీరామాదులు సుఖులై యున్నారనియు చెప్పి రావణుని మంత్రాంగము నందలి విశేషములను వివరించి యామె భయమును మాన్పెను. ఇచ్చట మూలమున నిద్రితులైయున్న వానరుల జంపి శ్రీరాముని శిరమును నటికి తెచ్చినట్లు రావణుడు సీతాదేవితో చెప్పినట్లున్నది. రామాభ్యుదయమున నీ వివరములన్నియు మిక్కిలిగా సంగ్రహింపబడినవి. సీతాదేవి దుఃఖము మాత్రము వివరముగా నున్నది.

--(రామా. సప్తమ. పద్య. 209-218)

12. ముప్పదియైదు, ముప్పది యారవ సర్గములలో మూలమున మాల్యవంతుడు రావణునకు నీతి చెప్పెను. శత్రువు తనకంటె బలవంతుడైనప్పుడు సంధియే మేలనియు, శ్రీరాముడు బలవంతుడని తెలియుచున్నది కనుక అతనితో సంధియే ఉత్తమ మార్గమనియు బోధించును. మునులు, దేవతలుగూడ నీ శత్రువనకే జయము నిచ్చగింతురనియు చెప్పెను. ఇప్పుడు దుశ్శకునములు కూడ ఈ విషయమునే బలపరచుచున్నవని, రావణుని మనస్సు కెక్కునట్లు బోధింప జూచును కాని రావణుడు తన స్వభావమును మార్చుకోలేనని చెప్పి మాల్యవంతుని హితము నిరాకరించుటచే నా వృద్ధ వీరుడు అసమ్మతి సూచకముగ వెడలిపోవును.

(రామా. సప్తమ. పద్య. 219-236)

13. ముప్పదియేడు నుండి ముప్పది తొమ్మిదవ సర్గము వరకు మూలమున శ్రీరామాదులు లంకానగరము చేరిన వెనుక విభీషణుని మంత్రులు మారువేషములతో లంకకు వెళ్ళి రావణుని సేనా నివేశములను, వ్యూహములను గమనించి వత్తురు. ప్రహస్తుడు తూర్పుద్వారమున, మహోదర మహాపార్శ్వులు దక్షిణ ద్వారమున, ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారమున, రావణుడే స్వయ

ముగ ఉత్తర ద్వారమున సేనతో నిలిచియున్నారని చెప్పెదురు. వానరసేనకూడ వ్యూహములుగా పన్ని నిలుచుట శ్రేయమని విభీషణుడు చెప్పెను. అట్లే యని సర్వసేనాధిపతి నీలుడు తూర్పున, అంగదుడు దక్షిణమున, హనుమంతుడు పశ్చిమమున, స్వయముగ శ్రీరాముడే ఉత్తరమున నిలుచున్నట్లు వ్యూహనిర్మాణము చేయబడును. అట్లు లంకానగర సమీపమున నిలిచి ఆ రాత్రి సువేలపై గడప నిశ్చయింతురు అందరు సువేలపర్వతము నెక్కుదురు. ఉదయమైనంత వారికి లంక యంతయు గాన్పించును, వానరులు లంకానగరమందలి యుపవనములలో ప్రవేశింతురు. రావణుని చైత్యప్రాసాదమును జూతురు. రామాభ్యుదయమున నివి ఎవ్వియు లేవు. రావణుని సేన నాలుగు ద్వారములయొద్ద నిలుపబడిన విధము మాత్రము ఒక్క గీతపద్యములో చెప్పబడినది.

—(రామా. సప్తమ. పద్య. 237)

14. నలువది, నలువది యొకటవ సర్గములలో మూలమున సువేలాద్రి శిఖరముపైనుండి లంక యుత్తర ద్వార గోపురముపై రావణుని జూచి సుగ్రీవుడు ఒడలుమఱచి ఎగిరి వానిపై దూకును. ఆకస్మికమైన దాడియగుటవలన రావణుడు క్షణకాలము దిగ్భ్రమ చెందును కొంచెముసేపు వారిరువురు ద్వంద్వ యుద్ధము చేయుదురు. రావణుడు కొంచెము తెప్పరిల్లి సుగ్రీవుని ప్రహరింప నెంచినపుడు అతడు ఎగిరి మరల శ్రీరాముని సన్నిధికి జేరును. తనకు చెప్పకుండ అంత దుస్సాహము చేసినందుకు శ్రీరాముడు సుగ్రీవుని మందలించును. మరల ఆయా స్థలములలో తన సేనను శ్రీరాముడు వ్యూహరూపమున నిలిపి అంగదుని బిలిచి రావణునొద్దకు కడపటి ప్రయత్నముగ దూతగా పంపును. అంగదుడు ధైర్యముగా వెళ్ళి రావణునితో శ్రీరాముడు చెప్పిన మాటలు

చెప్పును. అచ్చటకూడ అంగదునకు రాక్షస వీరులతో సంఘర్ష ణము జరుగును కాని అంగదుడు వారినందరను దులిపివైచి తప్పించుకొని మరల శ్రీరాము నొద్దకు చేరును. ఈ విషయములు మాత్రము రామాభ్యుదయమున విపులముగా వివరింపబడినవి.

—(రామా. సప్తమ. పద్య. 238-267)

15. నలువది రెండు, నలువది మూడవ సర్గములలో మూలమున రావణుడు తన సైన్యమును కోట వెలుపలి యుద్ధ భూమికి పంపును. వానరసేన యంతయు బహుధా విభక్తమై రాక్షసులతో తలపడును. సంకులసమరము, తుములయుద్ధము, ద్వంద్వ యుద్ధము బాగుగా సాగును. రామాభ్యుదయమునకూడ నీ వివరములు సంక్షేపముగనైన బాగుగ చెప్పబడినవి.

(రామా. సప్తమ. పద్య. 268-289)

16. నలువది నాలుగవ సర్గమునుండి ఏబదియవ సర్గము వరకు మూలమున సంకుల సమరములో అంగదుడు ఇంద్రజిత్తుతో తలపడి వాని రథమును నుగ్గుచేసి విరథునిగ చేయును. ఇంద్రజిత్తు మాయ నాశ్రయించి అదృశ్యుడై రామలక్ష్మణులను వానర వీరులను మిక్కిలి బాధించును. కడకువాడు నాగాస్త్రమును సంధించి శ్రీరామ లక్ష్మణులను నాగపాశములచే బంధించును. వి[illegible] చేష్టులై నేలబడిన రాఘవులను చూచి సుగ్రీవాది వాన[illegible] విభీషణుడుకూడ మిగుల దుఃఖింతురు. శ్రీరామ లక్ష్మణులను మృతులుగా దలంచి ఇంద్రజిత్తు లంకం బ్రవేశించి తండ్రితో తాను శ్రీరామ లక్ష్మణులను వధించినట్లే చెప్పును. వెంటనే రావణుడు సంతోషాతిశయమున త్రిజటను తోడుగా సీతాదేవిని పుష్పక విమానముపై యుద్ధభూమిపైకి పంపి మృతప్రాయుడై పడి యున్న రాఘవులను జూపించును. భర్త నిజముగనే మరణించెనని

విలపించుచున్న సీతాదేవికి త్రిజట తగిన కారణములు చూపి వారు బ్రతికియున్నారని యామెను నమ్మించును. విభీషణుడు సుషేణునితో చెప్పి హనుమంతుని ద్వారా సంజీవ కరణ్యాదులగు మూలికలను దెప్పించు ప్రయత్నమునసుండ గరుత్మంతుడు వచ్చి నాగపాశములనుండి శ్రీరామలక్ష్మణులకు విముక్తి కలిగించును. శ్రీరాముడు గరుడునకు కృతజ్ఞత దెలుప తాను మిత్రకార్యము మాత్రమే చేసినట్లు చెప్పి దానికి కృతజ్ఞతా ప్రకటన మక్కర లేదని గరుడుడు వెడలిపోవును. ఎప్పటివలె అక్షతగాత్రులైయున్న శ్రీరామలక్ష్మణులం జూచి వానరులు విజృంభించి సింహనాదములు చేయుదురు.

—(రామా. అష్టమా. పద్య. 3-44)

రామాభ్యుదయమున నీ విషయము లన్నియు నున్నవి. కాని 39, 40 వ పద్యములలో నారదుడు యుద్ధభూమికి వచ్చి నాగపాశ విముక్తికై గరుత్మంతుని తలంచుకొమ్మని బోధించినట్లు కలదు. ఆ విషయము మూలమున లేదు.

17. ఏబది ఒకటవ సర్గమునుండి ఏబది యెనిమిదవ సర్గము వరకు మూలమున శ్రీరామలక్ష్మణులు నాగపాశములనుండి విముక్తులైనందుకు వానరు లొనరించిన సింహనాదములు విని రాఘవులను సజీవులుగా తెలిసికొని రావణుడు దుఃఖించును. వెంటనే సేనతో ధూమ్రాక్షుని యుద్ధమునకు పంపును. వాడు మహాభయంకర యుద్ధము చేసి హనుమంతునిచే మరణించును. మరల రావణుడు వజ్రదంష్ట్రుని పంప వాడును ఘోర యుద్ధముజేసి అంగదునిచేత మడియును. మూడవసారి అకంపనుడను రావణ సేనాని వచ్చి హనుమంతునిచే చచ్చును. ఇక సామాన్యులు చాలరని రావణుడు తన సర్వసేనానియైన ప్రహస్తుని యుద్ధమునకు పంపగా వానర సర్వ

సేనాధిపతి నీలుడు విజృంభించి ప్రహస్తుని నేలగూల్చును. ఇవన్నియు రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపముగనే యైనను చెప్పబడినవి. —(రామా. అష్టమా. పద్య. 45-49)

18. ఏబది తొమ్మిదవ సర్గము నుండి అరువది యేడవ సర్గము వరకు మూలమున ప్రహస్తుని మరణముతో రావణుడే స్వయముగా యుద్ధభూమికి వచ్చును. వానివెంట ఇంద్రజిదాదు లందరు నుందురు. శ్రీరాముడు మొదటిసారిగా రావణుని జూచి వాని తేజస్సునకు వెఱగుపడును. మొదటి యుద్ధములో రావణు నిచే సుగ్రీవుడు, లక్ష్మణుడు మూర్ఛిల్లుదురు. హనుమంతునిచే రావణుడు మూర్ఛిల్లి వెంటనే కోలుకొనును. లక్ష్మణుని పాటు చూచి శ్రీరాముడే రావణునితో పోరి వానినలయించి లంకకు పారిపోవునట్లు చేయును. లక్ష్మణుడు మూర్ఛదేరును. కుంభకర్ణుని మేల్కొలుపుదురు. వాడు మొదట రావణుని తప్పిదము నెత్తి పొడిచి కడకు యుద్ధరంగమునకు వచ్చి బ్రహ్మాండముగా పోరి వానరులకు భయము పుట్టించి కడకు శ్రీరామునిచేత చచ్చును. ఇవన్నియు రామాభ్యుదయమున సంగ్రహముగా గలవు.

—(రామా. అష్టమా. పద్య. 60-159)

ఇచ్చట రామాభ్యుదయమున 81 పద్యము మొదలు 89 వ పద్యము వరకు గల 9 పద్యములలో వాయుదేవునకు ఆదిశేషునకు గలిగిన స్పర్ధ, ఆ కారణముగా మేరుపర్వత శిఖరము ఎగిరి సముద్రమునబడి త్రికూట మను పేరున పరగుట - దానిపై లంకా నగర నిర్మాణము మున్నగు గాథలు గలవు. ఇవి యెవ్వియు మూల రామాయణమున లేవు.

19. అరువది ఎనిమిదవ సర్గము నుండి డెబ్బది రెండవ సర్గము వరకు మూలమున రావణుడు కుంభకర్ణుని మరణమునకు

భీతుడై దుఃఖించుచుండ, మహోదర, మహాపార్శ్వ, త్రిశిరులు, అతికాయుడు మున్నగువా రతని నోదార్చి తామే యుద్ధమునకు వెడలి యొక రొకరే, అంగదుడు, హనుమంతుడు, నీలుడు మొదలగువారిచేత చత్తురు. లక్ష్మణుడు అతికాయుని చంపును. వారల మరణమునకు రావణుడు మరియు భీతుడై దుఃఖితుడై దీనుడై తన గృహముననే యుండును.

—(రామా. అష్టమ. పద్య. 160-170)

20. డెబ్బదిమూడవ సర్గము నుండి డెబ్బదియేడవ సర్గము వరకు మూలమున మిక్కిలి దీనుడై యున్న రావణు నొద్దకు ఇంద్రజిత్తు వచ్చి తండ్రి నాశ్వాసింపజేసి తానే స్వయముగా యుద్ధమునకు వచ్చును. యుద్ధభూమియందు హోమముచేసి, దివ్య రథమును, దివ్యాశ్వములను, దివ్యాస్త్రములను పొందును. వానితో దృశ్యరూపుడై కొంతసేపు అదృశ్యరూపుడై కొంతసేపు యుద్ధముచేసి దివ్యాస్త్రముల ప్రభావముచే అసంఖ్యాకులగు వానరులను వధించి శ్రీరామలక్ష్మణులను గూడ మూర్ఛిల్లున ట్లొనర్చును. ఇంక అందరు మరణించిరని నమ్మి లంక చేరును. ఇచ్చట వానరవీరులు కదలుటకు, మెదలుటకును గూడ నశక్తులు కాగా జాంబవంతు డెట్లో హనుమంతుని తన దగ్గరకు పిలిచి మలయగిరి యందలి సంజీవ కరణ్యాదులగు ఓషధులు తెచ్చినచో వాని ప్రభావముచేత వీ రందరు బ్రతుకుదురని చెప్పును. అట్లే యని వెడలిన హనుమంతుడు అచ్చటి ఓషధులలో తనకు కావల సిన వెవ్వియో గుర్తింపలేక పర్వతమునే పెకలించి తెచ్చును. అందలి ఓషధుల వాసన సోకినంతనే శ్రీరామలక్ష్మణులతో సహా వానరులందరు అక్షతగాత్రులై నిద్రనుండి మేల్కాంచినట్లు లబ్ధ సంజ్ఞు లగుదురు. హనుమంతుడు పర్వతమును మరల యథాస్థాన

మున నుంచును. వానరులు మహానందపరవశులై యుండ ఓటమిపై నోటమి సంభవించి రావణుడు కింకర్తవ్యతామూఢుడై యుండగా నిదియే యదనని సుగ్రీవుడు వానరులకు లంకకు నిప్పంటించ నాజ్ఞ యిడును. వానరులు విజృంభించి లంక యంతయు వీధివీధి తిరిగి కాల్తురు. ఆ యలజడి తెలిసిన రావణుడు వారలపైకి కుమారుడగు అకంపనుడు మున్నగువారిని పంపగా వారందరు మరణింతురు. మరల రావణుడు కుంభకర్ణ పుత్రులైన కుంభుని నికుంభుని యుద్ధమునకు పంపును. కుంభుడు సుగ్రీవుని బాగుగా నలయించియు అతనిచేతనే చచ్చును. నికుంభుని హనుమంతుడు అవలీలగా చంపివేయును. హతశేషులు లంక ప్రవేశించి రావణునకు విషయము నివేదింతురు. ఇవన్నియు రామాభ్యుదయమున సంక్షేపముగా నున్నవి.

—(రామా. అష్టమా. పద్య. 171-179)

21. డెబ్బది యెనిమిది, డెబ్బది తొమ్మిది సర్గములలో మూలమున కుంభ, నికుంభుల మరణము విని మిక్కిలి దుఃఖించుచున్న రావణునితో ఖరుని పుత్రుడైన మకరాక్షుడు తాను రామలక్ష్మణులను వధించివత్తునని బీరములు పల్కి యుద్ధభూమికి వచ్చి శ్రీరామునితో కూడ అట్టి బీరములే పలికి కడకు శ్రీరామ బాణబాధితుడై చచ్చును. ఈ విషయము రామాభ్యుదయమున లేదు.

22. ఎనుబదినుండి తొంబది రెండవ సర్గము వరకు మూలమున ఇంద్రజిద్వృథాఘట్ట మాక్రమించినది. మకరాక్షుని మరణముతో రావణుడు దిక్కుతోచనివాడై ఇంద్రజిత్తు నాహ్వానించి యుద్ధమునకు పంపును. వాడు హోమము చేయుటకు ప్రారంభించును, దానినుండి ఎప్పటివలెనే అంతర్ధాన శక్తిగల రథము

ధనువు వెలువడి వచ్చును. అదృశ్యశక్తిచే వాడు వానర వీరులను, శ్రీరామలక్ష్మణులను ఎక్కువగా బాధించును. వారును ఇంద్ర జిత్తును శీఘ్రముగా మట్టుపెట్టు ఉపాయ మాలోచించు చుండగనే వాడు మాయ నాశ్రయించి సీతాదేవిని సృష్టించి శ్రీరాము నెదు టనే ఆమెను కొట్టి బాధించును. ఆ దుష్టచేష్టకు హనుమంతుడు మిక్కిలి కోపించి వాని నెదిరించును వాడును సీతాదేవిని చంపు నట్లే నటించును. హనుమంతు డొక్కడే కొంత వానర సేనను గొని ఇంద్రజిత్తును వాని సేనను అలయించి చీకాకుపరచును. ఇక తన యాట సాగదని ఇంద్రజిత్తు నికుంభిల కేగి యాగము చేయ తలపెట్టును. సీతాదేవి నిజముగా మరణించెనని శ్రీరా ముడు చైతన్యమునే కోల్పోవును. లక్ష్మణు డాయనకు కర్తవ్య బోధ సేయును. లక్ష్మణుడు విజృంభించును. నికుంభిలయందు హోమము పూర్తియైన ఇంద్రజిత్తు అజేయుడగునని విభీషణుడు చెప్పి సీతాదేవిని వాడు చంపుట వట్టి మాయయని అందరను నమ్మించును. యజ్ఞవిఘ్నము చేయ వానరులను పురికొల్పును. లక్ష్మణుడు నాయకత్వము వహించి హనుమదాదులతో నికుంభిల కేగును. ఎవడు నికుంభిలయందు జరుగు యజ్ఞమునకు విఘ్నము చేయునో అతనిచేతనే ఆ యజ్ఞకర్తకు చావున్నదను దేవ రహ స్యము వారికి తెలియవచ్చును. లక్ష్మణుడే ఆపని చేయ సమర్థుడని విభీషణుడు చెప్పును. లక్ష్మణుడు వానర వీరుల సాయమున ఇంద్ర జిత్తు సేయు యజ్ఞమునకు విఘ్నమొనర్చును. ఇంద్రజిత్తు మొదట హనుమంతుని చంపనెంచును. కాని విభీషణ ప్రేరితుడై వానికి లక్ష్మణు డడ్డుపడును. ఇంద్రజిత్తు విభీషణుని ద్రోహియని నిందిం చును. ఇంద్రజిల్లక్ష్మణులు ఘోరయుద్ధము సేయుదురు. కడకు లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించును. అలసి, సొలసి శరీరమంతయు

గ్రుచ్చుకొన్న బాణములు, గాయములుగల లక్ష్మణుని, వానరులను, సుషేణుడు మూలికల సాయమున అక్షతగాత్రుల నొనర్చి సేదదేర్చును. రామాభ్యుదయమున ఇంద్రజిత్తు మాయా సీతను చంప ప్రయత్నించుట యొక పద్యమున సూచింపబడినది. మరి యొక పద్యమున ఇంద్రజిద్వధ వర్ణింపబడినది. తక్కిన విషయము లెవ్వియు రామభద్రయ్య వర్ణింపలేదు. మూలమున 13 సర్గముల వరకు వ్యాపించి యుద్ధకాండమునకే తలమానిక మనిపించు కొన్న ఇంద్రజిద్వధా ఘట్టమును రామభద్రయ్య కేవలము మూడు పద్యములలో చెప్పివైచుట చిత్రముగనే యున్నది.

(రామా. అష్ట. పద్య 180-182)

23. తొంబది మూడు, తొంబది నాలుగు, తొంబది యైదు సర్గములలో మూలమున ఇంద్రజిద్వధ విని రావణుడు భయవిహ్వలుడై చలించి మూర్ఛిల్లును, కోపవశుడై విచారశూన్యుడై సీతాదేవిని చంప పూనుకొనును. కడకు ఒక మంత్రి నీతిని పాటించి యా ప్రయత్నమునుండి విరమించును. గృహమునకు వచ్చి కొందరు వీరులను యుద్ధమునకు పంపును. వారలు యుద్ధములో శ్రీరామాదులను కొంతసేపైన నిలువరించి యలరెంతురనియు తరువాత మరునాడు వారిని తాను సులభముగా జయింపవచ్చుననియు వాని యభిప్రాయము. కాని యిచ్చట శ్రీరాముడు వారిపై గంధర్వాస్త్రము ప్రయోగింప వారికి శ్రీరాము డొక్కడే వేనవేలు రూపములుగా గన్పించును. దిగ్భ్రమచెంది ఆ పోయిన రాక్షసులు బహు సులభముగనే శ్రీరామునిచే హతులగుదురు. ఆ వార్త విని రావణుడు చనిపోయినవారి నొక్కొక్కరినే పేర్కొని పరితపించును.

(రామా. అష్టమ. పద్య 183-193)

24. తొంబదియారునుండి తొంబది తొమ్మిదవ సర్గము వరకు మూలమున రావణుడు రథము సన్నద్ధము చేసికొని విరూపాక్ష మహాపార్శ్వాదులతో యుద్ధమునకు వెడలును. వెనువెంటనే ఎన్నియో దుశ్శకునములు పొడగట్టును. సుగ్రీవు డొక్కడే విరూపాక్ష మహోదరుల నిరువురను చంపును. అంగదునిచే మహాపార్శ్వుడు కూలును. ఈ విషయము లెవ్వియు రామాభ్యుదయమున లేవు.

25. నూరునుండి నూటపదునొకండవ సర్గము వరకు మూలమున రావణుడు శ్రీరాము నెదుర్కొని తామసాస్త్ర ప్రయోగముచే పెక్కురు వానర వీరులను దగ్ధమొనర్చును. రామరావణుల ద్వంద్వయుద్ధము హోరాహోరిగ సాగును. రావణుడు విభీషణునిపై శక్తిని ప్రయోగింప దానికి లక్ష్మణుడు లక్ష్యమగును. ఆ శక్తి యాఘాతమునకు లక్ష్మణుడు మూర్ఛిల్లును. శ్రీరాముడు లక్ష్మణుని పాటు చూచి దుఃఖితుడయ్యును యుద్ధము నిలుపక రావణునితో పోరు సాగించును. యుద్ధము చేయుచునే శ్రీరాముడు లక్ష్మణ రక్షణ భారము సుషేణున కప్పగించును. లక్ష్మణుడు బ్రతికియే యున్నాడని సుషేణుడు శ్రీరామునితో చెప్పి యతనికి ఊరట కల్గించును. సుషేణుడు హనుమంతుని బిలిచి యోషధి పర్వతమునుండి సంజీవకరణ్యాదులను తెమ్మని పంప నతడు పూర్వమువలెనే కొండనే తెచ్చి లక్ష్మణుని బ్రతికించి మరల పర్వతమును యథాస్థానమునకు చేర్చును రావణుడు రథస్థుడై యున్నందున ఆ అసమ యుద్ధము లగ్గుకాదని దేవేంద్రుడు మాతలి సారథికమైన తన రథమును శ్రీరాము నొద్దకు పంపును. అతడా రథము నెక్కి రావణునితో తలపడును. రావణుడు శ్రీరామునిపై రాక్షసాస్త్ర ప్రయోగము చేసి, దానసర్పములం బుట్టించి బాధిం

చును. శ్రీరాముడు వెంటనే గరుడాస్త్రముచే వానిని రూపు మాపును. యుద్ధమున రావణుడు మిక్కిలి యలసి యుండగా వాని సారథి రథమును యుద్ధరంగమునుండి తొలగదోలుకొని పోవును. రావణుడు సారథిపై కోపించియు వాడు చేసిన పని సక్రమమైన దనియే గుర్తించును. అగస్త్యుడీ పట్టున శ్రీరామునకు "ఆదిత్య హృదయము" బోధించును. మరల రామ రావణులు తలపడుదురు. ఇప్పుడు రావణాపజయము సూచించు దుశ్శకునములు కాన్పించును. యుద్ధము ఘోరమగును. శ్రీరాముడు రావణుని శిరములు, కరములు, ఎన్నిసార్లు త్రెంచినను అవి మరల మొలవసాగును. మాతలి ప్రేరితుడై శ్రీరాముడు బ్రహ్మాస్త్రప్రయోగముచే రావణుని చంపును. రామాభ్యుదయమున సంక్షేపముననే యైనను నివి యన్నియు గలవు.

—(రామా. అష్టమ. పద్య 194-232)

26. నూట పండ్రెండు నుండి నూట పదునైదవ సర్గము వరకు మూలమున విభీషణుడు మృతుడైన రావణుని గూర్చి పనవి పనవి దుఃఖించును. అట్లే రావణు భార్యలందరును వచ్చి రావణ శవమునొద్ద విలపింతురు. మండోదరియు తన భర్త ఎవరి మాటను వినకపోవుటచేతనే దుర్మరణము పాలయ్యెనని యేడ్చును. కడకు శ్రీరాముడు విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకము చేయును. ఇవియన్నియు సంక్షేపముగా రామాభ్యుదయమున నున్నవి.

—(రామా. అష్టమ. పద్య. 233-235)

27. నూట పదునారునుండి నూట ఇరువది యొకటవ సర్గము వరకు మూలమున శ్రీరాముడు హనుమంతుని ద్వారా

సీతాదేవికి శత్రుజయమునకు సంబంధించిన విషయములన్నియు నివేదింప బంపును. తరువాత విభీషణునితో చెప్పి సీతాదేవిని సుస్నాతను గావించి అలంకరించి తీసికొని రాగోరును. విభీషణు డట్లే చేయును. శ్రీరాము డామె నంగీకరింపక లోకనిందకు భయపడి ఆమె నెచ్చటికైన పొమ్మనును. ఆమె లక్ష్మణుని ప్రార్థించి చితి పేర్పించి అందు దుముకును. అగ్నివలన నామె కెట్టి యపాయము కలుగకపోగా, అగ్నిదేవుడే ప్రత్యక్షమై నిరపాయ స్థితినున్న సీతాదేవిని శ్రీరామునకు సమర్పించి ఆమె మిక్కిలి పతివ్రత యని నొక్కి చెప్పును. అగ్నియొక్కయు, బ్రహ్మదేవుని యొక్కయు ప్రార్థనముపై శ్రీరాముడు సీతాదేవి నంగీకరించును. ఇవన్నియు రామాభ్యుదయమున లేవు.

28. నూట ఇరువది రెండు నుండి నూట ముప్పది యొక టవ సర్గము వరకు మూలమున ఆకాశమున విమానములో దశరథ మహారాజు విజయంచేసి సీతా రామ లక్ష్మణులను ఆశీర్వదించును. సన్నిహితుడైన దేవేంద్రుడు శ్రీరాముని కోరికపై అమృతవర్షము కురిపించి వానర ఋక్ష వీరులను బ్రతికించును. భరతుని జూడ తహతహ పడుచున్న శ్రీరామునితో వారందర నొక్క దినమున అయోధ్యకు జేర్పగలనని విభీషణుడు చెప్పును. వెంటనే రావణాంతఃపురమునుండి పుష్పకవిమానము నచ్చటికి తెప్పించును. సుగ్రీవ విభీషణులు వారివారి యాప్తులతో అయో ధ్యకు పోగోరుదురు. అందులకు శ్రీరాము డంగీకరించును. పుష్పక ముపై ప్రయాణము చేయుచు శ్రీరాముడు సీతాదేవికి దారిలోని విశేషము లన్నియు చూపును. తాను సుగ్రీవునితో స్నేహము చేసిన చోటుకూడా చూపును. అందరు అయోధ్య నగర సమీప మున గల భరద్వాజాశ్రమమున విడియుదురు. ఆ రాత్రికి వారం

దర కాయాశ్రమమున ఫలమూలములతోఁడి విందు జరుగును. హనుమంతుని మూలమున శ్రీరాముడు భరతునకు తనరాక చెప్పి పంపును. భరతుడు మహానందభరితుడై శ్రీరాముని చరిత్ర మంతయు హనుమంతుడు చెప్పగా వినును. భరత శత్రుఘ్నులు శ్రీరామాదులం చేరుదురు. శ్రీరామ పట్టాభిషేకము మహా వైభవ ముగా జరుగును. మిక్కిలి సంగ్రహముగ నివియన్నియు రామా భ్యుదయమున గలవు.

(రామా. అష్టమ. పద్య. 236-248)

12

# భాస్కర రామాయణము

## రామాభ్యుదయము

సకలకథాసార సంగ్రహ కర్తృత్వ నిర్ణయము చేయు పట్టుల కవుల రచనలలోని త్రివిధ సంవాదములనుగూర్చి చర్చింప బడినవి. అవి కేవలము ఒక కవి రచనను శబ్దతఃగాని, భావతః గాని, మరియొక కవి అనుకరించుట వరకే పరిమితము. అవి ఒకే సన్నివేశమునకు పరిమితములై యుండనక్కర లేదు. రామభద్రయ్య తిక్కనను, పోతనను, నందితిమ్మయను అల్లసాని పెద్దనను, కాళిదాసాది సంస్కృత కవులను అనుకరించిన విధము వివరింపబడినది. కాని ఈ ప్రకరణమున భాస్కర రామాయణము నొరవడిగా పెట్టుకొని రామభద్రయ్య ఏ యే ఘట్టములు రచించెనో గుర్తించుట ప్రధానముగా చర్చింతును. వాల్మీకి రామాయణమున ఉన్నను లేకున్నను భాస్కర రామాయణమున నున్న కథా సన్నివేశములను రామభద్రయ్య యథాతథముగ తన రామాభ్యుదయమున గైకొన్నట్లు చాలచోట్ల మనము గుర్తింపగలము. అట్టివానిలో కొన్నింటిని మాత్రము ఉదాహరణార్థము ఈ క్రింద నిచ్చుచున్నాను.

### 1. పరశురామ వృత్తాంతము

వాల్మీకమున బాలకాండము 76 వ సర్గమున మిథిలా నగరమునుండి శ్రీరామాదుల వివాహానంతరము దశరథాదులు

అయోధ్యా ప్రత్యాగమనము చేయునపుడు దారిలో పరశురాము డెదురై శ్రీరాము నధిక్షేపించి యవమానపడిన ఘట్టము అన్ని రామాయణములందును నున్నది. వాల్మీకమున బాలకాండము 76 వ సర్గము 17, 18, 19 శ్లోకములు చూడుడు—

"అక్షయం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్
ధనుషోఽస్య పరామర్శాత్ స్వస్తి తేఽస్తు పరంతప॥
ఏతే సురగణా స్సర్వే నిరీక్షంతే సమాగతాః।
త్వా మప్రతిమకర్మాణ మప్రతిద్వంద్వ మాహవే॥
న చేయం మమ కాకుత్స్థ! వ్రీళాభవితు మర్హతి।
త్వయా త్రైలోక్యనాథేన యదహం విముఖీకృతః॥

ఈ పై శ్లోకములకు భాస్కరరామాయణమునందలి యను వాదము చూడుడు—

"నా విల్లెక్కిడి నప్పుడ
నీవు చతుర్భుజుడవౌట నిక్కము మదిలో
భావించి కంటి నితరుల
కీ విక్రమ బాహుశక్తు లెందును గలవే (బాల 773)

"కావున నీవు రాఘవ! జ
గత్త్రియ కర్తవు సర్వదేవతా
దేవుడవైన విష్ణుడవు
తెల్లము నాకిటులౌట నిందగా
దీ విజయంబు నా విజయ
మేనును నీవును వైష్ణవాంశ సం
భావిత భద్రమూర్తులము
పంకజనాభుని లీల లిన్నియున్ (బాల 774)

ఇక రామాభ్యుదయమునగల యనువాదమును గమనిం పుడు —

> నీవా చతుర్భుజుండవు
> కావున నెక్కిడితివిట్టి కార్ముకమింకన్
> నీ విజయము నాయది శ్రీ
> దేవుని యంశమున బుట్టితిమి మన మనఘా!
>
> (చతు. 144)

తెలుగు అనువాదములలో క్రీగీతలుగల భాగము భాస్కర రామాయణమున, రామాభ్యుదయమున సమానము. ఈ యర్థము మూలమున లేదు. శబ్దార్థ సామ్యమును బట్టి రామభద్రయ్య భాస్కరరామాయణము నుండియే ఈ భావమును గ్రైకొనెనన్న తప్పుకాదు.

## 2. కాకాసుర వృత్తాంతము

వాల్మీకి రామాయణమున కాకాసుర వృత్తాంతము అయోధ్యాకాండ కథాభాగమున లేదు. కథ జరిగినది. అయోధ్యాకాండ కథా కాలముననే యైనను ఈ విషయము సీతాదేవి శ్రీరామునకు హనుమంతుని మూలమున సందేశ మంపునప్పుడు అభిజ్ఞానార్థము హనుమంతునితో చెప్పినట్లు సుందర కాండ కథా భాగమున కలదు. కాని భాస్కర రామాయణ, రామాభ్యుదయముల రెండింటను ఈ వృత్తాంతము అయోధ్యా కాండ భాగముననే కలదు. రెండింటియందును కథా కథన రీతి కూడ ఒకటిగానుండి సుందరకాండమందలి కథాకథన రీతితో భేదించుచున్నది. చూడుడు—

భాస్కర రామాయణమున—

"అవనిజ దేవోపహార ఫలంబులు
చెలువార నలవాటు చేయుచోట
నుపహతి గావింప నొక కాక మేతెంచి
నుడియంగ పలుమారు జోపి చోపి
కడు డయ్యుటయు దాని గని నృపాలుండిషీ
కాస్త్రంబు మంత్రించి యలుక నైవ
నదియు వెన్నడి నస్త్రమై తోల నకాకి
త్రిజగంబు గ్రుమ్మఱి దిక్కు లేక
మగుడ నేగుదెంచి మనుజేంద్ర యపరాధి
కావు మనుడు విభుడు కరుణ చూడ్కి
నొలయ నల్లనగుచు నో పక్షినావిశి!
ఖంబు రిత్తవోదు గాన వినుము (అయోధ్యా 292)

"నీయం దొక నయనము నా
సాయకమున కిచ్చి బ్రతికి చను మనవుడు నా
వాయసమును నొక యంబక
మాయంబకమునకు నిచ్చి యరిగెంబెలుచన్ (293)

ఇక ఈ క్రిందిది రామాభ్యుదయమునగల కథా భాగము.

"అంత నొకనాడు సీతా
కాంత మునిస్త్రీల పొందికలు మరగినిజ
ప్రాంత మహీరుహ సుమఫల
సంతతిగొని విభుడెలర్ప జను దేరంగన్" (పంచమా 66)

"ఏ కాకి నొండు దుర్మతి
యేకాకియొ తోలదోల నేగక సీతన్

రాకన్ బోకన్ వెనుకొక
కాపత్థాన్వయవరుండు గని కుపితుండై" 67

"విసరి యొకయూచ గొనివేయ వెంటవెంట
నదియు నొక్క మహాస్త్రమై కదియకాకి
లావుసెడివచ్చి ననుఁ గావు కావుమనుచు
పాదముల వ్రాల పరమకృపాళుఁడగుచు" 68

"వాయాశుగం బమోఘము
నీ యంగం బొకటియిమ్ము నీ ప్రాణము నే
నీ యెడగాచితి నావుడు
నా యంబకమునకు నొక్క యంబకమిచ్చెన్" 69

రామాభ్యుదయమున నీ ఘట్టము ప్రయోజన రహితముగా కూర్పబడినది. మరల సుందరకాండమున దీని నుపయోగించుకొనలేదు. అదిగాక ఇది ఉత్తరోత్తర కథకు సహాయమును కాదు. ఐనను రామభద్రయ్య ఈ కాకాసుర వృత్తాంత మిచ్చట చొప్పించుట కేవలము భాస్కరరామాయణము ననుకరించుటయే కాని మరియేమియు కాదు. పైగా క్రీగీతలుగల భాగములు చూచిన నవి యెంత సామాన్యముగలిగియున్న ఘట్టములో సులభముగా తెలియును.

### 3. సీతాదేవి నగలు – ఉత్తరీయ వృత్తాంతము

వాల్మీకి రామాయణము కిష్కింధాకాండము 6 వ సర్గము 19, 20, 21 శ్లోకములలో నీ వృత్తాంతము కలదు. శ్రీరాముడు సుగ్రీవునితో సఖ్యముచేసిన వెంటనే వారు తాము ఋష్యమూకముపైనున్నప్పుడు ఆకసమునుండి యొక స్త్రీ తన నగలు ఒక ఉత్తరీయమున చుట్టి తామున్న చోట పడవేసినదనియు, ఆపదలో

నున్న యాస్త్రీ సీతాదేవియే యగునేమో ఆ నగలు చూచిన తెలియుననియు సుగ్రీవుడు చెప్పెను. ఆ నగలు చూచుటకు తొందరపడుచున్న శ్రీరామునకు సుగ్రీవుడు నగల మూట తెచ్చి చూపును. శ్రీరాముడు వానిని గుర్తింప లక్ష్మణునకు చూపును. ఆ ఘట్టమునందలి శ్లోకము లీ క్రిందివి.

> పశ్యలక్ష్మణ! వైదేహ్యాసంత్యక్తం హ్రియమాణయా
> ఉత్తరీయమిదం భూమౌ శరీరాద్భూషణానిచ
> శాద్వలినాంధ్రువంభూమౌసీతయాహ్రియమాణయా
> ఉత్సృష్టం భూషణమిదం తథారూపం హి దృశ్యతే॥

ఇచ్చట ఉత్తరీయమున కేమాత్రము ప్రాధాన్యము లేదు. పచ్చిగడ్డిపై పడుటచే నా యుత్తరీయము మూట అంతగా నలిగి యుండలేదని మాత్రమే యందలి భావము. కాని భాస్కర రామాయణమున ఉత్తరీయమున కిచ్చిన ప్రాధాన్యము గమనింపుడు.

> "ఘనరతిశ్రమజాతఘర్మాంబు లార్పంగ
> నతివకు వీవన యగుదుగాదె
> ప్రణయకోపాననన్ బాసి తానున్నచో
> నంబు జాస్యకు తల్పమగుదుగాదె
> కనుబాటుగాకుండ వనితచన్దోయికి
> నంచిత ప్రతిసీర యగుదుగాదె
> తరుణికి పేరెండ తాకకుండంగ శీ
> తాతపవారణ మగుదుగాదె
>
> అట్టి యవనిజ బాసి నీవకట దూర
> మెట్లు వచ్చితి నాకడ కెలమి మిగుల

ననుచు నయ్యుత్తరీయంబున నల్లందిగిచి
కప్పుకొని బాష్పధారలు గ్రమ్మ వగచి

(కిష్కింధా-60)

ఈ ఘట్టముననే రామభద్రయ్య యనువాదము చూడుడు.

"సహృదయమైయుంట.........

..........................

మిట్టిపడు నుత్తరీయంబు ముట్టిపలుకు" (పంచ-281)

"దాకొని రతిసమయంబుల
జోకన్ వలిగాడ్పు లీను సురటివిసీవే
యాకాంత సేద దేర్పుదు
నీకు పటాంతరము సవతునేఁ గానఁజుమీ" (282)

భాస్కర రామాయణమునను, రామాభ్యుదయమునను ఉత్తరీయమున కిచ్చిన ప్రాధాన్యము గుర్తింప దగినది. ,అది మూలమున లేదు.

## 4. ముద్రికా (అంగుళీయక) వృత్తాంతము

వాల్మీకి రామాయణము - సుందరకాండము 36 వ సర్గమున గల—

"గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్ (4)

అను శ్లోకమున పై వృత్తాంతము గలదు. ఆ ముద్రికను జూచినపుడు తన భర్తనే పొందినట్లు ఆమె సంతోషించినదని మాత్రమే అందలి యర్థము. దానిని భాస్కర రామాయణమున వర్ణించిన విధము చూడుడు—

"తనువున పులకము నెగయఁగ
కనుఁగవ నానంద బాష్పకణములు గ్రమ్మన్
కనుగొని లజ్జావనతా
ననయైతగ మరియు జూచి నాథుఁడపోలెన్ (సుందర-291)

"అక్కున జిక్క చేర్చి ముద
మారఁగ ముద్దిడి యింతగాలమే
నిక్కడ నిట్లు యుండఁగ ని
జేశుఁడు నీవును నన్ను బాసి మీ
రక్కడ నుండ నెట్లు మన
సాయె విభుండట నం దలంచునా
నిక్కము చెప్పు నా వలని
నెయ్యము భూపతి కెట్టి చందమో. (292)

"బాతిగనిడ నైవేయక
మైతో చెదునాకు నాదు ప్రాణేశునకుం
జేతం బెట్టఁగ కంకణ
మైతో కేయూర మైతో యచ్చట జెపుమా!" 2౹3

నరపతికి నాకు పరిణయ
మిరవారఁగ నాఁడు చేసితిప్పుడు దేశాం
తరమున జిక్కిన నన్నును
వరునిం గూర్పంగ నీవ వచ్చితి కరుణన్" 294

ఈ భాగము రామాభ్యుదయమున నున్న విధ మీ క్రిందిది. ఇచ్చట ముద్రికా వర్ణనము రామభద్రయ్య 20 పద్యములలో చేసి యున్నాఁడు. కొన్నింటిని మాత్ర మిచ్చట ఉదాహరింతును.

"తన శిరముమీద నిడుకొను
కనుగవ నద్దికొను చల్ల కన్నీటం దో
చు నెదనునుచు నమ్ముద్రిక
మనసున తన ప్రాణవిభుని మారుగదలచున్ (షష్ఠా-179)

"ఉగ్ర ధనుర్విభేదనున కోమణి మణిముద్రిక! నీవు నేను బా
ణిగ్రహణం బొనర్చి కరుణించుటకుం దగియున్నయున్కియ
వ్యగ్రమతిం దలంచికొని ప్రాణసఖున్నను బారమైవ క
త్యుగ్రవిపద్దశ నొ్నగిలియున్నదిగా యని చూడవచ్చితే"
(182)

"ననుబాసి దూరమున చి
క్కిన యినకులుప్రేలనుండ కిటువచ్చితె? యా
యన నలకువ దిన దినమున్
గనుగొనగా లేక ముద్రికా! ననువెదకన్" 185

మూలమున నున్న ఒక్క శ్లోకమునకు భాస్కరరామాయణమున నాలుగు పద్యములలో వివరముగ వ్రాయగా రామాభ్యుదయమున నిది 20 పద్యములవరకు వ్యాపించినది. రెండింటికి సామ్యము గమనింపవచ్చును.

## 5. రావణుడు శరణాగతుడైనచో అయోధ్య నిత్తు ననుట

విభీషణుడు లంకను, అన్నను, బంధువులను, వదలి శ్రీరామునకు శరణాగతుడైనప్పుడు అతనికి లంకారాజ్య ప్రదానము వాగ్దత్తమైనది. ఈ విషయము వాల్మీకమున గలదు. కాని రావణుడు కూడ తరువాత నెప్పుడైన శరణాగతుడైన నెట్లు అను ప్రశ్నము వాల్మీకమున పుట్టలేదు. రామాయణము ఋషిప్రోక్తము గాక రావణుడు శ్రీరామునిచేత తప్పనిసరిగ మరణింపవలసి

యున్నదని యాక్రాంత దర్శికి తెలియును కాబోలు. ఆయన అట్టి ప్రశ్నకు స్థానమీయ లేదు. కాని భాస్కర రామాయణ కర్తకు ఆ ప్రశ్న యుదయించినది. విభీషణ శరణాగతి సమయమున సుగ్రీవుడు శ్రీరామునితో—

"అనఘ చరిత్ర! మీకు శరణాగత రక్షకుల వ్రతంబు మీ
సునిశిత బాణజాలముల చోకున కోర్వక వచ్చితా దశా
నను డభయంబు వేడికొనినం దగ వెట్లగునన్న-నవ్విభుం
డిన సుతు జూచి యట్లయిననిచ్చెదవానికయోధ్యనావుడున్

(యుద్ధ 191)

ఈ భావమునే రామభద్రయ్య కూడ గైకొనినాడు కాని సందర్భమును మార్చినాడు. అంగదుడు రావణు నొద్దకు శ్రీరామ ప్రేషితుడై దూతగ వెళ్ళినప్పుడు శ్రీరాముని హృదయము నెరింగినవాడు వోలె రావణునితో—

"ఇంకనైనను జానకి నిచ్చి శరణు
చొచ్చితేని యయోధ్య నీ కిచ్చు విభుడు
నాడెలంక విభీషణునకు నొసంగి
నాడు నేడింక నీకది వేడరాదు" (సప్తమ. 262)

అన్నాడు. ఈ విషయముకూడ భాస్కరరామాయణానుసారిగ వ్రాయబడినదే యని స్పష్టముగ గ్రహింపవచ్చును.

## 6. పుష్పకము విధవను ధరింప దనుట

శ్రీరామలక్ష్మణులు నాగపాశ బద్ధులై చేష్టాహీనులై పడి యున్నపుడు వారలను మృతులుగా సీతాదేవికి నిరూపింప దలచి రావణుడు పుష్పక విమానముపై త్రిజటయను రాక్షస స్త్రీని తోడిచ్చి సీతను యుద్ధభూమికి పంపును. సీతాదేవి నిజముగనే

భర్త మృతుడయ్యెనని దుఃఖించునపుడు త్రిజట యామె నూరార్చుచు వాల్మీకి రామాయణమున నీ క్రింది శ్లోకములలో వర్ణించిన విధమున పలుకును :

"కారణాని చ పశ్యామి మహాన్తి సదృశానిచ ।
యథేమౌ జీవతో దేవి! భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥

న హి కోపపరీతాని హర్షపర్యుత్సుకానిచ ।
భవంతి యుధి యోధానాం ముఖాని నిహతే పతౌ ॥

ఇదం విమానం వైదేహి! పుష్పకంనామ నామతః ।
దివ్యం త్వాం ధారయేన్నైవం యద్యేతౌ గతజీవితౌ ।
(యుద్ధ 48 సర్గ 23, 24, 25, 26 శ్లోకములు)

ఇచ్చట శ్రీరామలక్ష్మణులు బ్రతికియే యున్నారనుటకు కొన్ని కారణములను త్రిజట పేర్కొన్నది. నిజముగనే రాజు మరణించినచో యోధుల ముఖములపై కోపముగాని ఆనందము కాని మనము చూడలేము. ఇచ్చట వానరవీరుల ముఖములు కలకలలాడుచునే యున్నవి. కాని శ్రీరామ లక్ష్మణులు జీవించియే యున్నారని త్రిజట చెప్పుట ముఖ్యము. ఈ ఘట్టమునే భాస్కర రామాయణమున నిట్లనువదింప బడినది.

చెలువకనుం గొనంగ శవ
చిహ్నము లేమియు లేవు ప్రాణముల్
తొలగిన నంగ కాంతు లిటు
దోప వ నాయకమైన సైన్యముల్
నిలువవు వారె సూరెల బ
లీ ముఖవీరులు గంటె, కంటె ధా

పలికెదస కంట చంటను శు
　　భస్ఫురణంబదె నీకు నొప్పెడున్" (యుద్ధ - 590)
"అంతియకా దీ పుష్పక
మింతీ విధవలగు వార లెక్కిన జన దో
క్కింతయు గావున నెమ్మోయి
సంతోషమ నీకు నా కసత్యము లేలా? (591)

రామాభ్యుదయమునందలి యనువాద పద్ధతి చూడుడు—
"అని విలపించుచున్న త్రిజ
　　టాసురి యల్లలితాంగి జూచి యో
వనజదళాక్షి! నీ హృదయ
　　వల్లభు డాయు రుపేతుడౌటనున్
నిను భరియించు పుష్పకము
　　నిక్కము దెల్పెడు దివ్యయానమున్
గని విధవం భరింప దటు
　　గాన జలింపకు మమ్మ నెమ్మదిన్ (అష్ట-32)

నిజముగనే పుష్పకమునకు విధవలను భరింపదను వరమో, శాపమో ఉన్నదైన, సీతాదేవి నూరార్చుటకు త్రిజట యితర కారణముల నన్నింటిని ఏకరువుపెట్ట నక్కర లేదు. పైగా మూలము నందలి "యద్యేతౌగత జీవితే" అను శబ్ద సమూహమే, సీతాదేవి వైధవ్యమును నిర్ణయించునదైనచో అదియు సరికాదు. నిజముగా వాల్మీకి ఆ శబ్దసమూహము చేత శ్రీరామ మరణమును సూచింప దలచిన "యద్యయాగత జీవితః" అని శ్రీరాము నొక్కనినే నిర్దేశించి యుండును. కావున రామభద్రయ్య భాస్కర రామాయణానుసారిగనే రచించెనని చెప్పవచ్చును.

## 7. నారదాగమ వృత్తాంతము

వాల్మీకిరామాయణము యుద్ధకాండమున శ్రీరామ లక్ష్మణులు, నాగపాశ బద్ధులై యున్నపుడు, సుషేణుడు హనుమంతుని మూలికల కొరకు పంపనుండగా గరుత్మంతుడే స్వయముగ వచ్చి రాఘవులను నాగపాశములనుండి విముక్తుల నొనర్చును. ఇచ్చట మూలమున నారదుడు వచ్చి గరుత్మంతుని ప్రార్థింపుడని శ్రీరాముని హితము బోధించినట్లు లేదు. కాని భాస్కరరామాయణమున నీ ఘట్టమునందు నారదుడే వచ్చి శ్రీరాముడు గరుత్మంతుని ప్రార్థించిన వెంటనే నాగపాశము లూడునని చెప్పును. శ్రీరాముడట్లే చేయగా గరుడుడు వచ్చును. ఈ ఘట్టము భాస్కరరామాయణము యుద్ధకాండమున 609 నుండి 625 వ పద్యము వరకు 17 పద్య గద్యములలో వర్ణింపబడినది. ఇచ్చట శ్రీరాముడే విష్ణువనియు నతడే పూర్వావతారములలో హిరణ్యకశిపాదుల పరిమార్చెననియు చెప్పును. రామాభ్యుదయమునకూడా నీ ఘట్టమున నారదుడు విచ్చేసినట్లే యున్నది చూడుడు:—

> "అని విలపింప నారదమహాముని వచ్చి నృపాలుచేత వా
> చనికనమస్కృతుల్ వడసి సంస్తుతితో వలచుట్టిదేవ! నిం
> గనుగొనినన్ బసాపదినకయ్యము నీరయిపోయెఁ గంటికిన్
> జనునెయిటుండ నీకు? దలచన్ వలదయ్య సుపర్ణుని త్తటిన్"
>
> (అష్ట -39)

> "ఈ తుట్టెపురుగు లేమగు
> నీతేజీవచ్చినపుడు నిఖిలేశ్వర! నీ
> వే తెలివి దెచ్చుకొమ్మని
> యాతడు దీవించి చనియె నధిపుడు నాత్మన్." (40)

"నీ తేజీ వచ్చినపుడు" అను పదములచే ఇచ్చటకూడ నారదుడు శ్రీరాముని విష్ణ్వంశ సంభూతునిగ భావించినట్లే తెలియుచున్నది. మూలమున లేని నారదాగమనము, భాస్కరరామాయణము నందును, రామాభ్యుదయమునందును ఒకే సన్నివేశమున నుండుట కేవల కాకతాళీయమని కొట్టివేయలేము కదా!

## 8. గరుత్మంతుడు శ్రీరాముని బంటు ననుట

వాల్మీకీయము యుద్ధకాండము 50 వ సర్గమున శ్రీరామ లక్ష్మణులు నాగపాశ బద్ధులై యున్నప్పుడు గరుడుడు వచ్చి వారి నాగపాశములను వీడగొట్టును. అప్పుడు శ్రీరాముడు గరుత్మం తుని తన తండ్రి దశరథునితో సమానుడుగా కీర్తించును. దానికి సమాధానముగా గరుడుడు—

"అహం సఖా తే కాకుత్స్థ! ప్రియః ప్రాణో బహిశ్చరః ।
గరుత్మా నిహ సంప్రాప్తో యువాభ్యాం సాహ్యకారణాత్ ॥" (46)
సభాగ్యశ్చాసి ధర్మజ్ఞ! రామ! సత్యపరాక్రమ!
లక్ష్మణేన సహ భ్రాత్రా సమరే రిపు ఘాతినా ॥ (50)
ఇమం శ్రుత్వాతు వృత్తాంతం త్వరమాణోఽహ మాగతః ।
సహసా యువయో స్నేహాత్సఖిత్వ మనుపాలయన్ ॥ (51)

అని తాను శ్రీరామునకు సఖుడైనట్లును, వారికి సహాయ్యము చేసి తన సఖ్యత్వమును నిలుపుకొనుటకై వచ్చినట్లును చెప్పి యున్నాడు. విష్ణువునకు గరుడుడు వాహనమే. వారిరువురకు స్వామి భృత్యన్యాయము వర్తింపవచ్చును. కాని శ్రీరాముడు మానవుడే. ఇచ్చట గరుడుడు అతనికి భృత్యుడు కాడు. పైగా ఈ కాండముననే కడపట బ్రహ్మాదులు శ్రీరాముని భగవంతు డుగా కీర్తించినపుడు శ్రీరాముడు వారితో—

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"
అని తాను కేవలము మానవుడైనట్లు మాత్రమే చెప్పుకొన్నాడు.
ఈ ఘట్టమే భాస్కరరామాయణమున నున్న విధము చూడుడు-

"భూవల్లభ డిట్లనుమను,
నీ వీ యాపదను బాపి నేర్పార సుహృ
ద్భావం బిటు గావించితి,
కావున దశరథుని రఘువుగా నినుదలతున్" (యుద్ధ-631)

"నావుడు వైనతేయుడు మ
నంబున సంతసమంది దేవ! యే
దేవర బంట రావణు వ
ధించెదు నీవు సమస్త దేవ భూ
దేవ హితార్థ మిట్లరుగు
దెంచితిగాన జయం బవశ్యముం
గావుతమంచు నెయ్యు మెస
గం దగ వీడ్కొని యేగెనయ్యెడన్" (యుద్ధ-632)

ఇక రామాభ్యుదయమున నీ ఘట్ట మనువదింపబడిన తీరు పరిశీలింపుడు.

"అంత నాగాంతకుం డరుదెంచి గరుదంచ
లామృత శీకరవ్యాప్తి వెనుప
మునుపాజిభూమి జచ్చిన వానరులు లేచి
వచ్చిరి, చానున్న వారు బ్రతికి
రినవంశ మణితమ్ముడును దాను బడలికల్
దేఱి కూర్చుండిరి తిమ్మ బడి యె
బలమెల్ల తల్లడంబులు మానియావేళ

భువనంబులకు మహోత్సవంబు దోఁచె
పతి యతని బిల్చిరమ్ము సుపర్ణ! నీవు
దశరథుని మాఱు మాయాపదలు దలంగె
నీవలననన్న దేవ! నే నీకు బంట
నంతవలపని సేవించి యరిగె నతఁడు'' (అష్టమ-44)

''నేను నీకు బంటును'' అని గరుడుడు శ్రీరామునితో చెప్పాట మూలమున లేదు. భాస్కరరామాయణమున, రామాభ్యుదయమున నిది సమానము.

ఇవన్నియు పరిశీలించినపుడు రామభద్రయ్య తాను రామాభ్యుదయము రచించు కాలమున అడుగడుగునను భాస్కర రామాయణము నొరవడిగ బెట్టుకొని యుండెనేమో యని అనిపించును.

# 13

## అష్టాదశ వర్ణనలు



ప్రాచీనాలంకార శాస్త్రములలో మహా కావ్యములకు లక్షణములు కొన్ని పేర్కొనబడినవి. వానిలో కొన్ని విషయములు కావ్యమునందు విధిగా వర్ణనీయములు కావలెనని నిర్దేశింపబడినవి. సాహిత్య దర్పణమున విశ్వనాథ కవిరాజు—

1 2 3 4 5 6 7
"సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోష ధ్వాంత వాసరాః
8 9 10 11 12 13 14
ప్రాత ర్మధ్యాహ్న మృగయా శైల ర్తు వన సాగరాః
15 16 17 18 19 20
సంభోగ విప్రలంభౌ చ ముని స్వర్గ పురా ధ్వరాః
21 22 23 24 25
రణ ప్రయాణో పయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహా"

(6 వ పరిచ్ఛేదము - 322 323, 324 శ్లో)

అను శ్లోకములందు సర్గబంధాత్మకమగు మహా కావ్యమున ఇరువది యైదు వర్ణనాంశములను పేర్కొని, వానిని సాంగోపాంగముగా ప్రకరణోచితముగా వివరింపవలెనని చెప్పుచు కడపట "ఆదయః" అను శబ్దముచే వానికి ఇంకను కొన్ని చేర్పవచ్చును, లేక వానితో కొన్నింటిని వదల వచ్చును" అను విషయమును ధ్వనింపజేసెను. అట్లే "యథాయోగం" అను శబ్దముచే సందర్భ

శుద్ధి లేకుండ, తెచ్చిపెట్టుకొన్నట్లు కృతకముగా నా వర్ణనము లుండరాదనియు సూచించెను. అవి యథా సంభవములుగా సక్తములు కావలెనని యర్థము కావ్యాదర్శమున దండి—

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయవర్ణనైః
ఉద్యానసలిల క్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయై రపి
అలంకృత మసంక్షిప్తం (ప్రథమపరిచ్ఛేదం - 16, 17)"

అని మహాకావ్యము ఈ పై వర్ణనలచే అలంకరింపబడవలెననియు, అది 'అసంక్షిప్తం' అనగా అతి సంగ్రహము కాకుండ సాహిత్య దర్పణమున చెప్పబడినట్లు 'సాంగోపాంగముగా' విపులార్థ బోధకముగా నుండవలెననియు నర్థము. సంక్షిప్తమునకు ఉదాహరణముగా శ్రీకృష్ణుని జీవితచరిత్రమును—

"వసుదేవాత్సముత్పద్యపూతనాం విని పాత్యచ
కంసం హత్వాద్వారకా యాముషిత్వాసర్గతో హరిః"

అని వర్ణించిన అది సాంగోపాంగముకాని, అసంక్షిప్తముకాని, కాదుకదా! సాహిత్య దర్పణమున ఇరువది యైదు వర్ణనీయాంశములను, కావ్యాదర్శమున పదునెనిమిదింటిని పేర్కొన్నను 'పదునెనిమిదింటిని' అని వాచ్యముగా నెచ్చటను పరిమితి యేర్పఱుపలేదు. ఇక ప్రతాపరుద్ర యశోభూషణకారుడీ వర్ణనములను కావ్యాదర్శమునుండియే గైకొన్నట్లు ఈ క్రింది గ్రంథభాగము తెలుపుచున్నది.

"అథమహాకావ్యాదయః ప్రబంధాఃనిరూప్యంతే
నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్

ఉద్యానసలిల క్రీడా మధుపాన రతోత్సవాః
విప్ర లంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
మంత్ర ద్యూత ప్రయణాజినాయకాభ్యుదయా అపి
... ... ... ... ...
ఏషామష్టాదశానాం స్యైః కైశ్చిదూన మపీష్యతే''
(ప్రతాపరుద్ర .... కావ్యప్రకరణ, 68, 69, 70)

ఇచ్చట కావ్యాదర్శము నందలి 'దూత' శబ్దమునకు బదులు 'ద్యూత' శబ్ద మున్నది. వర్ణనీయముల సంఖ్య పదునెనిమిది అని 'అష్టాదశ' శబ్దముచే సూచింప బడినదికూడ ఇచ్చటనే.

ఈ ప్రతాపరుద్ర యశోభూషణమును 'నరసభూపాలీయము' అను పేర తెలుగులోని కనువదించిన భట్టుమూర్తి (రామరాజభూషణుని) పద్య మీ క్రిందిది.

"పుర, సింధు, నగర్త్వేన శశి
సరసీవన, మధురతి ప్రసంగ విరహముల్
పరిణయ తన యోదయనయ
విరచన యాత్రాజి, దౌత్య, విభువర్ణనముల్" (2-166)

ఇచ్చట ప్రతాపరుద్రీయమునందలి 'ద్యూత' శబ్దమునకు బదులు కావ్యాదర్శము నందలి 'దూత' (దౌత్య) శబ్దమే గ్రైకొనబడినది. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు తన 'కావ్యాలంకార సంగ్రహ' వ్యాఖ్యానములో 'ఇదియే సరియైనది' అన్నారు. 'ఇది' శబ్దము సన్నిహితార్థ బోధకము కాన అర్వాచీన మయిన కావ్యాలంకార సంగ్రహములోని పాఠమే సరియైనదని యర్థము.

"ఇందు నొక కొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్య మనగబరగు" (2-167

ఇదియు ప్రతాపరుద్రీయమునందలి "ద్వైః కైశ్చి దూన మపేష్యతే" అను దానికి అనువాదమే. ప్రతాపరుద్రీయముననే మొదటిసారిగా మహాకావ్యమును 'ప్రబంధ' మని పేర్కొనుట జరిగినది.

ఈ పై చర్చవలన తేలినదేమనగా సంస్కృతమున ఈ విధమైన ప్రక్రియ తెలుగున ప్రబంధ మనబడుచున్న దనియు, ఆ ప్రబంధమున పైని పేర్కొనబడిన, అష్టాదశ వర్ణనీయ విష యము లుండవలెననియు పిండితార్థము.

రామాభ్యుదయమున మన రామభద్రయ్య పైన పేర్కొన్న అష్టాదశ వర్ణనములను నిబంధించి యున్నాడు. ఇవియేకాక సాహిత్యదర్పణమున చెప్పిన (10) మృగయా వర్ణనము (17) ముని (అగస్త్య) వర్ణనము (20) యజ్ఞ (పుత్రకామేష్టి) వర్ణ నము వంటివికూడ మఱికొన్ని యున్నను నేను కావ్యాదర్శము నందు చెప్పబడిన పదునెనిమిదింటిని రామాభ్యుదయమునుండి పేర్కొని వివరింతును. ఈ వర్ణనముల క్రమము మాత్రము రామాభ్యుదయమున నున్నట్లుకాక. నరసభూపాలీయమున చెప్ప బడిన క్రమముననే వివరింతును. ఒక్కొక్క వర్ణనము నందును కొన్ని వర్ణనీయాంశములను కేశవమిశ్రుని "అలంకార శేఖరము" నుండి గైకొంటిని. కాని రామాభ్యుదయమునందలి అన్ని వర్ణన ములు వానితో సంప్రదింపక పోవచ్చును. అవి ప్రాచీనములగు కావ్యముల కుద్దేశించినవి. తెలుగు ప్రబంధముల పోకడ వేరుగా కన్పింపవచ్చును. వీనిలో శ్లేషోత్ప్రేక్షాద్యలంకారములకు ప్రాధాన్య మీయబడినట్లు గుర్తింపవచ్చును.

## 1. పుర వర్ణనము

"పురేట్టపరిఖా వప్ర ప్రతోలీ తోరణధ్వజాః
ప్రాసాదాధ్వప్రపారామావాపీవేశ్యాసతీ (నదీ) త్వరీ

(కేశవమిశ్రుని అలంకార శేఖరము - 16 వ మరీచి)
రామాభ్యుదయమున పురవర్ణనము రెండుచోట్ల చేయబడినది.

1. అయోధ్యానగర వర్ణనము (ప్రథమ 1-36 పద్య)
2. లంకానగర వర్ణనము (షష్ఠాశ్వాసము 103-104 పద్య)

ప్రబంధ కవు లందరివలెనే రామభద్రయ్యకూడ నగరమందలి మేడ (ప్రాసాదము) లను, పంటలను, తోట (ఆరామము) లను, బ్రాహ్మణ క్షత్రియులను, వెలయాండ్రను, జారస్త్రీలను, పుష్పలావికలను, అతివేలముగా వర్ణించి యున్నాడు. వర్ణనము లందు రామభద్రయ్య నిరూపించుకొన్న ప్రత్యేకతకు ఈ క్రింది పద్యములు ఉదాహరణములు:—

"నెలతాతిచాలు నిగ్గులలోని మిన్నేటి
రాయంచగముల నార్భటుల వలన
హీరకాంతులలోని యింద్ర కరీంద్రంబు
ప్రకట దానాంబు సౌరభమువలన
పచ్చని డాలు లోపలి ప్రొద్దు బాబాల
రత్న కింకణుల యారవము వలన
ముత్యాల ముగ్గులో మొనయు సప్తర్షుల
తమ యంగసంగ సౌఖ్యములవలన
నమరు లాధోరణుడు, సూతు, డల్ల తపసి
యింతులను నేర్పుమై నేర్పింతురన్న

నన్నగరినున్న మేడల యున్నతత్వ
మచట మణులున్న తత్త్వంబు నడుగడేల (1—7)

ఆకాశము నంటు మేడ (ప్రాసాదము)లు, అందున్న వివిధ రత్న రాజి, ఈ పద్యమునందు వర్ణింపబడినవి. తెల్లని ఆకాశగంగ చలువ రాతితో కట్టబడి అంత యెత్తుకు వ్యాపించిన మేడల నడుమ గుర్తింపరాకుండెనట. అట్లే ఇంద్రుని ఐరావతము మేడల హీర కాంతులతో కలసిపోయెననియు, సూర్య రథమునకు కట్టిన వాజులు (పచ్చనివి) మేడల పచ్చల కాంతులలో గలసిపోయె ననియు, చుక్కలవంటి సప్తర్షులు ముగ్గుచుక్కలలో గలసిపోయి రనియు, మనోజ్ఞముగా చమత్కరించినాడు. అట్లే వేశ్యల వర్ణనమున—

"అరయ రాజానుగ్రహము గల్గుగా కేమి
కలువల దళముల గెలువనోపు
మిత్ర బలంబున నమ్మిక గల్గుగా కేమి
తమ్మి తావు లెదిర్చి క్రమ్మనోపు
ఘనపరిగ్రహ సమగ్రత గల్గుగా కేమి
యల కలాపి కలాపు లడపనోపు
తనవారి ప్రాపుదాపును గల్గుగా కేమి
యంచలగతి మాన్చి మించనోపు
అక్షి, ముఖగంధ, కచబంధ, యానవిభవ
గరిమ లౌరౌర! యని విటాగ్రణులు సారె
పొగడ పొగడొందు నెందు నప్పురమునందు
అంగజుని దండు నా వెలయాండ్రపిండు. (1—22)

ఇందు శ్లేష, క్రమాలంకారములు పొందుపరుపబడినవి.

సమాసము వేశ్యాపరము

రాజానుగ్రహము - రాజుగారిప్రాపు - చంద్రుని అభిమానము

(కలువలు)

మిత్రబలము - మిత్రుల సహాయము - సూర్యునిశక్తి (తమ్మి)

ఘనపరిగ్రహము - పెద్దల అభిమానము - మేఘములవ్యాప్తి

(కలాపము)

తనవారి ప్రాపుదాపు - కులమువారి సహాయము - నీటికిదగ్గరగుట

(అంచలు)

అట్లే లంకా నగరమును స్త్రీగా వర్ణించు టెంత మనోహరమో చూడుడు—

"అగరు ధూపపు పొగల్ పొగరారు కురులుగా
నవగవాక్షము లీక్షణములుగాఁగ
చికిలి విటంకముల్ చెక్కుటద్దములుగా
నగరిహజారంబు మొగముగాఁగ
అతుల వీథిక లలంకృత భుజాలతలుగా
ప్రమదశైలము లురోజములు గాఁగ
దృశ్య శృంగాటక దీర్ఘిక నాభిగా
పృథువప్ర చక్రంబు పిఱుదుగాఁగ
పికశుకీకేకి మధుకర ప్రకరముఖర
వనవలయరేఖ బెళబెళ వలువగాఁగ
రావణుని చెట్టవట్టిన రాజ్యలక్ష్మి
కైపు దోపించు లంక పొంకంబు గాంచి (VI—103)

లంక : పొంకమును రామభద్రయ్య రావణుని రాజ్యలక్ష్మి (స్త్రీ) తో పోల్చియున్నాడు. ఇందు చమత్కృతి యెక్కువే కాని అర్థము సులభము.

## 2. సముద్ర వర్ణనము

"అబ్ధా ద్వీపాద్రిరత్నోర్మి పోతయాదోజ(ల)గత్నవాః
విష్ణు కుల్యాగమశ్చంద్రా ద్వృద్ధిదారోబ్జ పూరణమ్॥
(16 వ మరీచి)

రామాభ్యుదయమున సముద్ర వర్ణనము రెండుచోట్ల గలదు.

1. క్షీరసాగర వర్ణనము - తృతీయాశ్వాసము - 34-41 పద్య
2. దక్షిణసముద్రవర్ణనము-సప్తమాశ్వాసము, 38, 103, 111పద్య

అలంకార శాస్త్రములలో వర్ణనీయ విషయములకు కొన్ని పరిమితులు కల్పింపబడినవి. అవి యెక్కువగా ప్రకృతికి (Nature) అనుగుణమైనవి. కాని ప్రబంధములలో ఆ పరిమితులు దాటి ఎక్కువ స్వేచ్ఛ అవలంబింప బడినది. రసికులైన ప్రబంధకవులు వానిని మానవ ప్రకృతికి, వారి అభిరుచులకు అనుగుణముగా శ్లేష, ఉత్ప్రేక్షాద్యలంకారములు చేర్చి వర్ణించుట జరిగినది. ఉదాహరణమునకు వాల్మీకి, వ్యాసాదుల రచనల యందును, ప్రకృతి పరిశీలకుల వర్ణనము లందును సముద్రవర్ణనము పైని పేర్కొన్న ద్వీపాద్రిరత్నోర్మి ..." మున్నగు విషయములకు కట్టువడి ఆ పరిమితులలోనే యుండును. కాని ప్రబంధ కవుల వర్ణనము లట్లు కాదు. రామభద్రయ్య తన రామాభ్యుదయమునందే ఆ భేదము మనము గుర్తింప గలము. ఈ విధమే అన్ని వర్ణనము లందును వర్తించును. క్షీరసాగరమును వర్ణించు పట్టున—

"బంగారు మగువ మగడీ
యంగజగురు డల్లు డట కృతార్థంబై యొ
ప్పంగద నీ జీవనమో
గంగాముఖ నిఖిల నిమ్నగా గృహమేధీ!" (III—39)

"అల్లుడు నీకాహారినీ
వల్లుడవై తతనికిం దదంఘ్రి కుమారీ
వల్లభుడ వైతి చిత్రము
కల్లోలవతీ కళత్ర! కల్మష మైత్రా!" (III—41)

శ్రీరామలక్ష్మణులు దక్షిణ సముద్రతీరమును చేరినప్పుడు వారికి దర్శన మిచ్చిన సముద్రుడు రామభద్రయ్యచే గంధగజముతో పోల్పబడినాడు చూడుడు—

"పరితః ప్రకీర్ణమై పఱచినట్లున్న శై
వాలజాలము నీలిజాలుగాఁగ
ప్రబలి పైఁ బ్రాకిన పవడంపులత లింపు
దగవైచిన పసిండి త్రాళ్లుగాఁగ
బ్రహ్మాండ పాటనోద్భటములై మినుముట్టు
ఘోరఘోషములు ఘీంకారములుగ
వేలాగహన పక్షి కోలాహలము లెల్ల
నారి గట్టిన పౌజు నదలుపులుగ
నెగసి వ్రాలెడు జలజంతు లెక్కనెక్క
కూల విసరిన పడు మావటీలు గాఁగ
ఊర్మి రేఖాకరంబు బిట్టూచికొనుచు
గంధగజలీల గ్రాలు సాగరము గాంచి" (VII—38)

మఱియు మిక్కిలి చమత్కారముతో కూడిన యీ క్రింది పద్యము చూడుడు—

"అక్కటా! తన యింటి కభ్యాగతుండైన
వృషభవాహనునకు విషముపెట్టె,
మేఱమీఱని యట్ల మెలగి నమ్మించి యి
వ్విశ్వమంతయు మ్రింగె విలయవేళ

కడుపు గంది నయట్టి కొడుకు నొక్కని గాంచి
పాంథుల జంపంగ పాలువెట్టె
ప్రత్యక్ష మిపుడు నాపగలకు లోనిచ్చి
తెరువాగి వాకిలి తేలవడయ్యె
ద్రోహి యను మాత్రమే వీని త్రుళ్ళడంతు
విల్లు చేతెమ్ము లక్ష్మణ! విశిఖముఖ భ
యారసాతల వలమాన భూరిగిరుల
వలన తిరుగుడు మడుగు కావలయు చూడు" (VII—103)

ఇందులో మన పురాణ గాథలు, సంప్రదాయములు, కవి సమయములు, ఎన్నియో చోటుచేసికొన్నవి.

## 3. పర్వత వర్ణనలు

"శైలే మహౌషధీ ధాతువంశ కిన్నర నిర్ఝరాః
శృంగపాద (భృగుపాత) గుహారత్న వనజీవాద్యుపత్యకాః
(16-వ మరీచి)

రామాభ్యుదయమున దండకారణ్యాదుల వర్ణనము చెప్పుకోదగినంత గొప్పగా లేదు. సువేలగిరిని మాత్రము కొంచెముగా వర్ణించియున్నాడు. అచ్చటకూడ పర్వత వర్ణనముకంటె అందు రావణుడు చెరబెట్టిన స్త్రీల విషయము, రావణుని విహారస్థలముల వివరణము మాత్రమే బాగుగ కలదు. కేవలము పర్వతవర్ణనమునకే పరిమితములైన రెండు పద్యములను మాత్ర ముదహరించుతును. హనుమంతుడు శ్రీరామునితో చెప్పు సందర్భములోని దీ పద్యము—

"రావణు నంగరక్ష యను
రప్రభు నాపదకైన విందు లం

కావిభు జీవగఱ్ఱి దశ
కంతుని పెన్నిధులున్న టెంకి ర
ఙ్గోవరు రాజ్యలక్ష్మి మను
చోటు సురాంతకు భాగ్యరత్నపుం
గోవ యనం దనర్చిన త్రి
కూటము సుమ్మిది లక్ష్మణాగ్రజా! (VII—140)

''హరి దంతద్విర దేంద్ర దంతహతిచా
యల్ చూపనీ యద్రి గ
హ్వార మార్గంబులు సొచ్చి కొంతచనియ
య్యర్కాంశు పంక్తుల్ తదం
తరగాఢాంధతమంబు పాయు వగగా
నంలేక వీగున్ సుదు
స్తర వృత్తిన్ బహిరంధకార మెయడం
చం జాలి వీక్షించితే'' (VII—149)

అర్థము సులభము.

## 4. ఋతు వర్ణనము

రామాభ్యుదయమున నాలుగు ఋతువుల వర్ణనము మాత్రమే లభించుచున్నది. వసంతఋతు వర్ణనము మాత్రము మూలరామాయణమున ఈ సందర్భమున లేదు. తక్కిన వర్షర్తు, శరదృతు, హేమంత ర్తు వర్ణనములు మాత్రము మూలమున గూడ రామాభ్యుదయమున వర్ణింపబడిన పట్టులందే యున్నవి. వసంత ఋతు వర్ణన దశరథుని వనవిహారాదుల కుద్దీపకముగ వర్ణింపబడినది. ఈ వనవిహార ప్రసక్తి మూలమున లేదు. రామాభ్యుదయమున ఋతు వర్ణనముగల చోట్లు—

1. వసంతఋతువర్ణనము-ప్రథమాశ్వాసము - 44-56 పద్యములు
2. హేమంతర్తువర్ణనము పంచమాశ్వాసము-125-129 పద్యములు
3. వర్షర్తువర్ణనము - షష్ఠాశ్వాసము - 3 - 18 పద్యములు
4. శరదృతు వర్ణనము - షష్ఠాశ్వాసము 33 - 37 పద్యములు

(a) వసంతర్తువు

"సురభౌ దోలాకోకిల (దక్షిణవాతద్రుపల్లవో) మారుత
సూర్యగతి తరుదళో ద్భేదః
జాతీతరపుష్పచయామ్రదుమంజరీభ్రమర ఝుంకారా॥ ॥
(16 వ మరీచి)

ఇచ్చట రామభద్రయ్య తన చాతుర్యము నంతటిని జూపి యున్నాడు. గ్రంథ విస్తర భీతిచే సామాన్యమైన పద్యములను వదలి విశేషార్థములు గల పద్యములను రెండు మూడింటిని మాత్ర ముదాహరింతును. చూడుడు—

"అలరె వనీవధూటి మధు
డ౯ పతిచేరి తుషార బాష్పధా
ర లుడిపి పద్మరాగ హరి
రత్న విభూషణముల్ ధరించు బా
గొలయగ పల్లవాళికుల
యోగమునం గడునుల్లసిల్లు ను
త్కళికల మించె హర్ష పుల
కంబులు దాల్చిన భాతి నంతటన్" (1-49)

ప్రకృతి సిద్ధముగనే వనమునం దోచు లక్షణములను వానిని నాయికగను, వసంతుని నాయకుడుగను వర్ణించుటచే స్త్రీత్వ వివక్షచే వనమునం దోచినట్లు ఉత్ప్రేక్షించినాడు.

"భూరి కాంతార కేదారముల్ సమకట్టి
కోడెగాడ్పుల జంట కూడ గట్టి
పెలుచ కారాకు బెల్లులు పెల్లగిల దున్ని
తలిరాకుడాలు నీ రలపరించి
కలికాంకురంబుల మొలకనారులు నాటి
వెలిగ జాదుల సొంపు కలుపు తిగిచి
కాపుగా సుకుమార కలకంఠి నియమించి
యాయా తరులం బ్రోదిసేయ నేర్చి
నమ్మిక వసంతుడను పేరి కమ్మతీడు
నెఱయ నెల్లెడ వలరాజ కఱవుదీఱ
నార! యామని వచ్చె నాహా యటంచు
జగము తనియంగ పుష్పమంజరులు పండె" (I–51)

ఈ పద్యమున కృషీవలుల నిత్యకృత్యములను - వసంతుడను కృషీవలుడు ప్రకృతి క్షేత్రములో - పుష్పమంజరులు పండించి నట్లును ఉత్ప్రేక్షించి యున్నాడు.

"తలప నుదాహరణాకృతి
కళికల రంజిల్లి సరస కవి కావ్యమునుం
బలె నెడల మత్తకోకిల
కలనన్ మధువేళ వన నికాయం బమరెన్" (I–53)

ఇచ్చట వననికాయము కళికల (మొగ్గల)తో కూడి 'ఉదాహరణ కావ్య'ము వలె నున్నదట. మంచి యుపమానము.

(b) హేమంత ఋతువు

"హేమంతే దినలఘుతామరుబకయవవృద్ధి శీత సంపత్తిః"
(16 వ మరీచి)

రామభద్రయ్య హేమంత ఋతు వర్ణనమును మిక్కిలి సంక్షేప ముగా జేసియున్నాడు. వాల్మీకమున ఆరణ్యకాండము 16-వ సర్గ మంతయు హేమంత వర్ణనముతోడనే సరిపోయినది. రామాభ్యు దయము నందలి దీ వర్ణన—

"మరువక గంధిలంబులును
మందర విద్యుత్తులుం దుషారధూ
సరములు సర్వవాంఛిత హ
సంతికముల్ సముదగ్ర సౌరభా
గరు పరిలిప్త భోగి యువ
కంఠతలంబులునై తలిర్చె వా
సరములు దంతసత్కృతి వ
శంవదముల్ తుహినాగమంబునన్" (V—125)

## (c) వర్షర్తు వర్ణనము

"వర్షాసుఘనశిఖిస్మయహంసగమాః పంక కందళోద్భేదా
జాతీకదంబకేతక ఝంఝానిలనిమ్నగా హాలిప్రీతిః।
(16 వ మరీచి)

రామభద్రయ్య వర్షర్తు వర్ణనమును మిక్కిలి నేర్పుతో హృద యంగమముగా చేసియున్నాడు. అందరు ప్రబంధ కవులవలెనే సామాన్య వర్ణనలేకాక అపురూపములైన ఉపమాద్యలంకారము లతో శ్లేషలతో గూడిన పద్యములు పెక్కులున్నవి. వానిలో మూడింటిని మాత్ర ముదాహరింతును.

సాగర విషంబు గ్రోలి ధూర్జటియు బోలె,
నా త్రివిక్రమగతి దివి నాక్రమించి

విధియుబలె నాదిసృష్టి గావించి కాఱు
మొగులు దలపించెనపుడు త్రిమూర్తి మహిమ''  (VI—8)

విషమనగా విషము, నీరుకూడ, రెండవ పాదమున బలి నిగ్రహ గాథ ఆదిసృష్టి = జలము (ఆపోవై ప్రథమాస్సృష్టః) అని పంచ భూతములలో నీరు మొదట సృష్టింప బడినదట. మేఘము త్రిమూర్తులతో పోల్పబడినది.

''ధారాశుద్ధి ప్రసిద్ధిగాంచి ఘన శ
బ్ద స్ఫూర్తి వర్తిల్లగా
తోరంబైన రసస్థితిన్ తరళ వి
ద్యున్మాలికా లక్షణో
దారంబై కవిసేవ్యమై వనమయూ
రామాధి బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధ మట్లఖిల ప
ద్యాక్రాంత మయ్యెం దగన్''  (VI—13)

ఇచ్చట తొలకరి (వర్షారంభము) ప్రబంధముతో పోల్చబడినది. ధారాశుద్ధి, ఘనశబ్దస్ఫూర్తి, రసస్థితి, తరళ విద్యున్మాలికా, కవి సేవ్యము, వనమయూరారూఢి అఖిల పద్యాక్రాంతము - ఇందలి శ్లేషలు గమనింపతగినవి. పద్యా = బాటలు, తక్కినవి తెలిసినవే. తరళ, విద్యున్మాలికా, వనమయూరములు. గ్రంథములోని వృత్తభేదములు.

''హరిహయాయుధ రేఖలను గడల్ వేయించి
అలముధారా రజ్జువుల బిగించి
జలదంబులను నీలివల లెల్లెడల నిల్పి
వివిధ గర్జా వాద్య రవము గొల్పి

తేవమీఱు తటిన్నటీ పంక్తి బ్రేరించి
కోపుగా మెఱుములు గొనగ జేసి
సరసులకొక సొంపు సంధిల్ల గావించి
పెక్కు దిక్కుల వారి పెంపుజేసి

యలరె తొలకరి తఱిపేరి యాటకాడు
మీటు వాటిల్ల వలరాచ మెచ్చు వడసి
పథిక జన మానధనము లపారలీల
కొల్లలాడెను భవనంబు లుల్లసిల్ల'' (VI—18)

ఇచ్చట తొలకరి తరి (వర్షారంభ సమయము) అను దొమ్మరివాని యాట, వాని పరికరములు ప్రకృతినుండి సంతరించుకొని మిక్కిలి మనోహరముగ వర్ణించియున్నాడు.

## (d) శరదృతు వర్ణనము

''శరదీందురవి పటుత్వం జలాచ్ఛతాగ_స్త్యహంసవృషదర్పాః
స_త్తచ్ఛ పద్మసితా భ్రధాన్య శిఖిపక్ష మదపాతాః''

(16 మరీచి)

రామాభ్యుదయ మందలి శరదృతు వర్ణనమున నెట్టి విశేషమును లేదు. కార్యత్వరతో పరుగిడు వానివలె నాలుగైదు చిన్న పద్య ములలో సామాన్య రీతిలో శరదాగమము వర్ణింపబడినది.

## ౫. సూర్యోదయా సమయములు

''సూర్యేఽరుణ తార విమణి చక్రాంబుజ పథికలోచన ప్రీతిః
తారేందు దీపకౌషధి ఘూకతమశ్చోర చంద్ర కులటార్తిః''

(16 మరీచి)

అలంకార శాస్త్రములలో సూర్య చంద్రుల ఉదయ వర్ణన

మాత్రమే చెప్పబడినది. కాని కావ్యాదర్శ వృత్తిలో "అత్ర ఉదయే నాస్తమయ మపి బోధ్యతే ఉపలక్షణ విధయా, తథా చంద్ర సూర్యయోరు దయాస్తమయ వర్ణనం ఫలితమ్" – అని యుండుటచే సూర్య చంద్రుల ఉదయాస్తమయములు రెండును వర్ణనీయములే. ఒకప్పుడు అస్తమయ వర్ణనము లేక పోవచ్చును. సూర్యోదయమున కుదాహరణముగా రామాభ్యుదయములోని యీ పద్యము చూడుడు.

"కని ప్రాచిగోడ్డు పీగంగ రత్నమువంటి
పుత్ర సంతానంబు పుట్టెననగ
బలభేది యర్చింప బ్రహ్మదేవుని వంటి
యతిథి యభ్యాగతుం డయ్యెననగ
నుదయాద్రి తలమీద నుంచుకో మేరువు
వంటి చుట్టము చేరవచ్చె ననగ
మందేహ జయలక్ష్మి మనువొంద బంగారు
కుండవంటి వరుండు కూడెననగ
కోమలారుణ కిరణముల్ కుదురుకొనుట
సులభమై యెల్లరకు దేటిచూడవచ్చు
ననగ సుకుమార మండలంబన తనర్చు
భువన నయనంబు లోకబాంధవుడు మించె" (II—106)

రామభద్రయ్య సూర్యాస్తమయమునుగూడ మిక్కిలి చమత్కార ముగా వర్ణించియున్నాడు. చూడుడు–

"అగచర బాలు డాడినొక
డాకొని పైకొని యెంత చేసె? నీ
యగచరు లెందఱేని గల
రందఱునాకొని యున్నవారలే

తెగువకు జొత్తురో యనిక
దే చరమాచల శృంగ మెక్కియు
ప్పుగ సిటు చూడనే వెఱచి
పోయెననన్ రవి గ్రుంకె నవ్వలన్ (VII—41)

## 6. చంద్రోదయ వర్ణనము

"చంద్రోదేకులటా చక్రాంబురుహా విరహిత మోహానిరాజ్వల్యమ్
జలవిజ్ఞాని నేత్రకైరవ చకోర చంద్రాశ్మదంపతి ప్రీతిః"
(16-వ మరీచి)

రామాభ్యుదయమున చంద్రోదయ వర్ణనము రెండుచోట్ల కలదు. మొదటిసారి వేశ్యలు ఋష్య శృంగా నయనమునకై వెడలు ఘట్టమున. ఇచ్చట ఈ వర్ణనము యథాసంభవముగాక తెచ్చి పెట్టుకొన్నట్లు కృతకముగా నున్నది. ఏదే నొక ప్రయోజనము నుద్దేశించి యచట చంద్రోదయ ప్రసక్తి రాలేదు. ప్రొద్దు క్రుంకుట, చీకటి వ్యాపించుట, చంద్రోదయ మగుట వరుసగా వర్ణింపబడినవి. చూడుడు-

"చలువవెలుంగు రేమగడు
జక్కవ నెచ్చెలి జోడుకోడె చు
క్కల జవరాండ్రలో నను పు
కాడు జగంబుల చూడ్కి విందు చెం
గలువల కోరి దారి విలు
కానికి గూర్చిన మామ పండు వె
న్నెలగని చందమామ కడు
నింగి జెలంగి వెలింగె నెంతయున్" (II—95)

హనుమంతుడు రావణాంతః పురాదులలో సీతాదేవిని వెదకి విసిగి కడకు అశోకవనమునందు చేరియున్నాడు అక్కడకూడ ఆమెను వెదుకవలెనన్న వెన్నెల అవసరము. కావున రామభద్రయ్య చంద్రోదయమును వర్ణించిన రెండవచోటు ఇది. ఇది ప్రసక్తమే. చూడుడు-

"కుముద వనంబు కోరిక చ
కోరిక పండుగ భోగిభాగ ధే
యము ననవిల్తు శాక కడి
యాలము చీకటి ముట్టుకోల్పు పు
న్నమ కొకవన్నె చేకుఱనో
నర్చిన యొప్పులకుప్ప యామినీ
రమణుడు దోచెనోయన క
రంబులు సాచి దిశాముఖంబులన్" (VI—124)

## 7. సరఃక్రీడా వర్ణనము

"జలకేళీ సరః క్షోభ చక్రహంసాప సర్పణమ్
పద్మగ్లానిః పయక్షేపో దృగ్రాగో భూషణచ్యుతిః"
(16-వ మరీచి)

సరస్సు జలాశయము కాన సరః క్రీడ యన జలక్రీడ యనియే యర్థము, జలమున కాధారము సరస్సే కాన రామభద్రయ్య మొదట ఒక నెత్తమ్మికొలను నిట్లు వర్ణించియున్నాడు—

"మలయానిలోత్తాల కలహంస పక్ష వి
క్షేపముల్ చామరశ్రీలుగాగ
నీరశీకరసిక్త నిర్మల నీరేజ
పత్రముల్ ముక్తాతపత్రములుగ

భృంగీ పరంపరా భంగురారావంబు
బహుల గాత్ర సంగీత భంగిగాఁగ
సికట వనీజాత శుక పికాలాపముల్
కంచుకి హీంక్రియా కలనగాఁగ
సతత భువనైక నుత రాజస ప్రశస్తి
చెలఁగ కొలువున్న నెత్తమ్మి కొలకులచ్చి
చేరి రిచ్చదలిర్ప నచ్చెలులు పోలె
నబ్జలోచన లామోద మతిశయిల్ల" (I—86)

రామభద్రయ్య జేసిన స్త్రీల జలక్రీడా వర్ణనములో క్రొత్త యేమియు కానరాదు. అందరు ప్రబంధ కవుల వలెనే చేసి యున్నాడు. ఉదాహరణమునకు రెండు పద్యములు చూడుడు—

"కూడిరి యొండొరుల్ దొరసి
కుంతల కాంతు లొసంగి పీడు జో
డాడిరి క్రేళ్ళు దాటుడు మ
డాళులతో తెలిదమ్మి ధూళిగో
రాడిరి కంతుదంతులన
హస్తపుటంబుల వారి చల్లు పో
రాడిరి యోలలాడిరి ల
తాంగులు రాగ రసైకమగ్నలై" (I—89)
"కోమలి యోర్తు వేఱొక తె
గుబ్బ చనుంగవ మిట్టలందు కే
ల్దామర నా సరోవర జ
లంబులు చల్లతదంబు శీకర
స్తోమనిపాత మమ్మొగుద
ఛ్ఛూచి నిజోజ్జ్వల హారము క్తము

స్వామిని శంక నొందెదె నెమ
కందము కించు సఖీ మణుల్నగన్ (I—90)

## 8. వన (ఉద్యాన) విహార వర్ణనము

"ఉద్యానే సరణిః సర్వ ఫల పుష్ప లతా ద్రుమాః।
పికాళి కేకి హంసాద్యాః క్రీడా వాప్య ధ్వగస్థితిః" ॥
(16.వ మరీచి)

స్త్రీల ఉపవన విహారములో భాగములే పుష్పాపచయము, దోహద క్రియలు; ఈ రెండింటిని రామభద్రయ్య అతివేలముగా వర్ణించి యున్నాడు. ముందు డోలికా విహృతి—

"సలిపిరి డోలికా విహృతి
సాటికి బేటికి నింతులిద్దఱం
డులనొక కన్నె తన్నె నొక
తొయ్యలి యుయ్యెల తీగపగ్గము
న్వ్రాలదియు తన్నె నన్నెలత
వేనలి జూడక 'త్రాడుదన్ను వా
రల తలదన్నువార' లది
రామదిరాక్షి చెలంగి రత్తఱిన్" (I— 64)

రామాభ్యుదయమున పుష్పాపచయకేళి వర్ణింపబడినది. కాని అన్ని ప్రబంధములలోవలె ఇందు 'రగడ' లేదు. తక్కిన విషయములు గూడ చాల సంక్షేపముగా చెప్పబడినవి. ఉదాహరణమునకు—

"సుదతి! మొల్లలు దెచ్చి సూడిదెయిచ్చిన
పలు తెఱంగుల నవ్వపాడి యగునె

కొమ్మ! సంపగి మొగ్గ గొమ్మ రమ్మని పిల్చి
న్యాయంబె యిది నాకు నాసజూప?
పూబోడి! యిపుడు నా పూబంతులింక నీ
పాలింటి వనుచు డాపంగ తగునె
కమల మొక్కటి నేను కానుకగా నిచ్చిన
గనుసన్న గ్రేణింప జనునె సకియ!
యనుచు విభు మ్రోల మేలంబు లాడుకొనుచు
నంగ సౌందర్య సంసూచనాభిరామ
చాటువాచా చమత్క్రియా సరణిమీఱ
గిల్లి రప్పుడు సతులు రాగిల్లి విరులు" (I—71)

నాస యన ముక్కు. తక్కినవి సులభము. దోహద క్రియలను రామభద్రయ్య చాల పద్యములలో పెక్కు రీతుల వర్ణించి యున్నాడు. ఉదాహరణమున కొక్క పద్యము—

"వనితల్నవ్వగ కౌగిలింప కన ని
శ్వాసింప గానం బొన
ర్ప నదల్పం బలుక న్ముఖాసవము గా
ర్పందన్న నంటన్నన
ల్మొనపుం బొన్న కురంటకంబు తిలకం
బున్సిందువారంబు ప్రేం
కణమున్ సంపగి గోగు నున్వకుళమున్
గం కేళియు న్మావియున్" (I—73)

## 9. మధుపాన వర్ణనము

"సురాపానే వికలతా స్ఖలనం వచనే గతౌ
లజ్జా మానచ్యుతిః ప్రేమాధిక్యం రక్తేక్షణభ్రమాః"
(16-వ మరీచి)

సాధారణముగా ప్రబంధములలో పురుషులు మధుపాన వర్ణనము చేయుట తక్కువ ఉన్నను అది స్త్రీల సాన్నిధ్యమున జరిగినపుడే. రామాభ్యుదయమున మధుపాన ప్రశంసకు చోటులేకున్నను కవి కల్పించుకొన్నాడు. ఋష్యశృంగానయనమునకై వెడలిన వేశ్యలు ఆ ఋషి నివసించు నరణ్య ప్రాంతములకు పోయి విహరించుచు నచ్చట మధుపాన గోష్ఠి చేయుదురు అది మిక్కిలి సంక్షేపము గనే అనగా ఒక్క పద్యముననే చేయబడినది. చూడుడు—

"తెలినునుసోగ వెన్నెలల
 దేటికొనం దన నీడ చూచి మ
త్తిలి మధువాని చొక్కు సుద
 తీ మణి యొక్క తె నీవు నింత న
చ్చెలి చవిచూడవే యనిన
 చేకొనమిం గని యాసవమ్ముపై
చెలియరో! యాసవమ్మగుట
 చిత్రము నీకని పల్కె నల్కతోన్" (II—99)

## 10. రతి ప్రసంగ వర్ణనము

"సురతే సాత్త్వికాభావాః సీత్కారః కుట్మలాతితా
కాంచీకంకణ మంజీరవో ధ్రరనఖక్షతే"' (16-వ మరీచి)

రతి ప్రసంగమన సంభోగ శృంగారమనియే అర్థము. రామాభ్యుదయమున సంభోగ శృంగార వర్ణన మొక్క చోటనే కలదు. అదియు సీతారాముల ప్రథమ సమాగమ వర్ణనమున – (చతుర్థాశ్వాసము 152 – 177 పద్యములు) శ్రీ సీతారాముల పడకటింటి ముచ్చట్లు దివ్య దంపతుల నడుమ జరిగినదానివలె గాక కేవల ప్రాకృత జనుల రతివలె కవి వర్ణించి యున్నాడు. ఇందు కేవలము

ప్రబంధకవుల ననుకరించుటయే రామభద్రయ్య లక్ష్యముగా పెట్టు కొన్నట్లున్నది. మచ్చునకు కొన్ని పద్యములు—

"అని చతురోక్తి వేడుకొని
యల్లన నంకతలంబుసేర్చి పే
ర్చిన తమిచే వడంక నును
చెక్కిలు నొక్కి కవుంగిలించినన్
తనువున కంపమొంది తను
దానడలెన్ దృఢ నీవిబంధమో
చన మగుటద్భుతంబె రఘు
చంద్రుని ప్రోహిక యింత గల్గినన్" (IV—164)

"కచకుచాభోగ గండభాగంబు లంటి
యారునిక నొక్కటియును నీ వంటనీవు
లలన! మది నేడుగడగా దలంచునన్ను
నేలుకొనుమంచు వేడె సర్వేశవిభుడు" (IV—170)

"చేకొనె కక్ష్యసీమలు వి
చిత్ర గతిం కుచశైల దుర్గముల్
చేకొనె మధ్య దేశమును
జేకొనె నూరు యుగంబులోనుగా
పైకొనె బాహుశక్తి సతి
బల్మెఱు నాలమునం బెనంగి ర
త్నాకర మేఖలాస్థలము
నవ్విభు డంతయు జేకొనెందుడిన్" (IV—174)

## 11. విరహ వర్ణనము

"విరహే తాపనిశ్వాస చింతా మౌన కృశాంగతాః
అబ్జశయ్యా నిశాధైర్ఘ్యం జాగరశి శిరోస్మృతా"
(16-వ మరీచి)

పూర్వరాగము, మానము, ప్రవాసము, కరణము, అని విప్రలంభ శృంగారము నాలుగు విధములు. అందు శ్రీరాముని విరహము ప్రవాసమును భేదము. రామాభ్యుదయమున విరహము శ్రీరాముని విషయముననే ప్రసక్తమైనది. సీతా వివాసమువలన నది సంభవించినది. బలవంతముగా, తలవని తలంపుగా సీతాదేవితోడి వియోగము సంభవించినందున శ్రీరాముని విరహము మిక్కిలి శోచనీయమైనది. వాల్మీకమున నీ విరహము పెక్కు సందర్భములలో మిక్కిలిగా వర్ణింపబడినది. రామాభ్యుదయమున రామభద్రయ్య కూడ శ్రీరాముని విరహమును సక్రమముగనే వర్ణించి యున్నాడు. ప్రబంధ వాసన సోకినట్లు, చంద్ర, మలయమారుతాద్యుపాలంభములతో కూడి వర్ణింపబడినది. ఉదాహరణ పద్యములు-

"ఏల ప్రేలెదు తేటి? ఇం తేటి కలుగ?
సంశ్రితల సన్నగాలి! యోసన్నగాలి!
చెల్లునే రోష రస మింత చిలుక! చిలుక!
సారె కుందింప చందమా! చందమామ! (VI—25)

ఇందలి అనుప్రాసములను గమనింపుడు—

"పవనా! పరిచితనవ నీ
ప వనా! నా కీవు ప్రాణపద మాట దగం
ప వనారతమును నీ పెం
పవనారూఢంబు తాపమణగింపవనా! (VI—26)

ఇందలి శబ్ద చిత్రణము ప్రబంధకవు లందరు నవలంబించునదే-

"సీత నెలయింప వచ్చి నాచేత బొలియు
మాయలేడి నిశాకరు మఱుగుజొచ్చి

ఇపుడు పగ దీర్చుకొనవచ్చెనేమొ కాక
యేమి చేసితి లాతికే సోమునకును? (VI—31)

మఱియొకచోట మలయమారుత బాధను తాళలేక హనుమంతు నితో చెప్పు చోటు-

"నాలి తనంబు నేర్చుకొని
నక్కుచు నక్కుచు వాడవాడ వే
లా లవలీ లతావళి కె
లంకులనుం డిటు వచ్చివచ్చి దం
భోళియు బోలె మీదబడి
పోయెడు బల్మిఱు పిల్చి తెల్పవే
తాళుకొనంగనీయనుగు
తండ్రికి ధన్యవిచార! మారుతీ! (VII—47)

మలయానిలమును పాలంభించు తరుణమున ప్రక్కనున్న హనుమంతుని జూచి యతడు వాయుపుత్రుడు గాన పితృనింద జేసితివే యని యులికిపడెనట.

## 12. వివాహ వర్ణనము

"వివాహే స్నాన శుభ్రాంగ భూషా తూర్యత్రయీరవాః
వేదీ సంగీత హోమాదిలాజ మంగళ వర్తనమ్"
(16-వ మరీచి)

రామాభ్యుదయమున శ్రీ సీతారాముల వివాహము ఆర్ష పద్ధతిలో గాక, దేశీయ పద్ధతిలో సంపన్నులగు ఆంధ్రుల యిండ్లలో జరిగి నట్లు జరుపబడినది. శ్రీరాముని పెండ్లికొడుకుం జేయుట, కల్యాణ మండప ప్రవేశము, స్త్రీలు రామునకు స్నానాదికము జేయించుట, అలంకరించుట. మున్నగునవన్నియు బాలకాండ భాగమున

ఇదివరకే వివరింపబడినవి. సరియైన వివాహ మంగళ కార్యము జరుపబడిన తీరునకు ఉదాహరణముగా రెండు మూడు పద్యములను మాత్ర మీ క్రింద నిచ్చెదను—

''ముత్తియంబులు దోయిళ్ళ ముంచి ముంచి
కాంచు వారల హర్షాబ్ధి ముంచి ముంచి
మించి తన చేయిమీదు గావించి మించి
విభుడు తలఁబ్రాలు వోసె నవ్వేలదిమీద (IV—120)

''సరసిజ గంధు లెచ్చరిక
సల్ప గరంబుల దోయిలించి దా
శరథి శిరః కిరీటమున
జానకి ముత్తెపు సేసజల్లె ని
ర్భరమతి గంగ మేరు శిఖ
రంబున శుభ్రతరంగ శీకరో
త్కరములునించు చందమున
కంకణనాద వినోద మొప్పగన్'' (IV—122)

''హాటక గర్భ దైవత మ
హర్షులు దీవన లియ్యగా నిరా
ఘాట మరుధ్వధూ మధుర
గానము నింగి జెలంగ జానకీ
పాటల గంధి కంధర శు
భప్రద వేళ ఘటించె నాజగ
న్నాటక సూత్రధారి రఘు
నాథుడు మంగళసూత్ర మయ్యెడన్'' (IV - 123)

## 13. పుత్రోదయ వర్ణనము

"కుమారే శస్త్రశాస్త్ర శ్రీకళాబలగుణోచ్ఛ్రయాః
వ్యాహాళీఖురళీ రాజభక్తిః సుభగతాదయః"

(కావ్యాదర్శం 1-17)

పైని పేర్కొన్న వర్ణనీయ విషయములు పుత్రోదయ కాలము నాటి యానంద సమయమునకు సరిపోవు. పుత్రులు పెరిగి శస్త్రాస్త్ర వేదశాస్త్ర విద్యలు నేర్చి క్షత్రియోచిత వ్యవహారము గ్రహించు నాటికి సరిపోవును. ఈ విషయము లన్నియు రామాభ్యుదయమున చాల సంగ్రహముగా నాలుగైదు చిన్న పద్యములలో చెప్ప బడినవి. ఇక పుత్రోదయ కాలమునాటి ఆనందానుభవమునకు సరిపోవు పద్యములు రామాభ్యుదయమున లేకపోలేదు. వానిలో కొన్నింటి నిట నుదాహరింతును.

"ఆ హరి దశ్వకులంబున
శ్రీహరి దైత్యారి యవతరించెన్ లీలా
బాహుజుడై కౌసల్యా
మోహనతర గర్భశుక్తి ముక్తాఫలమై" (III—108)

"నెలలు తొమ్మిది మోచి నిర్నిద్రధాము
రామచంద్రుని గన్న యారామతోడ
నొక్క నెల మోచి పతిమేన నొరగు గౌరి
తారకారాతి జనయిత్రి ధాత్రి సరియె" (III—111)

"దైవత హాని కార్య పర
తంత్రుల బుత్రుల గాంచె గాన నా
నావిధ పుణ్య దానకల
నం బితృతృప్తి విధాయియై జగ

త్పావనుడై ఋణత్రయము
బాపుకొనెన్ భళి! మేదినీ సుధాం
ధో విభు మూర్తి యా దశర
థుండు మనోరథ సిద్ధి సంధిలన్'' (III—128)

''తనయుల నలువుర చే
నజ్జనపతి వక్త్రముల విధి భుజంబుల హరియున్
వనధుల వరుణుండును బ్రా
మినుకుల జన్మమును బోలి మిగులం బొలిచెన్.'' (III—156)

## 14. మంత్ర (సంధి విగ్రహ) వర్ణనము

కావ్యాదర్శమున మంత్ర మిట్లు నిర్వచింపబడినది.

''మంత్రః మంత్రణా, రిపుజయార్థం ప్రధాన పురు
షైస్సహ గుప్తసంభాషణమ్-'' (1-17 శ్లోకమునకు వృత్తి)

వాల్మీకి రామాయణమున నీ విషయము చాల సర్వాంకషముగ బ్రయోగింపబడినది. యుద్ధకాండము ఎనిమిదవ సర్గమున వజ్రదంష్ట్రుడు రావణునితో ''మాలో కొంతమంది మానవ వేషములతో శ్రీరాము నొద్దకు బోయి—

''ప్రేషితా భరతేన స్మభ్రాత్రా తవయవీయసా
స హి సేనాం సముత్థాప్య క్షిప్ర మే వోపయాస్యతి'' (15)

అని నమ్మించిన పిదప మే మేశూల శక్తి గదాధరులమై వానరులను ప్రహరింతుము - శ్రీరామాదులు దిగ్భ్రమ చెంది మరణింతురు అని చెప్పను. ఇరువదవ సర్గమున రావణుడు శుకుడను వానిని సుగ్రీవు నొద్దకు భేదోపాయము బ్రయోగింప పంపును. రావణుని మాటలుగా వాడు సుగ్రీవునితో

"అహంయ ద్వహారం భార్యాం రాజపుత్రస్య ధీమతః
కింతత్ర తవ సుగ్రీవ! కిష్కింధాం ప్రతిగమ్యతామ్" (II-12)

అని శ్రీరామునితోడి స్నేహము వదలి తనతో చేరునట్లు ప్రార్థించును. అట్లే ముప్పదియైదవ సర్గమున మాల్యవంతుడు రావణునకు నీతి గరపుచు తన వయస్సును పురస్కరించుకొని

"హీయమానేన కర్తవ్యో రాజ్ఞా సంధిస్సమేనచ।
నశత్రు మవమన్యేతజ్యాయా న్కుర్వీత విగ్రహమ్॥
(యుద్ధ - 35 - 9)

... ... ... ... ...

యస్మా ద్దేవర్షయ స్సర్వే గంధర్వాశ్చ జయైషిణః।
విరోధం మాగమస్తేన సంధిస్తేతేన రోచతామ్॥"
(యుద్ధ - 35 - 11)

"బలహీనునితో యుద్ధము చేయుట, బలవంతునితో సంధి చేయుట, రాజనీతి. దేవతలు, ఋషులుకూడ శ్రీరామునకే జయము కోరుదురు. కాన నతనితో సంధిమేలు" అని మాల్యవంతుడు రావణునకు నీతి చెప్పెను. ఇది సంధివిగ్రహ తంత్రము.

రామాభ్యుదయమున రావణుడు రాముని ఋక్ష వానర సేనం జూచి యద్భుతరసమున మునిగి, వీరవిస్ఫూర్తిని అడచెనట. ఇట్టి పట్టుల రాజులు సాధారణముగా ఆప్తులను, మంత్రులను, శ్రేయోభిలాషులను అభిప్రాయమడుగుట పరిపాటి. దానిని బట్టి రావణుడు—

ఇటులాశ్చర్య నిమగ్నుడై మఱియు సం
    వీక్షించి వేవచ్చి యొ
క్కటనాప్తుల్ భజియింప నేకతమునం
    గూర్చుండి కర్జంబు లె

> కైటు వచ్చెం గనుగొంటిరే కపిబలం
> బియ్యం బుధిం బాయ పు
> చ్చుటకుం జొచ్చుటకున్ సమర్థమని తో
> చున్ నామదిన్ నాఁడున్'' (VII—52)

ఇచ్చట విభీషణు డొక్కఁడే రావణునకు సంధిచేయుమని చెప్పెను. తక్కిన వారందఱు యుద్ధమే కావలెనని వీరములు పల్కిరి. ఐనను రామాభ్యుదయమున నీ 'మంత్రము' సాంగోపాంగముగ ఆచరింపబడ లేదు.

## 15. దండయాత్రా (ప్రయాణ) వర్ణనము

> "ప్రయాణే భేరి నిస్స్వాన భూకంపబలధూళయః।
> కరమోష్ఠ ధ్వజ చ్ఛత్ర వణి క్షుకణావేసరాః"॥
> (16-వ మరీచి)

యుద్ధమునకు సేనను నడుపుట దండయాత్ర యనబడును. సామాన్యముగా పురాణములలో సేన చతురంగబలయుతము. అనగా, రథ, గజ, తురగ, పదాతులు గలది. ఇచ్చట శ్రీరాముని సేనలో రథ. గజ, తురగములు లేవు. ఋక్ష, వానరులే పదాతులు. శ్రీరామ లక్ష్మణు లిరువురే మానవులు, క్షత్రియులు, సుగ్రీవుడు వారితో—

> "వాయునందనుండు వాలినందనుఁడును
> దేవరకును సూర్మిళావరునకు
> త్రోవ బోవునపుడు తురగసారథులకు
> నాసపడని తేరు లవనినాథ!'' (VII—29)

అని హనుమదంగదులను తమ భుజస్కంధములపై శ్రీరామ లక్ష్మణులను మోసికొని నడువ నియమించును. అప్పుడు శ్రీరాముడు హనుమను పొగడి—

అని చేర దిగిచి గాఢాలింగనంబున
బాంధవ స్నేహ సంభ్రమము నెఱపి
యతని మనోవాంఛ కనుగుణంబుగత దీ
యస్కంధమున నెక్కి యవ్విభుండు
గదలె లక్ష్మణుడు నంగద భుజాశృంగాధి
రూఢుడై యన్న పిఱుంద జనియె
కటురట త్కపికంఠ పటు హానిష్ఠురముగా
సేనల నడపించె భానుజుండు
బలభరంబుచేత భారత వర్షంపు
టుర్వి చెఱగు మోచియున్న దిక్క
పడగ లొరగ శేషఫణి కగ్రభాగంబు
నులకచుట్ట కంటె సెలగబడియె'' (VII—32)

''ఇది మహాసంరంభ మెరుగని త్తమటంచు
మూడులోకములకు ముట్టనార్చి
ఎదుకు నోరెత్తంగ నిత్తుమెంతమునంచు
కొండల గవులలో గుండ్లు గొట్టి
యివి దూఱి తూలిపో నింతయేమిటికంచు
దుర్గమారణ్యముల్ ధూళి గలిపి
యీలీల మున్నీటి నెచ్చనీరాదంచు
నెల్ల కూలంకషలింక ద్రావి
వనరుహాప్త తనయ వాహినీ వానర
వరులు సహ్యమలయ గిరులు గడచి
త్రోవలంక దెసకు దుమ్ము తూ న్పెత్తుచు
చనిరి వెసమ హేంద్రశైలమునకు'' (VII—34)

ఇట్టి శ్రీరాముని సేనను, రావణ చారులగు శుక సారణులు మారు
వేషములతో వెళ్ళి దర్శించి వచ్చి దాని యజేయతను రావణునకు

నివేదింతురు. ఆ సేన శ్రీరాముని విజయలక్ష్మివలె నున్నదట. ఈ వర్ణనము శుకాసారణుల నోటగాక కవి వాక్కుగా చెప్పించి యుండిన బాగుండెడిది.

ఆ పద్య మీ క్రిందిది:—

కలిత సుగ్రీవయై కడు బ్రశస్తి వహించి
కుముదాప్త ముఖవికాసమున బొలిచి
ప్రకట రంభోరు వైభవమున బాటిల్లి
కేసరి మధ్యయై కీర్తిగాంచి
స్ఫురిత లీలాంగద భూషితయై మించి
తగు గజగామిని యగుచు నలరి
ఘనచక్రజఘన వైఖరి జాడరంజిల్లి
కార్ముక భ్రూభంగి కరము మెఱసి
కంటె దశకంఠ! యలరు నిక్ష్వాకు వంశ
నృపుని ముందర సాక్షాత్కరించు విజయ
లక్ష్మియును బోలె భువన కూలంకషోగ్ర
విక్రమోదార వానర వీరసేన'' (VII—193)

అట్లే రాముని సేనయు, రథ, తురగ, గజ, పదాతులతో గూడి ఫౌజు దీరిన విధమును రామభద్రయ్య ఇట్లు వర్ణించినాడు.

''అనికి మేడలు తోడు చనుదెంచునో వీరి
కనబాల్చు నున్న తస్యందనములు
ఖుర ధూళిశరధి గూర్కొన నోపునో యన
దగు సేతు బంధంబులకు గుఱ్ఱాలు
అవసరంబైనప్పు డంబోధి నావఁ జా
తనువు కొండల నంగ దనరు కర్తులు

నా లంకలోనున్న కాళరాత్రికి గల
కొడుకులు నా దోచు ఘోరభటులు
కలిగి యరుగుదేర గాహాళరావంబు
భటుల రవము శంఖ పటహానినద
మెనసి బలియ వెడలి యింద్రజిత్ప్రముఖులు
ఫౌజు దీర్చి రొక్క బయలనపుడు" (VII–274)

## 16. యుద్ధ వర్ణనము

"యుద్ధాతు వర్మబలచార రజాంసితూర్య నిర్ఘాత సనాద
శరమండప రక్తనద్యః।
ఛిన్నాతపత్ర రథ చామర కేతు కుంభియోధా మరీవృత
భటా సుర పుష్ప వర్షాః॥" (16-వ మరీచి)

వాల్మీకి రామాయణమున పది పండ్రెండు సర్గములవరకు వ్యాపించిన ఖర దూషణ త్రిశిరులతోడి శ్రీరాముని యుద్ధము రామాభ్యుదయమున మిక్కిలి సంక్షేపింప బడినది. యుద్ధకాండమున జరిగిన యుద్ధములు లెక్కకు మిక్కిలి యుండుటచే వానిని పాఠకులకే వదలి ఖరాదులతోడి యుద్ధమునుండి రెండు ఉదాహరణముల నిత్తును.

"త్రిశిరు శర వృష్టి నాశుగోద్వృత్తి నడచె
రోష భూషణ దూషణ భీషణాస్త్ర
తతుల ప్రత్యస్త్రముల ద్రుంచె దాకసీక
థాక కాకుత్థ్స వంశ సుధాకరుండు" (V–152)

"శశిరో చిష్ణు కళా కలాప వదనా
బ్జాతుండు రాజన్య లో

క శిరో రత్నము చాపనైపుణ పరి
    ష్కారుండు నానాసు ధీ
పశిరోలంబు శరణ్యా పాదకమల
    ద్వంద్వుండు మాత్యత్తర
త్రిశిరో దూషణ కంఠ లుంఠన మొ
    నర్చెం జండ కాండంబులన్'' (V—153)

## 17. దౌత్య వర్ణనము

''దూతే స్వస్వామి తేజః ప్రవిక్ర మౌన్నత్య కృద్వచః।
శత్రు క్షోభకరీ చేష్టా ధర్ష్యం దౌష్ట్యమ భీరుతా।''

(కావ్యా - । - 17 శ్లో క్రింద)

కావ్యాదర్శ వృత్తియందు దూత నిర్వచన మిట్లున్నది. ''దూతః ప్రేష్యోహి స చనిసృష్టార్థ, మితార్థ, సందేశహారక భేదేన త్రివిధః'' అని నిర్వచించి 'అంగదుడు మితార్థ నాయక దూత యని పేర్కొనబడినది. కావున రామాభ్యుదయము నందలి అంగద దౌత్య ఘట్టమునుండి రెండు మూడు పద్యము లుదాహరింతును. అంగదుడు రావణునితో ననుట—

''నిను తన చంక వైచుకొని
    నీరనిధాన చతుష్టయంబునన్
జనిచని సాంధ్య కృత్యములు
    సల్పెడు నంతకు ద్రిప్పి తెచ్చి పెం
పున నటవైచి కోంకరలు
    పోయిన నీ మెయి చక్కనొక్కిపో
ననిచిన వాలినందనుడ
    నంగదుడన్ దశకంఠ! వింటివే'' (VII—258)

"ఇంకనైనను జానకి నిచ్చి శరణు
చొచ్చి తేని యయోధ్య నీ కిచ్చు విభుడు
నాడెలంక విభీషణునకు నొసంగి
నాడునే డింక నీ కది వేడరాదు" (VII—262)

"అర్జునుండు గాడ యల్లెగట్టి విడంగ
కాడు వాలికేల గట్టి విడువ
జానకీ విభుండు సత్య పరాక్రముం
డెరిగి నడువు ప్రాణ మిష్టమేని" (VII—263)

అంగదు డిచ్చట శత్రుక్షోభకరములైన చేష్టల నెన్నింటినో చేసియున్నాడు.

## 18. రాజ (విభు) వర్ణనము

"నృపే కీర్తి ప్రతాపాజ్ఞా దుష్టశాంతి వివేకితా,
ధర్మప్రయాణ సంగ్రామ శస్త్రాభ్యా సనయక్షమాః"
(16 వ మరీచి)

రాజ (విభు) వర్ణనమే నాయకాభ్యుదయ వర్ణనము. ఈ గ్రంథమున నాయకుడు శ్రీరాముడే కాన రామాభ్యుదయ మంతయు నాయకాభ్యుదయ సంపాదియే యగుట అచ్చటచ్చట కొంచెముగా ఉదాహరింపవలసిన అవసరమే లేదు. రావణపరిహారము చేసి జానకితో తిరిగి యయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడై లోకకల్యాణము సంతరించిన శ్రీరామ ప్రభుని జీవితము లోకాభ్యుదయ సంపాది యైనది.

# 14

## విశేషార్థ యుత చమత్కార రచన



రామభద్రయ్య రచనలోని పెక్కు విశేషములను గూర్చి యిదివరకే చర్చించి యున్నాను. రామాభ్యుదయము ప్రబంధమే యనియు తేల్చుట జరిగినది. రసైక్య, వస్త్వైక్యములను గూర్చిన వివాదము మనుచరిత్రమువంటి వానికే తప్పలేదు. ఇక ఎట్లో ప్రబంధమని సరిపెట్టుకోవలసిన రామాభ్యుదయమున అట్టి చర్చ నిష్ప్రయోజనము. ఇచ్చట ఏ రసమునకును క్రమపరిణామము లేదు. శృంగారమా? వీరమా? శృంగార మన్న రతిభావమున కంటె, ఉత్సాహభావమునకే రసత్వసిద్ధి యున్నది. వీర రస మన్నచో ఆంధ్ర ప్రబంధ నిర్వచనమునుండి భేదించును. కావున ఆ చర్చ పఠితలకే వదలివేయుట మంచిది. ఇదివరకు కవి పండితు లలో కావ్యమున కాత్మ యెద్దియను విషయమును గూర్చి భర తుని కాలమునుండి మహిమభట్టువరకు చర్చజరిగినది. రామ భద్రయ్య కావ్యాత్మగా దేని నంగీకరించెనను ప్రశ్నమునకు సమా ధానము ఆయన రచనలోనే యున్నది చూడుడు.

"నీరవి మండలం బయిన
నింగియు, దక్షిణలేని యాగమం
భోరుహ శూన్యమైన జల
ముల్ ధ్వని చాలని కావ్యమున్ సదా

చారము బాయు బ్రాహ్మ్యము న
    శాంతి తపంబు, నపత్యదూర సం
సారము నొక్క తీరని వి
    చారము సేయు విభుండు వేముఋన్'' (II—67)

దశరథుడు సంతానము లేమికి చింతించుచు ''ధ్వని చాలని కావ్యము, అపత్య దూర సంసారము ఒక్కతీరు'' అని ఉపమించినాడు. దీనినిబట్టి రామభద్రయ్య ''ధ్వనినే కావ్యాత్మ''గా అంగీకరించెనని చెప్పక చెప్పినట్లయినది.

క్వాచిత్కముగా, సందర్భమును పురస్కరించుకొని యొక్కొక్క రసమున కొక్కొక్క యుదాహరణము రామాభ్యుదయమున గుర్తింప వచ్చును. హాస్యరసమున కొక్క చక్కని యుదాహరణము చూడుడు.

''ఎంత గడ్డంబైన వింతలే దొసపరి
    తీరుగా బవిరి దిద్దింపవచ్చు
నొసలి వేలిమిబొట్టు మసిమీద మృగనాభి
    తిలకంబు బటువుగా దీర్పవచ్చు
ధవళంబులైన దంతములపై పీడెంపు
    కెంపు పెందళుకు గల్పింపవచ్చు
పులితోలు విడిపించి జిలుగు దుప్పటి పురిం
    గులవల్లెవాటు మేకొలుపవచ్చు
కోఱ సిగ వేయు చోటనే కొమ్ముపుట్టి
చెఱిచినది కాని యెంతైన జేయవచ్చు
కడపట భుజంగ వేషంబు వడసినప్పు
డుండు బోగండు మీఱి యిమ్మెండ తపసి'' (II—110)

''కోఁకసిగ వేయుచోటనే కొమ్ము పుట్టి చెలిచి''నదట ఎంత సుకుమారమైన హాస్యము!

అర్థభేదముగల శబ్దములు వాడియో, అభంగ, సభంగ శ్లేష ప్రయోగించియో, రామభద్రయ్య మంచి చమత్కృతులు సంతరించియున్నాడు. అట్టివి ఈ గ్రంథమున వందల సంఖ్యలో గలవు. అట్టివాని ప్రయోగములకై రామభద్రయ్య ఎన్నియో సన్నివేశములను కల్పించుకొన్నాడు. కొన్ని చోట్ల అట్టి శబ్దచిత్రణము విపరీతముగాకూడ కన్పింపవచ్చును. కొన్ని యుదాహరణములు చూడుడు—

జానకి ఎండలో నిలచియున్నదని లక్ష్మణుడు తెలుప—
''అనవిని దాయంజని విభు
డొనరన్ భూజాను సరణ మొనరించెను తో
డనె నీడ యగుచు నెందునీ
వనితలకుం తోడునీడ వల్లభుడె కదా!'' (V—35)

భూజ _ సీత. భూజము = వృక్షము - అశ్లే
''అతుల భూజాన్వితుండ వైనట్టి నీకు
సర్వదా రామ యుతకు నిజ్జనక సుతకు
నెఱుగరా దెండవడ దేవ! యిట్టి మీ ప
దాబ్జముల నీడ నున్న నాకలత గలదె?'' (V—48)

భూజాన్వితుడు = సీతాదేవితో గూడియుండువాడు, వృక్షములతో కలసి యున్నవాడు (శ్రీరాముడు) రామయుత = శ్రీరామునితో కూడి యున్నది. ఆరామయుత = ఉద్యానవనమున నున్నది ( = సీతాదేవి) శ్రీరాముడు తృణాసనస్థుడై విశ్రమించి నప్పుడు లక్ష్మణుడు బాధపడుచు:

"వాసి ననంత భోగముల
వర్తిలు కోమల మోహనాంగ యా
హా! సుఖ పీఠి తెల్లు కస
వయ్యెనె నీకిపుడంచు నా సుమి
త్రా సుతుడన్న నన్న రఘు
రాముడు వల్కె సదాశరాసనా
భ్యాసము వంశ సిద్ధము క
దా విలుకాండ్రకు నంచు నయ్యెడన్" (V–46)

శర మనగా తెల్లు కసవు. అది ఆసనముగా కూర్చుండుట శరాసనాభ్యాసము. శరాసన మనగా కోదండము. దానితో బాణపాతాభ్యాసము చేయుట క్షత్రియులకు వంశాచార మే కదా! యనుట అట్టిదే శరభంగ సందర్శన సమయమున మరొకటి.

"అని నిరవరోధుని విరాధునపుడు గూల్చి
యంత శరభంగ దర్శనం బధిగమించె
కాని శరభంగ దర్శనం బూన డెన్న
డాహవంబున నమ్మహా బాహుబలుడు" (V—110)

శరభంగ దర్శన మధిగమించె = శరభంగ మహర్షి దర్శనమును పొందెను. శర + భంగ దర్శనం బూనడు = ప్రయోగించిన బాణము వ్యర్థమగుట ఎన్నడు చూడదు. అని యర్థము. శ్రీరామ లక్ష్మణులు పంపాసరస్తీరమునకు జేరినపుడు

"మత్స్య కూర్మావతార సామగ్రి గాంచి
యహి మకర వంశమున బొల్చి యహరహంబు
లక్షణాన్విత గతి దనలాగు దొరయు
నట్టి పంపా సరోవరం బపుడు గాంచె" (V–255)

శ్రీరాముడు అన్నివిధముల తన్నుపోలిన పంపాసరస్సును చూచె నట. మత్స్యకూర్మావతారముల సమగ్రత (నారాయణావతార మైన) శ్రీరామునందు గలదు. అట్లే మత్స్యముల, కూర్మముల భిన్నజాతులు సమగ్రముగా నా కొలనునందున్నవి. అహిమ కరుడు = సూర్యుడు. ఈ వంశమున బుట్టినవాడు శ్రీరాముడు. అహి = పాము, మకర = మొసళ్ళ జాతులు గలది పంపా సరస్సు. తాను సదా తమ్ముడైన లక్ష్మణునితో కూడి యున్న వాడు. లక్ష్మణ యనగా ఆడసారసపక్షి (ఆడ బెగ్గురు) పంపా సరస్సునందు ఆడ బెగ్గురు (నీటి పక్షి) లున్నవి.

అశోకవనమున శింశుపా వృక్షము క్రింద క్రూరాత్ములై మానవ మాంసము నాప్యాయముగా తిను పెక్కురు రాక్షస స్త్రీల నడుమ దిన మొక గండముగా గడపుచున్న సీతాదేవి వర్ణనము చూడుడు. ఎంత కళ్ళకు కట్టినట్టున్నదో?

"ఘూక కుటుంబి నీ కోటిలో నడిరేయి
　　జక్కవ జవరాలు చిక్కినట్లు
జరఠ బిడాలి కాజాలంబు లోపల
　　చిలుక ముత్తైదువ మెలగినట్లు
మత్త శిఖండి నీ మాలికలోపల
　　పాప కన్నియ తగుల్వడిన యట్లు
కితవ మృగాదన గృహిణీ గణంబున
　　లేడి యిల్లా లుమ్మలించినట్లు
వేష భీషణ దానవ వితతి లోన
తల్లడంబుల పెదవులు తడుపుచున్న
సాధ్వి రఘు వీర గేహిని జక్క జూచి
యవునో కాదో కదా యని యనిలసుతుడు" (VI—130)

వాల్మీకి రామాయణమున లేకున్నను రామభద్రయ్య తన గ్రంథమున నొక చక్కని సన్నివేశమును కల్పించుకొన్నాడు. రావణుడు దేవకిన్నర గంధర్వ కామినులను చెఱపట్టి తెచ్చెనని వాల్మీకమున కలదు. కాని వారందర నెక్కడ నుంచినదియు ఆ గ్రంథమున లేదు. రామభద్రయ్య వారినందరను రావణుడు సువేలాద్రి యందలి గుహాలలో దాచి చెఱపెట్టినట్లు ఊహించి - నరకాసుర సంహారానంతరము శ్రీ కృష్ణుడు రాచకన్నియల చెఱ తొలగించినట్లుగా రావణ గ్రహీతలైన ఈ కామినులకు శ్రీరాము చేత హనుమంతుడు చెఱ వదలించినట్లు కల్పించినాడు. అట్లు వదలబడిన స్త్రీల స్థితి నెంత మనోజ్ఞముగా రామభద్రయ్య వర్ణించినాడో చూడుడు—

"ఉరిబడి వెడలి క్రేళ్ళుఱుకంగ జూచుచు
  బెదురుచు చను లేటి కొదమలనగ
భీమ జాంగలిక పేటీ మోచనము గాంచి
  తలకుచు చను పాప చెలువలనగ
సముదీర్ణ పంజర స్థానంబు వెలువడి
  యళుకుచు చను ముద్దు చిలుకలనగ
వలలకు జిక్కి వెల్వడి లేచి ఱెక్కలు
  జాడించి చను నంచ చానలనగ

చెఱల విడివడి రామ! జేజే యటంచు
తవిలి మ్రొక్కుచు తమ యథాస్థానములకు
చనిరి తడయక నలుగడల్ గనుచు దివిజ
గరుడ గంధర్వ కిన్నర కంజముఖులు" (VII—156)

ఇంకను పెక్కు విధములగు శ్లేషలు, అలంకారములు ముక్తపద గ్రస్తములు, లెక్కకు మిక్కిలిగా గలవు. గ్రంథ విస్తర భీతిచే నింక నొక్క పద్యమును మాత్ర ముదాహరింతును. బాలుడగు శ్రీరాముని దాదులు చమత్కరించుటను కనుడు—

"పాలింపు మిజ్జగంబుల
పా లింపుగ ద్రావి చలము వాటింపకు మా
పాలింటి వాడవై రే
పాలింటికి వచ్చినప్పు డరయుము మమ్మున్" (III—133)

# 15

# సంస్కృత సమాసములు



రామభద్రయ్యకు సంస్కృత భాషా వ్యాకరణములపై మిక్కిలి యధికారము కలదనుటకు ఆయన రామాభ్యుదయమున ప్రయోగించిన అతిదీర్ఘములగు సంస్కృత సమాసములే సాక్ష్యము. అచ్చటచ్చట దండకారణ్య వర్ణనాదులగు గద్యములలో ప్రయోగించిన సమాసములే కాక ఏక సమాసములుగా కూర్చిన సీస పద్య పాదము లెన్నియో గలవు. అవి యన్నియు నిర్దుష్టములు. ఉదాహరణమునకు దశరథుడు వేటాడబోయిన కానన వర్ణనము-

"సింహనఖాంకురచ్ఛిన్న వారణకుంభ
జనిత ముక్తాఫల శర్కరిలము
సమద సూకర పరస్పర భీకరా ఘాత
శిథిల దంష్ట్రా చూర్ణ సికతలంబు
గంధ సింధుర ఘటాకట కటాహస్ర వ
ద్బంధుర దానాంబు పంకిలంబు
దవ గంధవహ బంధు దహ్యమానానేక
కౌశికా గురు ధూప గంధిలంబు

పృథుల షడ్జ స్వరోద్గీత భిల్ల పల్ల
వాధరా గీతికాకర్ణనాతి భీతి
పరవశాత్మ పటీర కోటర కుటీర
లీన ఫణి యగు నక్కాన కాననమ్మొ" (II—25)

చిత్ర కూట వర్ణనము :

కల్లోల దోలా సముల్లోల లీలా స
రాళ మరాళ వాచాల ఝరము
లుంగ లవంగాను షంగి భృంగీ జాత
సంగీత భంగీ తరంగితంబు
వాతపోతోద్ధూత వాసనా వశ లస
న్మల్లికా వల్లికా వేల్లనంబు
కిన్నరీ ఖేచరీ పన్నగీ జన గీత
సుఖద నానాగాన ముఖర శిఖర
మది కనుంగొంటె రా కా మృగాంకవదన!
మదన విశిఖా య మానా సమానకుసుమ
సముదయాపార సౌరభోచ్ఛ్వసిత దళది
శా చలంబగు చిత్రకూటా చలంబు (V—62)

అగస్త్యాశ్రమ వర్ణనము—

"తాపసోత్తమ దత్త దర్భ చర్వణ మత్త
శుంభత్కురంగికా డింభకంబు
వాచంయ మేశ్వరా ధ్వర నిరంతర హోమ
ధూమసంభన్న పాథోదపథము
మానిచక్రేశకుమార చక్రానీత
ఫలమూల కుశసమిత్పల్లవంబు
సంయమి కన్యకా జనకృతాఖిలభూజ
వల్లికా పరిణయ వైభవంబు
పర్ణశాలా తరుస్కంధ బద్ధలోహ
పంజరారూఢ కీర సంపఠ్యమాన

భాసురామ్నాయ శాస్త్రేతిహాస రవము
కలశ జాశ్రమ పదము రాఘువులు గనిరి'' (V—112)

ఇట్టి సమాసములు ప్రతిపుట యందును మనకు కన్పించును. మరొకవిధమైన క్రొత్తదనముకూడ రామభద్రయ్య రచనలో మనము చూడగలము. అది సంస్కృత భాషతో తెలుఁగు వృత్తములు వ్రాయుట. ఇట్టి రచన పాలకురికి సోమన వృషాధిప శతకమునందు చేసియున్నాడు. మరికొందరు చమత్కారమునకు చిత్రకవితోదాహరణముగా చేసియున్నారు. మన రామభద్రయ్య అట్టి కవితను దశరథుని పుత్రకామేష్టి సందర్భమున చేసిన బ్రాహ్మణ సంతర్పణలో—

''పాక విధానం చిత్రం
శాకరు చింకిం వదామి సమతా నాస్త్య
స్తోక దధి ఘృతానాం నా
నా కల్పిత ఫల రసాయనానా ''మనుచున్'' (III—21)

దేవతలు పాల్కడలిలో శయనించి దర్శన మిచ్చిన శ్రీ విష్ణుని కీర్తించుచు—

''హరయే జితమరు దరయే
తరయే భవవారి ధేశ్చ ధన్యజ నానాం
సురతరవే స్మర గురవే
స్థిర వేదమయాయ దేవదేవాయనమః'' (III—56)

''శ్రీమన్నేత్రాంచలా యశ్రిత భరణ! నమ
స్సింధు కన్యావరాయ
క్షేమా రామాయ మాయాకితన దితి భవ

శ్లేశకృత్త్వా భవాయ
శ్యామాయత్వాపతే! తేజటి హృదయ గృహ
స్థః ప్రసీద ప్రసీద
స్వామిన్ మాంపాహి పాహీశ్వర! వరద! హరే!
శార్ఙ్గపాణే కృపాళో" (III—57)

అను పద్యమును వ్రాసియున్నాడు. అట్లే తెలుగు పద్యములలో నచ్చటచ్చట సంస్కృత లోకోక్తులను చొప్పించియున్నాడు. కాని ఇట్టి పద్ధతి తిక్కన సోమయాజి కిష్టములేదు నిర్వచనోత్తర రామాయణమున ఆయన సంస్కృత మెందును జొన్ప' నని ప్రతిజ్ఞ చేసి దానిని తన రచనలలో పాటించినాడు. రామభద్రయ్య రచనకు కొన్ని యుదాహరణములు. దశరథుని వేటలో—

"నృపవరుడు నిజగజాంఘ్రి
వ్యపగత మృగతతుల గాంచియల" సర్వం హ
స్తి పదేమగ్నం "బనుపలు
కపుడు వసిన్ సార్థమయ్యెనని హర్షించెన్" (II—31)

దశరథుడు సంతానము లేమిం జంతిల్లుచు

"నిస్తుల రాజ్య శ్రీలం
భూస్తుతి గన నేమి ఫల" "మపుత్రస్య గతి
ర్నాస్తి" యని పలుకుగాదె స
మస్తాగమ చయమునను చు మది తలపోయన్" (II– 63)

"ధాత్రిః "పున్నామ్నోనర
కాత్త్రాయత ఇతి" యనంగ గలిగిన తాదృ
క్పుత్త్రుని గాంచుటయ కదా
గాత్రం బూనుటకు ఫలము గణుతింపంగన్" (II—65)

దేవతలు విష్ణువుతో మొఱలిడుచు

"మా యాపద బాపుము వా
లాయ మశక్తులము "దుర్బలస్య బలం రా
జా" యని యజేయుం ద్రిజగ
న్నాయకుఁ జక్రధరు నిన్నె నమ్మితిమి హరీ!" (III—67)

"కింకర తనన్య భజనా
తంకంబుల బడక నిన్నె తలపుదుము "నదై
వం కేశవాత్పరం" బని
పంకేరుహనాభ! దనుజ భయ ముడుపగదే" (III—68)

మాల్యవంతుడు రావణునకు నీతి గఱపుచు

"నయ శాస్త్రము లాదిగ న
న్నియు నెఱిగిన ప్రోడవీవు నే జెప్పెడిదే
మి? యభిజ్ఞ తిలక! పౌల
స్త్య! "యతో ధర్మ స్తతో జయ" యనఁ వినవే" (VII-221)

యని రచించి యున్నాడు. గ్రంథ విస్తరణ భీతిచే చాల ఉదాహరణములను వదలవలసి వచ్చినది.

# 16

## అచ్చ తెనుగు పద్యములు

'అచ్చ' సంస్కృతములో వలెనే రామభద్రయ్య అచ్చ తెలుగులోఁగూడ అనాయాసముగా, కృతక శైలిగా కన్పింపకుండ పద్యములు వ్రాయగల నేర్పరి. ఉదాహరణకు శ్రీమన్నారాయణ మూర్తి వర్ణనము జూడుడు—

"తెల్లని దీవితమ్మి నెల
 దేటివలెం దగునొక్క బాగరిన్
నల్లని వాని లచ్చి రత
 నంబును మచ్చ యెదం దలిర్ప రం
జిల్లెడు వాని జుట్టలుగు
 జందమునందిన వానిఁ బెంపు సొం
పెల్లెడగల్గు పాల్కడలి
 యిల్లటపిల్లుని గాంచి రయ్యెడన్"  (III-44)

"తోవ తమ్మి విందు కన్దోయి మించిన వాడు
 జాళువా మిసిమి పచ్చడమువాడు
కన్ను పీనుల సెజ్జనున్న పన్నియ వాడు
 తపసి డెందపు టిండ్ల దనరువాడు
కలిమి చేడియ పంట వలతి నేలినవాడు
 పుడమి వేల్పులకుఁ జేపడనివాడు

తొంటి జేజే మూఁకఁ దూలింపగలవాడు
ముజ్జగంబుల చూలు బొడ్డువాడు
సొగసి నవ్వ కనవ్వు నెమ్మొగమువాడు
కలుము లీనెడు తళుకుఁ గ్రేగంటివాడు
పేదసాదుల బ్రదికించు పెంపువాడు
పాలమున్నీటిలోన చూపట్టెనపుడు" (III—45)

ఇట్లే దశరథుని సభకు విశ్వామిత్రుడు వచ్చునపుడు, గంగానదీ వర్ణనము మున్నగు స్థలములలో అచ్చ తెనుగు పద్యములు కాన్పించును.

# 17

## తెలుగు లోకోక్తులు

సంస్కృత లోకోక్తులవలెనే, తెలుగు లోకోక్తుల నెన్నింటినో ప్రకరణోచితముగా పద్యధార కాని, శైలి కాని చెడకుండ జాగ్రత్తగా పద్యములలో చొప్పించి రామభద్రయ్య తెలుగు నుడికారపు సొంపును కాపాడినాడు. కొన్ని ఉదాహరణముల తిలకింపుడు. వనవిహార భాగమున స్త్రీలు ఊయల లూగుటను—

సలిపిరి డోలికా విహృతి
    సాటికి బేటికి నింతు లిద్ద ఱం
దుల నొక కన్న తన్న నొక
    తొయ్యలి యుయ్యెల తీగ పగ్గమ
వ్వోలదియుఁ దన్న నన్నలత
    వేనలి జూడక తాడి దన్నువా
రల తల దన్నువార లది
    రా మదిరాక్షి చెలంగి రత్తఱిన్. (I—64)

శ్రీరాముడు ఖరదూషణాదులతో చేయు యుద్ధ సందర్భమున—

ఓర్చి రణాంగణంబున ని
    జోగ్ర నిశాచర వీరసేన పే
రార్చిన గాంచి యాత్రిశిరు
    డాఖర దూషణుతొని తండు స

ప్రార్చిరుదగ్ర తేజు డని
యద్భుత మంది తలంచి "ముగ్గురం
గూర్చె నెముండదయ్యా" మని
కుందిరి యుందిరి కార్ముకాస్త్రముల్ (V—146)

వానర వీరులు సీతాదేవిని వెదకు సందర్భమున—

"ఎక్కి పెక్కు తరుల నొక్కొక్క చిగురాకె
ఎత్తి వెదక జొచ్చిరి గురుజోడి
దంతి తప్పి చనిన దొంతికుండలలోన
చేయిబెట్టి వెదుకఁ బోయినట్లు" (VI—64)

సంపాతి చెప్పిన సీతా వృత్తాంతము విన్న వానరులు తమ శ్రమ ఫలించినదని ఆనందించు సందర్భమున

"అదరిపాటొక చో జటాయువు
నన్న యన్నియు జెప్పినన్
బ్రదుకు జీవము కల్గెగా "దల
వట్టి చూచు కొనంగ మే
లెదురుగా జనుదెంచెఁ బొమ్మ"ని
యెంచుకొంచు గమించి ర
య్యుదధి యుత్తర తీరభూమికి
నొక్క యుమ్మడి మొత్తమై" (VI—70)

రామభద్రయ్య లోకోక్తుల విషయమున తనకు గల మక్కువ నిట్లు తేటపరచినాడు.

# 18

## దుష్కర ప్రాసము



అప్పకవి దుష్కర ప్రాసములకు కొన్ని యుదాహరణము లిచ్చి యున్నాడు. మన రామభద్రయ్య అంతకంటె కష్టములైన ప్రాసములనుగూడ కూర్చి మిక్కిలి సరళముగా గన్పించునట్లు రచన సాగించియున్నాడు. ఉదాహరణమునకు: శుకసారణులు శ్రీరామ సేనా విశేషములను రావణునకు జెప్పు సందర్భమున-

"ద్యుక్త్రితయంబునెం బొలుచు
దేవున కేని నజేయు లవ్విభుల్
వక్త్రియెవాణియుం బొగడ
వారల దీప్తి కవీంద్రులం జతు
ర్వక్త్రుడు నేర్చునే భుజగ
వర్యు వశంబె గణింప నింక నీ
వక్త్రిమ పూర్వ సంచిత త
పః ఫల మెట్లగునో? దశాననా!" (VII—188)

"హ స్త్యసురారి సత్కృత వ
రావధి యయ్యెనో! కాక వీరె నీ
వ స్త్యము వంశ ముం జెఱుప
వచ్చిన వానర వీరులేల పా
ల స్త్య వృథావిరోధ మక
ళంక నిలాసుత నిచ్చి రాఘవో

పా_న్త్యభిలాష పూని నిర
పాయ సుఖ స్థితి నుండ జెల్లదే?'' (VII—202)

శ్రీరాముడు తొలిసారిగా రావణ సేనం జూచి యబ్బురపడి విభీషణునితో సంభాషించు సందర్భమున—

''ఊర్ధ్వా జాండ కటాహముచ్చిచన భూ
యో భూయరుద్యన్నిజాం
తర్ధ్వానంబులు, విస్మయంబు వెనుపన్
మధ్యాహ్న మార్తాండ రో
చిర్ధ్వంసం బొనరించు కొంచునదె ప్రా
చిందో చెనకోట్పై
దుర్ధ్వాంతం బిది యేమొ కోయనిన చే
తుల్ మోడ్చి యా ధ్వనికిన్'' (VIII—77)

ఈ విధమైన దుష్కర ప్రాసాన్వితమైన కవిత్వపు తీరు ఎందరిలో గాన నగును?

పాండిత్య ప్రకర్షయందు శ్రీనాథ భట్టు మూర్త్యాది మహా కవుల కేమాత్రము తీసిపోని అయ్యలరాజు రామభద్ర కవి కవిత యందిట్టి విశేషముల నెన్నిటినైనను తిలకింపవచ్చును. ఈ కవీంద్రుని రామాభ్యుదయ కావ్యము ఆంధ్ర భాషా యోష కొక అమూల్య రత్నహారము.

# 19

## ఉపయుక్త గ్రంథ సూచిక

(సంస్కృతము)


1. అభిజ్ఞాన శాంకుంతలము — కాళిదాసు
2. అలంకార శేఖరము — కేశవమిశ్ర
3. అమరకోశము
4. అధ్యాత్మ రామాయణము
5. ఆనంద రామాయణము — సారకాండము
6. ఉత్తరరామ చరిత్రము — భవభూతి
7. కావ్యాదర్శము — దండి
8. కావ్యాదర్శవృత్తి
9. కావ్యమీమాంస — రాజశేఖర కవి
10. కిరాతార్జునీయము — భారవి
11. దశరూపకము — ధనంజయుడు
12. ధ్వన్యాలోకము — ఆనందవర్ధనుడు
13. నాట్యశాస్త్రము — భరతమహర్షి
14. నాట్యశాస్త్ర వ్యాఖ్యానము — అభినవ గుప్తపాదులు
15. ప్రతాపరుద్ర యశోభూషణము — విద్యానాథుడు
16. పార్వతీ పరిణయ నాటిక — వామన భట్టబాణుడు
17. మహాభారతము — ఆది, స్త్రీ, ఆశ్రమవాస పర్వములు
18. మార్కండేయ పురాణము
19. రఘువంశము — కాళిదాసు
20. వాల్మీకి రామాయణము — 6 కాండములు (గోవిందరాజీయాది వ్యాఖ్యాన చతుష్టయముతో)
21. సాహిత్య దర్పణము — విశ్వనాథ కవిరాజు.

(తెలుగు)

1. అప్పకవీయము — అప్పకవి
2. ఆముక్తమాల్యద — శ్రీ కృష్ణదేవరాయలు
3 ఒంటిమిట్ట రఘువీర శతకము — తిప్పయ కవి
4. కాశీఖండము — శ్రీనాథుడు
5. కావ్యాలంకార సంగ్రహము — భట్టుమూర్తి (సన్నిధానం - సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యతో)
6. నిర్వచనోత్తర రామాయణము — తిక్కన
7. నృసింహ పురాణము — ఎఱ్ఱన
8. పారిజాతాపహరణము -- తిమ్మన
9. భాస్కర రామాయణము — (హుళక్కి భాస్కరాదులు)
10. భాగవతము — పోతన
11. మహాభారతము — ఆది, విరాట, ద్రోణ పర్వములు
12. మనుచరిత్రము — అల్లసాని పెద్దన
13. రెట్టమత శాస్త్రము — అయ్యల భాస్కర కవులు
14. రామాభ్యుదయము — రామభద్ర కవి
15. వసుచరిత్రము — భట్టుమూర్తి
16. వృషాధిప శతకము — పాల్కురికి సోమన
17. విజయ విలాసము — చేమకూర వెంకటకవి
18. సకల కథా సార సంగ్రహము — రామభద్ర కవి
19. సంస్కృత వాఙ్మయ చరిత్ర — Part—II మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
20. హంస వింశతి — అయ్యలరాజు నారాయణామాత్య మున్నగునవి